# విన్నపము



ఇందలి పద్యభావములలోఁ గొన్ని సంస్కృతము నుండియుఁ గొన్ని యఱవము నుండియుఁ గైకొనఁబడినవి. కొన్ని సొంతము. 'సన్మార్గము' 'నీతిమంజరి' అను శీర్షిక గలవి అఱవమందలి 'సన్నెఱి' 'నఱుందొగై' యనువాని కనువాదములు.



# విషయసూచిక.







శ్రీరస్తు.

# నీతిగుచ్ఛము

## ౧ మాతృవందనము.

తే॥ మోచి తొమ్మిది మాసముల్ ♦ కాచి కాంచి
వలయునవియెల్ల సమకూర్చి ♦ యెలమి నించి
పెంచి పెద్దఁ జేసిన తొలి ♦ వేల్పు తల్లి
పాదములకు నొనర్చెద ♦ వందనములు.

## ౨ భారతమాత.

తే॥ రామకృష్ణాది ధన్యుల ♦ రమణఁ గాంచి
మేటి కీర్తిని జగముల ♦ మించినట్టి
దేశమాత పాదములకు ♦ ధీరభక్తి
శిరము వంచి నమస్కృతుల్ ♦ సేయువాఁడ.

తే॥ తలఁతు నిత్యంబు నీ పవి ♦ త్రంపుఁ బేరు
మఱతు నీకార్యముల భేద ♦ మార్గములను
తాల్తు నీ పాదధూళి మ ♦ స్తకమునందు
వ్రాల్తు శిరము నీ సేవకై ♦ భరతమాత !

## గాంధి స్తుతి

ఉ॥ ఒక్కొక రూపమెత్తి మొగి♦నొక్కొక దుర్ఘటమాచరించి తా
మిక్కిలి వేసరిల్లి భువి♦మ్రేఁగిన పాపములెల్ల మాన్పఁగా
నెక్కటి శాంత శూరత న♦హింసయె కైదువుగాఁగఁ బూని నేఁ
డిక్కలిఁ జక్రధారియయి♦యేపువహించిన గాంధినెంచెదన్.

## 3 దైవస్తుతి.

తే॥ దేవ! రాజ్య సుఖంబు ల♦ర్థింపలేదు
స్వర్గమును గోరలేదు మో♦క్షమును గోర
దుఃఖ తప్తులై యున్న నా♦తోడి జనుల
యార్తిఁ బాపంగ వేఁడెద♦ననుదినంబు. ౧

తే॥ ఎల్లరును కష్టములఁ దరి♦యింత్రు గాక
ఎల్లరును శుభముల వహి♦యింత్రు గాక
ఎల్లజనులకు సద్బుద్ధి♦యొసఁగుఁగాక
ఎల్లవారల నానంద♦మెనయుఁగాక. ౨

తే॥ ఎల్లజనులు సతము సుఖి♦యింత్రు గాత
ఎల్లరు నిరామయము భజి♦యింత్రు గాత
ఎల్లరును మంగళముల వ♦హింత్రు గాత
ఒక్కఁడేనియు దుఃఖి లే♦కుండుఁగాత. ౩

తే॥ కుజనులకు సద్గుణంబులు ♦ కుదురుఁగాక
సజ్జనులకు మనశ్శాంతి ♦ జరగుఁగాక
శాంతులకు బంధ దుఃఖముల్ ♦ సమయుఁగాక
ముక్తు లన్యుల దారి ద్రి ♦ ప్పుదురు గాక. ౮

తే॥ భూమి సర్వగుణంబులఁ ♦ బొందుఁగాక
ఖలులు సాధుగుణంబులఁ ♦ గాంత్రుగాక
తెలివిచేఁ బరస్పర సుఖ ♦ మొలయుఁగాక
దైవమం దహేతుక భక్తి ♦ తనరుఁగాక. ౯

తే॥ ప్రభులు భూమిని న్యాయ మా ♦ ర్గమున సతము
పాలనము సేయుదురు గాత ♦ ప్రజకు శుభము
లగుత మెల్లప్రాణులకు మే♦లగుత జగము
సౌఖ్యవంతమై యెప్పుడు ♦ సాగుఁగాత. ౧౦

తే॥ అదనునకు వాన యిచ్చుఁగా ♦ కంబుదములు
పృథివి పాఁడి పంటలతోడ ♦ వెలయుఁగాక
శాంతియుతమగుఁ గాక దే ♦ శమ్ము సతము
భయము లేకయుందురు గాక ♦ ప్రజలు మదిని. ౧౧

తే॥ సర్వ భూ తేశ్వరుండు వి ♦ శ్వ ప్రభుండు
తృప్తి నొందుఁ గావుత మన ♦ మొడఁదవలన
తుష్టమగు లోక మాతని ♦ తుష్టివలన
ప్రీతిచే నిండు నాతండు ♦ ప్రీతినొంద. ౧౨

తే॥ దేహీ యనుట కష్టంబగు ♦ దేవదేవ!
నాస్తి యనుటయు నట్టిదే ♦ యరసి చూడ
దేహి నాస్తి యనెడి యిరు ♦ తెఱఁగు పలుకు
పుట్టుకుండఁ గావుతఁ బుట్టు ♦ పుట్టువునను ౧౩

తే॥ కాలుసేతులచేఁ గాయ ♦ కర్మములను
కనులచేతఁ జెవులచేత ♦ మనసుచేత
జరుగు మంచియో చెడ్డయో ♦ సర్వము క్షమి
యింపు కరుణాబ్ధి! దేవదే ♦ వేశ! వరద! ౧౪

తే॥ అవినయంబులఁ దొలఁగింపు ♦ మమల చరిత!
విషయ మృగతృష్ణ యడఁపుము ♦ విశ్వ వినుత!
భూతదయ విస్తరింపుము ♦ భువన రూప!
సంసృతి మహాబ్ధిఁ దరియింపు ♦ సర్వరక్ష! ౧౫

తే॥ నీవె చుట్టంబు దీనుల ♦ కీవె దొరవు
దీనులందునఁ బ్రముఖుండ ♦ దేవదేవ!
ఇరు తెఱంగుల రక్షింప ♦ నీవ తగుదు
వెల్ల మా తప్పులను క్షమి ♦ యింపుమయ్య.  ౧౬

తే॥ ఎవ్వ రేరూపమున నెట్టు ♦ లెట భజింప
వారి కారూపమున నట్లు ♦ వాంఛ లొసఁగు
సర్వ దేవతా రూపుఁడై ♦ సర్వసాక్షి
యైన సర్వజ్ఞుఁ బూజింతు ♦ ననుదినంబు. ౧౭

ఆ॥ గొల్లవాఁడు పూన్కిఁ ♦ గోల చేకొని యాలఁ
గాచునట్లు ప్రజలఁ ♦ గావఁ డెవుఁడు
నొకరి కొకరిఁ జూపి ♦ యొక్కంత తెల్వి నొ
సంగి కాంచువాఁడు ♦ సర్వవిదుఁడు. ౧౮

## ౪ ధన్యజీవి.

మ॥ నరు నజ్ఞాన తమంబువోవునటు ను ♦ జ్ఞానప్రకాశంబు వా
విరి వ్యాపింప నొనర్తు నేనియును తెల్విన్ ♦ ధర్మ మొప్పారఁగా
నరయం జేసితినేని యొక్కజని దుఃఖాశ్రు♦ల్వాస న్నీఁగఁ జే
యు రహిం గల్గెనయేని నేను భువి ధ♦న్యుండౌదు నిక్కంబుగన్.

మ॥ పెడదారిం జనువాని కొక్కనికి నే♦విజ్ఞానమార్గంబు గ
న్పడఁ బాడిన్ మది వోవఁ జేసినను ది♦వ్యంబైన యాత్మన్ మనో
జడిమన్ దోరిచి ప్రేమ సత్యముల నో♦జన్నాటఁగాఁ గల్గినీ
కడనే దేవుఁడు స్వర్గముం గలవనం♦గల్గం గృతార్థుండనే.

మ॥ అనుమానంబు భయంబు నాయెడఁదఁ బా♦యంజేసి కారుణ్యమున్
నెనరుం గల్గ లయింతు నేని రహియున్ ♦ విశ్వాసమున్ దేజమున్
పొనరంగా వెదచల్లి చీఁకటి మదిం♦ బోఁగొట్టి మేల్సేసినం
దనుబాధల్ దొలఁగించి సంతసిలినన్ ♦ ధన్యుండ నౌదు న్మహిన్.

## ౫ ఉపకారము.

తే॥ ఉత్తమున కుపకారంబు ♦ నొనరఁ జేయ
ఫలము గలుగునా యని శంక ♦ పడఁగవలదు
క్రమముగా వృద్ధి నొందు టెం ♦ కాయచెట్టు
పాదములఁ గొని తలతోడ♦నీదె జలము! ౨౨

తే॥ ఉత్తమున కొనరించిన ♦ యుపకృతిఁ గన
ఱాతిమీఁద లిఖించిన ♦ వ్రాఁతఁ బోలు
నిర్దయులకు నొనర్చిన ♦ నీరము పయి
వ్రాయు వ్రాఁతను పోలు ని ♦ వ్వసుధయందు. ౨౩

తే॥ వేఁగి రోగంబు దీర్చిన ♦ వెజ్జు దాని
కోరె మగునట్లు వచ్చెడు ♦ తీరు గనక
చేయఁ గీడగు; వెకలికిఁ ♦ జేయు మేలు
కఠిన శిలపైని వైచిన ♦ కడవఁ బోలు. ౨౪

తే॥ ఉత్తములు తమ కుపకార ♦ మొక్కఁడేని
చేయకుండు వారికి కొని ♦ పోయి యుత్రు
తనకు దొరకిన రుచి పదా ♦ ర్థములు చేయి
యిచ్చుచుండుట నాల్కకు ♦ మెచ్చు కొఱకె! ౨౫

తే॥ వలయువారి కీయని లోభి ♦ కలిమిఁ బుణ్యుఁ
డొకఁడు కొనిపోయి యితరుల ♦ కొసఁగుచుండు

నొకరికే నుపయోగింప ♦ కుండు కడలి
జలముఁ గొని తెచ్చి మేఘుండు ♦ జనుల కిడఁడె ? ౨౬

తే॥ ఉత్తముఁడు తన కొఱఁతలఁ ♦ జిత్తమందు
కొనక యితరుల తాపంబు ♦ మొనసి తీర్చుఁ
జందురుఁడు తన కందువోఁ ♦ జలిపికొనక
నింగి వ్రేలి చీఁకట్లను ♦ క్రుంగఁజేయు. ౨౭

తే॥ వృద్ధియును క్షయమును గల ♦ విత్తముపయి
నిచ్చగొన కొరులకు విజ్ఞు ♦ లిచ్చుచుంద్రు
పెరుఁగుటయు తగ్గుటయు విధుఁ ♦ డెఱిఁగియె కద
తనదు కళలను సురలకు ♦ ధారవోసె. ౨౮

తే॥ ధనము వేఁడువారల కిచ్చి ♦ తండ్రి చెడియె
ననుచుఁ బుత్రు లిచ్చుట మాను ♦ కొందరు నిజము
అనఁటి ఫలమిచ్చియే నాశ ♦ మందె ననుచు
దాని కూసలు ఫలమీయ ♦ మానుకొనునె ? ౨౯

తే॥ మాఱుమేలు కోరక బుధ ♦ మాన్యులు తమ
యొడలి శ్రమకోర్చి యొరులకు ♦ నొదవుచుంద్రు
కఠినమగు పదార్థము రుచి ♦ గలుగ నమలి
పండ్లు నాల్కకిచ్చుట యేమి ♦ ఫలముఁగోరి ? 30

తే॥ కుపితులైనను ప్రాజ్ఞులు ♦ కోర్కులిత్రు
సంతసించియు మూఢులు ♦ సుంతయీరు

అరఁటి పండకున్నను కాయ ♦ లైన నొదవు
ముసిఁడి ముదిరి పండిననేమి ♦ మొనయు మనకు ? ౩౧

తే॥ కష్టములు తాఁకి యొరులను ♦ గాసిపెట్టఁ
దాము భరియించి కాతు రు ♦ త్తములు వారి
నొడలిఁ దాఁకు దండము దెబ్బ ♦ జడియ కోర్చి
యడ్డుపడి హ స్తములు కాచు ♦ టరయుమయ్య. ౩౨

తే॥ యోగ్యులకు నీయ ఫలమని ♦ యుల్లమందు
తెలిసి యుత్తము లీయరు ♦ ఖలుల కెపుడు
నీరు వరిపైరునకుఁ జల్లి ♦ నింత్రుగాని
కలుపునకుఁ గష్టపడి కట్టఁ ♦ గడఁగ రెందు. ౩౩

తే॥ మేలు మంచివారికిఁ జేయ ♦ మేలె కలుగుఁ
జెడ్డవారి కొనర్చినఁ ♦ జేటె వచ్చుఁ
బశువునకు మేఁత పెట్టినఁ ♦ బాలనిచ్చు
సర్పమునకుఁ బాల్పోయ వి ♦ సంబె యొసఁగు. ౩౪

తే॥ పర హితమె కృత్యముగ నుండు ♦ ప్రాజ్ఞవరులు
పరులచే మృత్యు వచ్చినఁ ♦ బ్రకృతి విడరు
మొనసి నఱకిన గొడ్డలి ♦ మొగమునకును
చందన తరువు తావి నొ ♦ సంగుచుండు. ౩౫

తే॥ పరుల కొఱకె వృక్షంబులు ♦ పండ్లు పండు
పరుల కొఱకె తరంగిణుల్ ♦ పాఱుచుండు

పరులకొఱకె పశ్వాదులు ♦ పాలుపిండు
పరులకొఱకె శరీరంబు ♦ పడసియుంట. ౩౬

౬ దానము.

తే॥ ఉత్తమున కొనర్చిన దాన ♦ మొప్పు గనును
అధమునకు నొనర్చిన యీవి ♦ యలరఁబోదు
వేలిమిని నేయి వోసిన ♦ వెలుఁగుఁగాని
బూడిదను వోయ నేమైన ♦ పుణ్యమున్నె ? ౩౭

తే॥ ఉత్తమున కొనర్చిన దాన ♦ మొప్పుగనును
అధమునకు నొనర్చిన యీవి ♦ యలరఁబోదు
శుక్తియందు పడిన చినుకు ♦ మౌక్తికమగు
నిసుకయందు పడిన రూప ♦ మే యడంగు. ౩౮

౭ గుణము.

తే॥ గుణము గలవాఁడు ధనముచేఁ ♦ గొఱఁతవడిన
నెక్కువగ గౌరవించెద ♦ రెల్ల వారు
పెద్దరత్నంబు సానచేఁ ♦ బిన్నదైన
మొదటికంటె నెక్కువగఁ గాం ♦ చెదరు నిజము.

తే॥ గొప్ప గుణములు కలవాఁడు ♦ కొంచెగాని
తోడఁ జేరినఁ దానును ♦ కీడుపడును

భారమగు జాతి కంబంబు ♦ బరువు లేని
తెప్పపైఁ జేర నీటిపైఁ ♦ దేలియాడు. ౪౦

తే॥ గుణము లేక కులంబున్న ♦ గురుత రాదు
కులము లేక గుణంబున్న ♦ గురుత గలుగు
చెఱకు పూవు గౌరవమును ♦ చెందఁబోదు
గన్నెరుం బూవు గరువంబు ♦ గాంచు మిగుల ? ౪౧

తే॥ రూపముంబట్టి గుణము వా ♦ క్రువ్వరాదు
కలదు సుగుణంబు రూపంబు ♦ గనని యెడను
సొగసు గల విల్లు జీవరా ♦ సులను చంపు
సొగసు లేని వీణియ విన ♦ సొంపు గూర్చు. ౪౨

తే॥ ఒక్క తల్లి గర్భంబున ♦ పెక్కు మంది
కలుగ గుణములు వేఱయి ♦ తెలియుచుండు
ఒక్క చెఱువునఁ దామర ♦ లుత్పలములు
నాఁచు గలుగ గుణములు భి ♦ న్నములె కావె ? ౪౩

### ౭ అణఁకువ.

తే॥ పెద్దవారల కణఁగినఁ ♦ బెరుఁగు మేలు
పెద్దలఁ దిరస్కరించినఁ ♦ బెరుఁగుఁ గీడు
వెల్లువకు నడంగిన తుంగ ♦ వృద్ధి చెందు
వెల్లువ నెదిర్చిన తరువు ♦ విఱిగి కూలు. ౪౪

౯ దయ.

తే॥ నెనరు లేనివారికి నిట ♦ నేల సిరియు
పరిజనంబులు గలిగియు ♦ ఫలములేదు
ప్రాఁజదువులు మూఁగకు నేమి ♦ ఫల మొనంగు?
గ్రుడ్డి కేమి ఫలంబును ♦ గూర్చు దివియ? ౪౫

తే॥ కష్టపడు దీనులం గని ♦ గౌరవంబు
గణన సేయ కుత్తము లేగి ♦ కాచుచుంద్రు
కడలి తన గొప్పతనము లె ♦ క్కిడక పోయి
యుప్పు కాల్వల నింపదే ♦ యొప్పమీఱ? ౪౬

౧౦ ఆశ్రయము.

తే॥ బలయుతుల యండఁజేరిన ♦ బల విహీను
లరుల కేమాత్రమును జంకి ♦ యడలఁబోరు
పూజనీయుఁడౌ శివు తలఁ ♦ బొందినట్టి
పాము గరుడుని గని భయ ♦ పడఁగఁగలదె? ౪౭

౧౧ మేలిమి.

తే॥ చదువు శాస్త్రంబు కొలఁదియౌ ♦ పొదలు తెలివి
తపము మేలిమి కొలఁదియౌ ♦ ధనము మేల్మి
కులము మేలిమి కొలఁది యౌ ♦ గుణము మేల్మి
జలము లోఁతుకొలందియౌ ♦ జలజ బిసము. ౪౮

తే॥ పెద్ద గేదఁగికంటెను ♦ చిన్న పొగడ
గంద మింపగుఁ బిన్నంచుఁ ♦ గడపరాదు
కడలి నీర మొడలి మన్ను ♦ గడుఁగఁగాదు
దాని దగ్గఱి చెలమ నీ ♦ రానఁదగును. ౪౯

తే॥ ఉన్నతియుఁ దక్కువయు జ్ఞాన ♦ మొనరఁ గలుగు
జాతిచేఁ గల్గునంచు నెం ♦ చంగవలదు
పాము తలను మాణిక్యంబుఁ ♦ బఱిగణింత్రు
పాలకడలి విసంబు నో ♦ ప్పరు కొనంగ. ౫౦

తే॥ చిన్నరూపున మహిమంబు ♦ చెలఁగుచుండు
పెద్దరూపయ్యు మహిమ కా ♦ న్పింపకుండు
మఱ్ఱి వి త్తిచ్చుఁ బెక్కండ్రు♦మలయు నీడ
తార్చునే నీడ యొకనికిఁ ♦ దాటిగింజ? ౫౧

తే॥ పేదతనము ధీరతచేత ♦ వెలయుచుండు
చెడినరూపు శీలముచేతఁ ♦ జెలఁగుచుండు
బీదతిండి వేఁడిమిచేత ♦ వెలయుచుండు
చింపిరైన శుభ్రతచేతఁ ♦ జెలఁగుచుండు. ౫౨

౧౨ తొడవు.

క॥ తొడవు మనుజునకు రూపము
తొడవగు రూపమున కెన్న ♦ దొడ్డ గుణంబుల్

తోడవు గుణములకు జ్ఞానము
తోడవగు జ్ఞానమున కోర్పు ♦ తోరము తండ్రీ! ౫౩

తే॥ సుందరతకు భూషణమగు ♦ సుగుణగరిమ
కులమునకు భూషణంబగు ♦ గొప్పనడత
చదువునకు భూషణంబగు ♦ నొదవు సిద్ధి
ధనమునకు భూషణంబగు ♦ ననుభవంబు. ౫౪

౧౩ క్షమ.

క॥ క్షమ బలహీనులకు బలము
క్షమ బలవంతులకుఁ దోడవు ♦ సత్యముగాఁగన్
క్షమచే లోకము వశమగు
క్షమచే లోకమున నెది య ♦ సాధ్యము తండ్రీ!

౧౪ జ్ఞానము

తే॥ తెలివిచేఁ బ్రకాశింపని ♦ దేహమునకు
కనక రత్న భూషలచేతఁ ♦ గలదె ఘనత?
మట్టి కుండకు బంగారు ♦ కట్టులున్న
నేమి గౌరవ మొదవును ♦ హెచ్చుగాఁగ? ౫౬

తే॥ ఎవ్వనికి స్వీయ విజ్ఞాన ♦ మెనయకుండు
నతనికడ శాస్త్ర మేమి చే ♦ యంగఁగలదు?

అరయఁ గనుఁగవ లేనట్టి ♦ యంధు నెదుట
నద్ద మొకయింతయేని చే ♦ యంగఁగలదె? ౧౭

తే॥ పలుకు నర్థంబు గ్రహియించుఁ ♦ బనులు కూడ
అశ్వ గజములు పూన్చిన ♦ యట్ల మోయు
పలుకఁబడని దూహించును ♦ పండితుండు
మదిని కలదెఱుంగుటె కదా ♦ మతికి ఫలము? ౧౮

౧౭ జ్ఞాని.

తే॥ తెలియు గుణము వివేకి ద ♦ వ్వులనెయుండి
ఎడ్డె దగ్గఱనుండియు ♦ నెఱుఁగలేఁడు
తేఁటి యెటనుండియో వచ్చి ♦ తేనె గొనును
కప్ప యటనుండి కనలేదు ♦ కమలమందు. ౧౯

తే॥ ఇంద్రియములైదు మూఢుల ♦ నేఁచుఁగాని
ఎఱుక గలవారి నవ్విధి ♦ నేఁచునేమి?
తేలికగు కసవును సుడి ♦ గాలి చుట్టి
త్రిప్పఁగాని ఆకింబముం ♦ ద్రిప్పఁగలదె? ౨౦

౧౯ జీవము.

తే॥ దుష్టజీవమ్ము తొమ్మిది ♦ త్రోవలున్న
యిల్లు వీడ కొదిఁగి దాఁగు ♦ టెన్న వింత

చిల్లులు గలట్టి కుండ నుం ♦ చిన జలమ్ము
వింతగాదు పోవుట నిల్వ ♦ వింతయగును. ౬౧

తే॥ తెఱవఁబడిన తొమ్మిది దార్లు ♦ వఱలు దేహ
పంజరమ్మున నొదుఁగుచు ♦ ప్రాణ విహగ
మలరి వసియించు టే చిత్ర ♦ మగును విడిచి
పాఱిపోవంగ విస్మయ ♦ పడఁగ నేల ? ౬౨

౧౭ మా ని .

తే॥ తాఁక నుసురైన వీడు చి ♦ త్తము గలారు
చత్తురే గాని లొంగరు ♦ శత్రువులకు
ఱాతి కంబంబు దొడ్డ భా ♦ రంబు మోపఁ
బగిలి విఱుగును గాని తా ♦ వంగునేమి ? ౬౩

౧౮ ఉ త్త ము లు .

తే॥ కాచినను పాలు తగ్గదు ♦ కమ్మఁదనము
కాల్చినను తెల్లఁదనము శం ♦ ఖంబు విడదు
ప్రేమ గలవారు చెడినను ♦ పెద్దవారె
ప్రేమ హీనులు కలిసినఁ ♦ బ్రియము గొనరు. ౬౪

తే॥ ఉత్తముఁడు లోకమున నొక్కఁ ♦ డుండు నేని
వానివలన నెల్లరకును ♦ వాన కురియు.

వరిమడికిఁ జల్లునీరు కా ♦ ల్వలను పాఱి
యందు గల కసవునకును ♦ చెందుచుండు.   ౬౫

తే॥ మేలువారలు చెడినను ♦ మేలువారె
అల్పులు చెడిన మర్యాద ♦ యవల లేదు
బంగరు ఘటంబు విఱిగిన ♦ బంగరె యగు
మట్టికుండ పగుల గరి ♦ మంబు గనునె ?   ౬౬

తే॥ ఆస్తి పాస్తులు కొఱయైన ♦ నధికుఁ డెప్పుడు
గుణమునందు నుంతేనియుఁ ♦ గొఱఁతపడఁడు
అఱిగి గందంపుఁజెక్క ర ♦ వంతయైన
తనదు గుణమగు వాసన ♦ పోనఁగు పమునె ?   ౬౭

తే॥ చచ్చుదాఁకను చెడుగులే ♦ సలుపువారి
కైన సుజనులు మేల్సేయ ♦ నలరుచుండ్రు
నఱకు వఱకును తరువులు ♦ నఱకువారి
కొసఁగవే చల్లనగు నీడ ♦ నుర్వియందు.   ౬౮

తే॥ ఉత్తముఁడు రాఁగ నుప్పొంగు ♦ నుత్తముండు
చెడుగు మనుజుఁడు రా నుడి ♦ వడును మదిని
మలయ పవనంబు వచ్చుచో ♦ నలరు మావి
సుడియు గాలి చేతేరఁగా ♦ సురిఁగి వాడు.   ౬౯

తే॥ ఒరుల నొవ్విని తమదిగా ♦ నుల్లమందు
తలఁచి చింత నొందుదురు స ♦ త్తములు నిజము

అవయవంబుల కగు నొవ్వి ♦ యరసి కనులు
తమవిగా నెంచి శోకించి ♦ తలరుఁ జూడు. ౨౦

తే॥ చిన్నలయ్యు రూపునఁ దెల్వి ♦ చేతఁ బెద్ద
వారలగుదురు పుడమిలోఁ ♦ బ్రాజ్ఞులెన్న
కన్నుమేరయా రూపంబు ♦ గలదో? మఱియు
మింటివఱకు వ్యాపించెనో ♦ కంటిపాప? ౨౧

తే॥ ఉన్నత మనంబు గలయట్టి ♦ యుత్తమజ్ఞు
లిడుమ లోక కోటి వచ్చిన ♦ జడియఁబోరు
చందురుని యందుగల జింక ♦ జడియునేమి
భూమిపైఁ దిరుగాడెడి ♦ పులులఁ గాంచి? ౨౨

తే॥ వలయుఁ గావలి నగుబాటు ♦ పడకయుండ
నల్పులకు గొప్పవారల ♦ కట్లు వలదు
కట్ట గట్టిగాఁ గొలనికిఁ ♦ గలదో? కడలి
కున్నదో? నీవ యోచింపు ♦ మురుగుణాఢ్య! ౨౩

తే॥ ధనము హెచ్చుకొలంది ను ♦ త్తముఁడు తగ్గు
నది నశించెడు వేళ ధై ♦ ర్యంబు నొందు
పండ్లు పండఁగాఁ బెనుమ్రాను ♦ వంగియుండి
ఫలము క్షీణింప నిట్టక ♦ నిలుచుఁ జూడు. ౨౪

తే॥ ఉత్తముఁడు తనస్థితి చెడ ♦ నుమ్మలించు
అల్పుఁ డున్నతస్థితి చెడ ♦ నడలఁబోఁడు

దంతి ప్రాణమే విడుచును ♦ తప్పిపడిన
చీమ పడినను చావక ♦ చెలఁగుచుండు. ౧౫

తే॥ కొందఱే యుందు రుత్తముల్ ♦ కువలయమున
పెక్కు రుందురు నీచులు ♦ లెక్కలేక
గనులలో రత్నములు కొద్ది ♦ గాని దొరకు
గులకఱాలు లెక్కకు మీఱి ♦ కలుగ వేమి? ౧౬

తే॥ బంగరు పుటంబు పెట్టిన ♦ వన్నె హెచ్చు
సాన నఱుగ వన్నియ హెచ్చు ♦ మానికంబు
గాయపడు వీరునకుఁ బరా ♦ క్రమము పెరుఁగు
కష్టములు రాఁగ సుజనుని ♦ గరిమ యలరు. ౧౭

తే॥ భస్మమయ్యును శంఖంబు ♦ వన్నె విడదు
పాలు విఱిగినఁ దనరుచి ♦ వదలకుండు
ధనము లేకున్న దాత లే ♦ దనఁగఁబోఁడు
కష్టములు రాఁగ సుజనుండు ♦ క్రమము విడఁడు. ౧౮

తే॥ చేటవలె దోసములను త్య ♦ జించి బుధులు
గుణముల గ్రహించి మోదంబు ♦ గొనుచునుంద్రు
జల్లెడవలె గుణంబుల ♦ జాఱ విడిచి
దుర్జనులు గొనుచుందురు ♦ దోషములను. ౧౯

తే॥ విద్యయును శక్తియు ధనంబు ♦ విబుధులకగు
జ్ఞానమునకు సంరక్షకు ♦ దానమునకు

ఖలులకెన్నఁ దద్విపరీత ♦ గతిని తనరు
వాదునకుఁ బరపీడకుఁ ♦ బ్రమదమునకు. ౧౦

తే॥ ఘనులకే గొప్ప పదవులు ♦ గలుగుచుండు
వారికే గొప్ప యాపదల్ ♦ వచ్చుచుండు
విధునకే గాక నక్షత్ర ♦ వితతికున్న
వర్ధిలుట క్షీణమొందుట ♦ వరగుణాఢ్య ! ౧౧

తే॥ అడుగుము గుణంబు రూపంబు ♦ నడుగవలదు
అడుగు నడవడి వంశంబు ♦ నడుగ వలదు
అడుగు సిద్ధిని తనవిద్య ♦ నడుగవలదు
అడుగు భోగంబు ధనము నీ ♦ వడుగవలదు. ౧౨

తే॥ కలిమి సద్గుణ హీనున ♦ కలరె ననుచు
బుధుఁడు చూచి దుర్గుణములు ♦ పొందఁగలఁడె ?
మేటి రతనాల సొమ్ములు ♦ మిగులఁ దాల్చు
జారిణిం గని కులసతి ♦ జార యగునె ? ౧౩

౯ వి ద్యా ం ము లు.

తే॥ రాజునకు పండితునకు గా ♦ రవమునందు
భేద మరయ విద్వాంసుఁడే ♦ పెద్ద యగును
రాజు తనదేశమందె గా ♦ రవము గాంచు
ఎల్లయెడల విద్యావంతుఁ ♦ డెనయు మేల్మి. ౧౪

తే॥ స్వర్ణ భూషిత నృపతులు ♦ పండితులకు
సాటి గానేర రెన్నఁగా ♦ జగమునందు
నగలు గల్గిన యన్నియం ♦ గములఁ నగల
నిడక కాంచెడు కనులతో ♦ నెనయఁ గలవె? ౧౫

తే॥ చదువరియు మడియఁడు నొక్క ♦ చందమైన
గుణముఁబట్టి వేఱగుచుండు ♦ గణుతియందు
క్షీర నీరంబులను వేఱు ♦ చేయు గుణము
వలన కొంగలలో వేఱు ♦ పడదె హంస? ౧౬

తే॥ చదువరి కురూపియయ్యును ♦ సభల వెలయు
వెడఁగు రూపరియయ్యును ♦ వెలయఁ డట్లు
గంద మింపయి కురువేరు ♦ ఘనత గాంచు
కంటి కింపయి మోదుగు ♦ ఘనత గనునె? ౧౭

తే॥ పేదయయ్యు విద్వాంసుఁడు ♦ పెరిమ గాంచు
వెడఁగు ధనవంతుఁ డయ్యును ♦ వెలయఁ డట్లు
కనులు గల్గి నగలు లేక ♦ కాంతి చెడదు
కనులు లేక నగలు గల్గఁ ♦ గాంతిగలదె? ౧౮

తే॥ పండితులు తమ చతురతా ♦ ప్రకటనంబు
చేయునెడ సభకొలఁది నీ ♦ క్షించి యంత
వట్టి ప్రకటింతు రెచ్చుచూ ♦ పరు నిజమ్ము
జలములోఁతుకొలఁది గాదె ♦ జలజ బిసము. ౧౯

తే॥ బుధులు గుణ దోషములఁ గొని ♦ మొదటిదాని
నుంత్రు శిరమునఁ బెరదాని ♦ నుంత్రు కుతిక
చందురుని విసంబును గొని ♦ శంకరుండు
తలను కంఠంబునందునఁ ♦ దాల్చినట్లు. ౯౦

తే॥ మద గజములపై మూర్ఖులు ♦ పొదలుచున్న
చరణగతులగు బుధులతో ♦ సములుగారు
వీకఁ గొండకొమ్మున నున్నఁ ♦ గాకి మూఁక
పులిన గత హంసములతోడఁ ♦ బోలఁగలదె? ౯౧

౨౦ కుకవి.

తే॥ వన మయూరమ్ము పురివిప్ప ♦ వానకోడి
కాంచి నెమలిగాఁ దన్ను భా ♦ వించి తనదు
తోఁక విప్పి యాడెడి రీతి ♦ వీఁక నలరు
సుకవి ననుకరించి రచించు ♦ కుకవి రచన. ౯౨

౨౧ విద్య.

తే॥ లక్షణ మెఱుంగని చదువు ♦ లక్షణజ్ఞ
నెదుటఁ గాంచిన లేనిదై ♦ యెటనో యడఁగు
జ్ఞానవేద్యుని శర్వుని ♦ జటను గనెడు
మేరయే కాదె సురగంగ ♦ మిడిసిపాటు! ౯౩

తే॥ విద్య నేర్చుకొలందిని ♦ వృద్ధిచెందు
తోడఁ దెలివియుఁ దేట నొం ♦ దును నిజమ్ము
ఇసుక చెలమను తోడఁగా ♦ హెచ్చి యూట
జలము తేటయౌచుండును ♦ తెలియు వత్స! ౬౪

తే॥ నేర్చినది యితరులకుఁ దా ♦ నేర్పు నేని
వెలయు మిక్కిలి తనవిద్య ♦ విశ్వమందు
తోడఁగాఁ దేటవాఱు నూ ♦ తుల జలమ్ము
తోడకుండినఁ గంపయి ♦ పాడువాఱు. ౬౫

తే॥ చిన్నతనమున విద్య నే ♦ ర్చికొనవలయు
పెద్దయై బుద్ధి కలఁగిన ♦ విద్దెరాదు
క్రొత్త బట్టకు రంగులు ♦ హత్తినట్లు
ముఱికి బట్టకుఁ బట్టునే ♦ యెఱుఁగు వత్స! ౬౬

తే॥ ఎడతెగక వచ్చి బిందువుల్ ♦ పడుచునుండ
క్రమముగా నిండుఁ గడవయుఁ ♦ గడలివైన
ధర్మమును సర్వవిద్యలు ♦ ధనము నట్లె
క్రమముగా నార్జనము సేయఁ ♦ గలుగుచుండు. ౬౭

తే॥ స్వేచ్ఛయును ధనార్థిత్వంబు ♦ ప్రేమ భోగ
మవినయంబు మహాలస్య ♦ మనెడి యాఱు
విద్య నార్జించు వానికి ♦ విఘ్నకార
కములు వానికి నెడమీక ♦ కఱవ నగును. ౬౮

తే॥ శాస్త్రమెఱఁగి యా పద్ధతి ♦ జరుగవలయు
జరుగకున్నచోఁ జదివియు ♦ సఫలమగునె ?
వంటచేసిన భుజియింప ♦ వలయుఁగాక
తినకయున్న వండియుఁ బ్రయో ♦ జనముగలదె ? ౯౯

తే॥ చక్షువులకు హస్తములకుఁ ♦ జదువు వ్రాఁత
లాభ మివ్వి లేకున్న ఫ ♦ లంబు లేదు
నగలు గల్గినఁ దాల్పంగఁ ♦ దగును గాని
ఉన్న నేమి తాల్పనివి లే ♦ కున్న నేమి ? ౧౦౦

తే॥ పెద్ద లరసి చెప్పిన యది ♦ వినఁగవలయు
వినకయుండినఁ గీడు పొం ♦ దును నిజంబు
బుద్ధి యరసి చెప్పిన యది ♦ పెద్దచేసి
మనసు వినకున్నఁ జెడుబ్రోవఁ ♦ జనుచుఁ జెడదె ?

౨౨ అభ్యాసము.

తే॥ వాయువునె గొని కొంద ఱె ♦ ప్పటిగ నుంద్రు
కడలి నవలీలఁ గొందఱు ♦ కడచుచుంద్రు
కొందఱు విసమ్ము జీర్ణించు ♦ కొనఁగఁ గలరు
ఏది కాకుండు నభ్యాస ♦ మొసక మొసఁగ ? ౧౦౨

౨౩ యత్నము.

తే॥ యత్న మొనరింపఁదగు నరుఁ ♦ డవనియందు
ఫలము గలుగును పిల్లికి ♦ వలెఁ దనంత

జనన మాదిగా పశువొండు ♦ తనకు లేదు
పాలె త్రావుచున్నది యెల్ల ♦ వేళలందు!  ౧౦౩

తే॥ యత్నమును బుద్ధి శక్తి ప ♦ రాక్రమంబు
సాహసము ధైర్య మను నవి ♦ చ్చట వసించు
నచటఁ దప్పక దైవసా ♦ హాయ్య మబ్బు
నూరకున్న నేపనియుఁ జే ♦ కూర దెపుడు.  ౧౦౪

౫౪. మెలఁకువ.

తే॥ ఖలులలో సంచరింపంగ ♦ వలసినపుడు
మెలఁకువ గలిగి నడవంగ ♦ వలయు నరుఁడు
ఒండు నాలుక ముప్పది ♦ రెండు పండ్ల
నడుమఁ దడఁబడ కెటు మెలం ♦ గెడినో కనుమ.

౫౫. తోడు.

తే॥ బలయుతులకైనను సహాయ ♦ బలము లేక
మొదలు పెట్టిన కార్యంబు ♦ పూర్తి కాదు
మొలచునది బియ్యమైనను ♦ పొట్టువీడ
మొలక యెత్తనేరదు కదా ♦ పుడమియందు.  ౧౦౬

ఆ॥ అనువుగానిచోట ♦ నొక మిత్రుఁ గొని వాని
వలనఁ బనులు గొనఁగ ♦ వలయు నెపుడు
ఆవు పాలఁ గొనఁగ ♦ నాదూడ విడిచియే
పాలు పిండుకొనఁగ ♦ వలయు మిత్ర!  ౧౦౭

౨౬. కష్టఫలి.

తే॥ పొని కష్టించి సుఖమును ♦ పొందవలయుఁ
గాని యూరకయున్న సు ♦ ఖంబురాదు
చేయి యత్నించి నోటికం ♦ దీయకున్న
కడుపు నిండునె మఱియెక్క ♦ కరణిఁ జెపుమ. ౧౦౮

౨౭ ప్రియవాక్కు.

తే॥ నిష్కలంకుల కటువాక్కు ♦ నెఱపు మేలు
దుష్కలంకుల ప్రియవాక్కు ♦ దోర్చుఁ గీడు
భక్తు శిలప్రేటు ప్రియమయ్యె ♦ భవునకెన్న
మదను చెఱకు విల్ప్రేటు ప్రే ♦ మంబు నిడెనె? ౧౦౯

తే॥ కమ్ర వాక్కులచేఁ గాక ♦ కఠిన వాక్కు
వలన సంతసింపదు మహీ ♦ వలయ జనము
చలివెలుఁగుచేత నుప్పొంగి ♦ చెలఁగు జలధి
వేఁడివెలుఁగుచే నుప్పొంగి ♦ వెలయఁగలదె? ౧౧౦

తే॥ ప్రియము పల్కినచో గార♦వించు జనము
కటువులాడినవాని ద ♦ గ్గఱకుఁ గొనరు
ముద్దుగాఁ జిల్క పల్కిన ♦ మురియుచుంద్రు
కటువుగాఁ గూయు కాకి ద ♦ గ్గఱఁగ నీరు ౧౧౧

తే॥ తొలుతొలుతఁ దన మఱి యిత ♦ రులయుఁ బండి
తులయుఁ బామరులయు శత్రు ♦ వులయుఁ జిత్త

ములను లాగ వలంతిరై ♦ లలిత మగుచు
సత్సభా యోగ్య మగునదే ♦ సారవాక్కు. ౧౧౨

తే॥ కొలఁదిపలుకులలో రాణ ♦ యొలయఁ జేసి
పలుకునాతఁడే నిజముగా ♦ వాగ్మియగును
పలుకు లెక్కుడు సార మ ♦ ల్పంబుగాఁగ
పలుకు నతఁడె వదరుఁబోతు ♦ పసవినొందు. ౧౧౩

### ౨౮ సమయ నిరీక్షణము.

తే॥ అడఁగి యదనుకై వేచిన ♦ యతని వెకలి
యనుచు గెలువంగఁ జలపోయఁ ♦ జనదు వినుము
కాలువను చిఱుచేపలు ♦ కడవఁ గడవ
వదలి పెనుమీనుఁ బొడిచెడి ♦ బకముఁ గనుము

### ౨౯ ధర్మము.

తే॥ ఆపదల తోడఁ జంపఁగా ♦ యముఁడు వచ్చు
మునుపె మనసార ధర్మంబు ♦ నొనరుపఁడగు
వఱద రాకమున్నే కట్ట ♦ పలయుఁ గట్ట
వచ్చుపిదపఁ గట్టం గట్ట ♦ వచ్చునేమి? ౧౧౪

తే॥ శాస్త్ర విజ్ఞాన మొనయని ♦ జనుఁడు చేయు
ధర్మకార్యముల్ దిటవు పొం ♦ దంగ లేవు
గట్టియౌ చేవ తలుపైన ♦ గడియ లేక
దిటవు పొందంగ నేర్చునే ♦ తెలియు మీవ, ౧౧౫

తే॥ ఎవరిపని వారె యొనరింప ♦ హితము కలదు
ఒకరిపని మఱియొకరు చే ♦ యుటలు తగదు
వినెడు చెవులు కనవు కను ♦ కనులు వినవు
తినదు ముక్కు నాలుకయు వా ♦ సనను గనదు.

తే॥ ధర్మ మొనరింప రబ్బు సం ♦ దర్భమునను
పట్టుదలతోడ నొనరింత్రు ♦ పాప మెపుడు
అద్భుతంబుల నిద్ది మ ♦ హాద్భుతంబు
జనము నమృతంబు వీడి వి ♦ సము భుజింత్రు. ౧౧౮

చ॥ పనివడి చేయు దోసము లె ♦ ఒండ్ల కొలంది గడింపుచుండి వా
నిని మొదలంటఁద్రోవ మది♦నేరక ముక్కులు మూసికొన్న యం
తనె మది మాయవచ్చునె? మ♦నంబునఁగోర్కులుమాసిపోవునే?
మునుకొని చేతలందునె స♦మూలముగాఁదొలఁగింపు మిత్రమా!

చ॥ తెలిసినతప్పులెన్ని యొ మ♦దిం బలుచిక్కులఁబెట్టు నాదొసం
గులఁ దొలఁగించుకో నెడఁదఁ ♦ గోరక కంటికిఁ గానరాక రాఁ
గలవని తోఁచువానిఁ గడఁ♦క న్దొలఁగింపఁగఁ బూనుచుంట మే
లౌ లివియో! వేఱొకండొ? మదిఁ♦ దేఱిచి చూడుము మిత్రరత్నమా!

## ౩౦ అజ్ఞానులు.

తే॥ కొమ్మలును మొదళ్లును గల్గి ♦ కొండలందు
మలయుచుండెడు నవి కావు ♦ మంచిచెట్లు

సభను చేనిచ్చు పౌత్రంబుఁ ♦ జదువలేని
మనను గనలేని వారలు ♦ మంచిచెట్లు! ౧౨౧

తే॥ గాడిదకు నేర్పినను ముట్టి ♦ కాలు విడదు
బద్ద కుక్కతోఁకకుఁ గట్ట ♦ వంక విడదు
కాటు కెంతయిడిన గ్రుడ్డి ♦ కన్ను కనదు
మూర్ఖునకు నెంత చెప్పిన ♦ బుద్ధిరాదు. ౧౨౨

తే॥ కోయిలలు గల వనమున ♦ గూబలుండు
రత్నములు గల గనిలోన ♦ రాళ్లు నుండు
చిలుకలున్న వృక్షములందు ♦ చిలువ లుండు
గొప్పవారల సభల మూ ♦ ర్ఖులును గలరు. ౧౨౩

తే॥ ఉత్తముండు క్రిందనుండియు ♦ నొప్పు గనును
అధముఁ డెత్తున నుండియు ♦ యశము గనఁడు
పుడమిఁ దిరిగెడి సింగంబు ♦ పొలుపుగాంచు
కపులు చెట్లపై నెక్కియు ♦ ఘనతఁ గనవు. ౧౨౪

## ౩౧ అల్పులు.

తే॥ బుద్ధిమంతుల చందాన ♦ బుద్ధిహీను
లలము నిందకు జడియ రా ♦ వంతయేని
కాంతిగల కన్నులంబలెఁ ♦ గాంతిహీన
చక్షువులు చీఁకటులకును ♦ జంకునేమి? ౧౨౫

తే॥ గొప్పవారిఁ బ్రేమింతురు ♦ గొప్పవారు
గొప్పవారిఁ బ్రేమింతురే ♦ కుజుచవారు
క్షీర మరఁటి ఫలంబుఁ గాం ♦ క్షించుఁ గాని
కాఁడి సీర మద్దానిపైఁ ♦ గాంక్ష యిడునె? ౧౨౬

తే॥ మానవంతుండు కావించు ♦ మహిత కృతులు
మానహీనుఁ డల్పము చేసి ♦ మదము నొందు
ఏనుఁగునె కూల్చు సింగమెం ♦ తేని డస్సి
కుక్క యెముక గొఱికి మదిఁ ♦ గొనును ముదము.

తే॥ శరదృతువున గర్జిలు మబ్బు ♦ కురియకుండు
వర్షఋతువున నుఱుముదు ♦ వానకురియు
నల్పుఁడెప్పుడు వచియించు ♦ నట్లొనర్పఁ
డు త్తముఁడు వచింపఁడు చేయు ♦ చుండు సుకృతి.

౩౨ దుర్జనులు.

తే॥ సోదరులని చుట్టములని ♦ చూడవలదు
మేనఁ బుట్టిన వ్యాధియే ♦ ప్రాని చంపు
వనములోనున్న మందె వ్యా ♦ ధిని కుదుర్చు
గొనముఁబట్టి యొప్పారును ♦ పనుల మేల్మి. ౧౨౯

తే॥ ఉత్తముం డొరు గుణముల ♦ నెత్తి చెప్పు
నధముఁ డొకరి దుర్గుణముల ♦ నలరి నుడువు

రసము నెఱుఁగు తుమ్మెద తాను ♦ రలను మెచ్చు
కాకి వేఁపపండ్లనె తినఁ ♦ గడఁగుచుండు. ౧౩౦

తే॥ కలిమి గల దుష్టుఁజేర దుః ♦ ఖములె కలుగు
కలిమి లేని యుత్తముఁ జేర ♦ ఘనత వచ్చు
మణి గలట్టి ఫణిం జేర ♦ మడియు నరుఁడు
పూలతోఁడఁ గూడిన నార ♦ పొలుచుఁ దలను. ౧౩౧

తే॥ ఎంతయెంత స్నేహాంబుచే ♦ హెచ్చుగాఁగ
నుపచరించిన నంతంత ♦ యోర్వరాని
తాప మొదవంగఁజేయు ను ♦ త్కటముగాఁగ
నెంచి చూడంగ ఖలుఁ డగ్ని ♦ కెనయువాఁడు. ౧౩౨

తే॥ అల్ప మొదవిన నున్నతి ♦ నందుచుండు
నల్ప మెడల నధోగతి ♦ నందుచుండు
అల్పసంతోషి యంతలో ♦ నల్పదుఃఖి
దుర్జనుఁడు దండె కఱ్ఱను ♦ దొరయువాఁడు. ౧౩౩

తే॥ పరు లొనర్చిన యుపకృతి ♦ పాలఁబోలె
సంతసంబున గ్రహియించి ♦ శంక లేక
వంచనముచేసి చంప యు ♦ త్నించుచుండు
చూడ ఖలుఁడు కాకోదర ♦ సోదరుండు. ౧౩౪

తే॥ నాలు గక్షరములు మది ♦ నాటినంత
శివునకే యుపదేశింపఁ ♦ దివురుచుండుఁ

గట్టఁ దినఁ గల్గినంత రో ♦ కగ్రములఁ దేని
కంటె ఘనుఁడనఁ గర్వంబు ♦ గాంచు ఖలుఁడు

తే॥ శ్లేష్మమునకు దుర్జనునకుఁ ♦ జిత్రమైన
సామ్య మొనఁగూడు నరయ నీ ♦ జగమునందు
మధురతను కోప మభివృద్ధి ♦ మాన కొదవుఁ
గటుత చేతనే శాంతంబుఁ ♦ గాంచుచుండు. ౧౩౬

తే॥ సుజనునోటను దోసముల్ ♦ సుగుణము లగు
దుర్జనుని నోట గుణములె ♦ దోషము లగు
నుప్పు నీర్ద్రావి మంచి నీ ♦ రొసఁగు మొగులు
పాలు ద్రావి విసంబునే ♦ పా మొసంగు. ౧౩౭

తే॥ సజ్జనులఁ జేరు ఖలులకు ♦ సాధుత యగు
ఖలులఁ జేరు సజ్జనులకు ♦ ఖలత రాదు
విరులఁ జేరిన మట్టి తా ♦ విని వహించు
మట్టిఁ జేరు విరికి రాదు ♦ మట్టి తావి. ౧౩౮

తే॥ ప్రాణములు వీడియును కూడఁ ♦ బర హితంబు
చెఱుచునేగాని యూరక ♦ చెడఁడు ఖలుఁడు
అన్నమునఁ బడి చచ్చియుఁ ♦ దిన్నవాని
వాంతి యొత్తించుఁగద యీఁగ ♦ భవ్యచరిత !

తే॥ అల్పున కొకప్డు సంపద ♦ యబ్బెనేని
చేరువ గలం సుజనులఁ ♦ జెఱిచి తీఱు

వెల్లువ యొకట్డ వాఁగున ♦ వెలసెనేని
దరిని గల రమ్య ఫల వృక్ష ♦ తరులఁ గూల్చు.

తే॥ పరులతోడ వాదించుచోఁ ♦ బంక్తివదనుఁ
డన్య దోషంబు లరయు స ♦ హస్రనేత్రుఁ
డొరుల విత్తంబు హరియించు ♦ వెరవునందు
వేయిచేతుల వాఁడగు ♦ వినుము ఖలుఁడు. ౧౪౧

33 ●బ్ధ పదుఁడు.

తే॥ పులినతలము సరుని పాద ♦ ములను గాల్చు
కరణి సూర్యుని యెండయుఁ ♦ గాల్పదెందు
ఒరులవలన నొక్క పదవి ♦ నొందు ఖలుఁడు
తఱచు దుస్సహతరుఁడయి ♦ పఱలుచుండు. ౧౪౨

3౪ సహవాసము.

తే॥ పట్టు కొలఁకును విడు ♦ జల పక్షులవలె
నిడుమ లొందంగ విడువారు ♦ హితులు గారు
అందు కలువలు తామర ♦ లట్టు లుండి
తాము నిడుమ కుడుచువారె ♦ తగిన హితులు.

తే॥ కొలఁకునం దమ్మివిరి నంచ ♦ కలియునట్లు
విజ్ఞులం జేర విజ్ఞులు ♦ వేడ్కనింత్రు

కాటిలో శవమును దినఁ ♦ గాకి చేరు
కరణి నజ్ఞు లజ్ఞులఁ జేరఁ ♦ గా రహింత్రు. ౧౪౪

తే॥ స్నేహితము వీడి పదపడి ♦ చేరనేని
మొదటి గౌరవ ముండదు ♦ పొలుపుచెడును
పొట్టు వీడిన బియ్యంబు ♦ మునుపటివలెఁ
గలిసినంత మొలచు శక్తిఁ ♦ గాంచఁ గలదె? ౧౪౫

తే॥ సజ్జనులఁ గూడ నగుదురు ♦ సాధు జనులు
దుర్జనులఁ గూడ నగుదురు ♦ దుష్ట జనులు
పానయోగ్యమౌ నిసుకలో ♦ వానపడిన
నదియ చౌటిలోఁ బడిన ను ♦ ప్పగు నిజమ్ము. ౧౪౬

తే॥ సంగదోషంబుచే భువి ♦ సాధుజనులు
హృదయమందు వికారంబు ♦ నెనయఁబోరు
ఎన్ని పాములు తనుచుట్టి ♦ యున్నఁగాని
చందన తరువు విసమును ♦ చెందఁబోదు. ౧౪౭

తే॥ కుజనుచేఁ గష్టమొందిన ♦ సుజనుఁ డవల
యోగ్యునందును నమ్మిక ♦ యుంచ జంకు
ఉడుకు పాయస మానిన ♦ బుడుతఁ డవల
పెరుఁగునే నూఁదియే త్రావ ♦ దొరయుచుండు.

తే॥ ఉత్తములు వేఱుపడి తామె ♦ హత్తికొంద్రు
మధ్యములు చేరుదురు వేఱు ♦ మనుజుచేత

అధము లట్టులైన మఱి కలి ♦ యంగఁబోరు
జలము బంగారు రాళ్లు దృ ♦ ష్టాంతముగను. ౧౪౯

చ॥ నెఱయ హితైషులుందురు మ♦నీషులు వారలు గారు భూమిపై
నరయ మనీషులుందురు హి♦తైషులు వారలుగారు రెండునుం
దొరసినవారు లోకమున♦దుర్లభులౌదురు తీపిగల్గి దే
హి రుజను దీర్చు మందు లభి♦యించుట కష్టమయా తెఱంగునా

## ౩౫ సత్సంగతి.

తే॥ మంచివారి దర్శనమును ♦ మంచిదె యగు
మంచివారి మాటలు వింట ♦ మంచిదె యగు
మంచివారి గుణము చెప్ప ♦ మంచిదె యగు
మంచివారిఁ గూడి మనికి ♦ మంచిదె యగు. ౧౫౧

తే॥ క్రమముగాఁగ వర్ధిల్లిన ♦ ఘనుల చెలిమి
ఫలము నొసఁగు నల్పుల చెల్మి ♦ ఫలము నీదు
కాయ ముదురఁ దియ్యని పండు ♦ గాఁగ నొప్పు
చిగురు ముదిరిన నేమగుఁ ♦ జెపుమ నీవె? ౧౫౨

తే॥ గాజుతాయి పొదుగఁబడి ♦ కాంచనమున
మరకతము వోలెఁ దేజంబు ♦ మహిమ నొందు
పండితుల తోడఁ జేరిన ♦ పాలనుండు
పండితునిపోలె సభయందు ♦ పరిఢవిల్లు. ౧౫౩

తే॥ ఉదయగిరిమీఁద ద్రవ్యంబు ♦ లోప్పమీఁఱు
భాను సన్నికర్షముచేతఁ ♦ బ్రభ వహించు
నట్లు సత్సన్నిధానంబు ♦ నందినట్టి
హీనుఁడైనఁ బ్రకాశంబు ♦ నెనయఁ గలఁడు. ౧౫౪

తే॥ ఉత్తములతోడి సంగతి ♦ యుర్వియందు
ఎవని కున్నత పద మెన ♦ యింపకుండు?
గంగలోఁ బడి వీథుల ♦ కాల్వనీళ్లు
విబుధవరులకు వంద్యమై ♦ వెలయుఁగాదె! ౧౫౫

తే॥ మొదట నడుమను తుది నొక్క ♦ మొగిన యుండు
నుత్తముల మైత్రి యితరులం ♦ దుండదట్లు
తాపన నిఘర్షణ చ్ఛేద ♦ తాడనముల
కనక మన్యభావంబును ♦ కాంచునేమి? ౧౫౬

తే॥ శమము సత్య మౌదార్య మె ♦ చ్చట వసించు
నచటి పగయేని సౌఖ్య దా ♦ యకమ యగును
వట్టిచేతితోఁ గొనునట్టి ♦ మొట్టుకంటె
నుంగరముచేతి మొట్టు మే ♦ లొనఁగు నంద్రు.

తే॥ పోషణము తల్లి కంటెను
తోషణ మిల్లాలికంటె ♦ దొడ్డ యొడలికిఁ
శోషణము చింతకంటెను
భూషణము సువిద్యకంటె ♦ భూమిం గలదే? ౧౫౮

## ౩౬ దుస్సంగతి.

తే॥ చెడ్డవారి దర్శనమును ♦ చెడ్డదె యగు
చెడ్డవారి మాటలు ♦ వింట చెడ్డదె యగు
చెడ్డవారి గుణము చెప్పఁ ♦ జెడ్డదె యగు
చెడ్డవారిఁ గూడి మనికి ♦ చెడ్డదె యగు. ౧౫౯

తే॥ అల్పు లొనరించు పెను చెల్మి ♦ యపుడె యింపు
పిదప నేమియు లే దున్నఁ ♦ బెరుఁగుఁ గీడు
పెరుఁగు తీవియు మెత్తని ♦ విరులు పూవ
నాఁటికే గదా వాసన ♦ నయగుణాఢ్య! ౧౬౦

తే॥ చాలకాలంబు కుజను ప ♦ జ్జను వసింప
వ్రతముచేఁ గల్గు చిత్తదా ♦ ర్ఢ్యమును సమయు
చిన్న చీమలె యైనను ♦ కొన్నిదినము
లొరయఁ బెనుబండయేనియు ♦ నఱిగిపోవు. ౧౬౧

## ౩౭ అసత్యవాది.

తే॥ సజ్జనుల కొండు రెండు భు ♦ జంగములకు
నరయ నాల్గు బ్రహ్మకు నాల్క ♦ లాఱు గుహున
కగ్ని కేడగు దశము లం ♦ కాధిపతికి
రెండువేలు శేషునకు దు ♦ ర్వృత్తున కెన్నొ? ౧౬౨

౩౮ సంపద.

తే॥ పరువమున లేమి చెడు కష్ట ♦ పాటుఁ గూర్చుఁ
గష్టపడు ముదిమిని కల్మి ♦ కష్టమె యిడుఁ
బరువమున సంపదయు మఱి ♦ వార్ధకమునఁ
ద్యాగబుద్ధి యమర భోగ ♦ దాయకములు. ౧౬౩

తే॥ అదను పీడి పూచిన పూవు ♦ వ్యర్థమ యగు
మగువ యందంబు వీత ముది ♦ మగనివలన
పరువమున లేమియును మఱి ♦ వార్ధకమునఁ
గలిమి యనుభవ హీనమై ♦ కలఁత గూర్చు. ౧౬౪

క॥ సిరిరాఁ జుట్టంబులు సుం
దర రూపము ధనము కులము ♦ తనియఁగ నుండున్
సిరిపో నన్నియుఁ బోవును
సిరి మహిమయె యెల్ల ఘనత ♦ చిన్ని కుమారా!

తే॥ ఏను దేవాంశ భవుఁడ నం ♦ చెన్ను మదము
వినుతికిం దగువాఁడ నన్ ♦ వెకలి బుద్ధి
జనులఁ గీటకములు గాఁగఁ ♦ గనెడు గుణము
క్రొత్తగా లక్ష్మి యబ్బినఁ ♦ గొఱలు ఫలము. ౧౬౬

౩౯ ఆత్మస్తుతి.

తే॥ పెద్దలకడఁ బొగడికొను ♦ వెడఁగువాఁడు
ఘనత నొందఁడు తుదకు న ♦ క్కడనె చెడును

తన్ను పొగడి కొన్నట్టి విం ♦ ధ్యమ్ము తుదకు
నేమి యయ్యె నగస్త్యుచే ♦ నెఱుఁగవేమి ! ౧౬౭

౪౦ గర్వము.

తే॥ విద్యలందు సముద్రంబు ♦ విధము నందు
నని మనంబున గర్వంబు ♦ గొనఁగఁ దగదు
అట్టి పెద్ద కడలి నెల్ల ♦ నల్పరూపుఁ
డగు నగస్త్యుఁడు చేఁబట్టి ♦ యడఁచి మ్రింగె. ౧౬౮

తే॥ ప్రాజ్ఞు లెప్పు డాగర్భ సం ♦ పన్నుల మని
ఎదను నుంతేని గర్వంబు ♦ నెనయఁబోరు
కనకగిరి యంతటిదె యొక ♦ కాలమందు
పరమ శివునిచే వంచంగఁ ♦ బడుట యెఱిఁగి. ౧౬౯

తే॥ విషభర సహస్ర వదనముల్ ♦ వెలసియున్న
శేషుఁ డెప్పుడు గర్వంబు ♦ చెందఁబోఁడు
బిందుమాత్ర విషంబున్న ♦ వృశ్చికంబు
కొండి పైకెత్తుకొని పరు ♦ గులు వహించు. ౧౭౦

తే॥ దివ్య చూత రసము ద్రావి ♦ తృప్తిమీఱి
కోకిలం బెప్డు గర్వంబు ♦ గొనుట లేదు
బురద నీటిని ద్రావి ద ♦ ర్దురము లెంతొ
బెకబెకలు సేయుఁ జెవులకు ♦ వెగటుగాఁగ. ౧౭౧

౪౧ కోపము.

తే॥ అల్పునకుఁ గోప మడరిన ♦ నగలుఁగాని
కలియఁగా నేర దది ఱాతి ♦ పలుకువోలె
ఉత్తముని కోప మప్పుడే ♦ హత్తనిచ్చు
నమ్ముచేఁ జీలు నీరమ్ము ♦ గ్రమ్మునట్లు. ౧౭౨

తే॥ కోప మడఁగ దెన్నండును ♦ కోపమునన
జయము చేతను కోపంబు ♦ శాంతి వడదు
ఓర్పుచేఁ గ్రోధము నడంప ♦ నొప్పుఁ జెలిమి
అగ్ని నగ్నిచే నడఁపంగ ♦ నగునె చెప్పుమ? ౧౭౩

తే॥ మనసు లోఁగొని యడరెడు ♦ కినుక నడఁచు
కొనెడి గుణమె యన్నిటికంటె ♦ గొప్ప గుణము
వెల్లువను కట్టి యాఁపుట ♦ పెద్దతనమొ?
కట్టఁ ద్రెంచుట గరిమమో? ♦ కాంచు మీవ.

౪౨ శాంతి.

తే॥ యువకుఁడయ్యు నెవ్వఁడు శాంతి ♦ యుక్తుఁడగునొ
యతఁడె శాంతుఁడౌ నిజముగా ♦ నరసిచూడ
ధాతువులు క్షీణమగుచు వృ ♦ ద్ధత్వ మొదవ
నెవఁడు శాంతుండు గాకుండు ♦ నిహమునందు? ౧౭౫

### ౪౩ పరీక్ష.

తే॥ నాల్గు విధములఁ గనకంబు ♦ నఱకి కాఁచి
తట్టి యొఱచి పరీక్షించు ♦ నట్టులు జను
నాల్గువిధములఁ బరికింత్రు ♦ నాణెముగను
కులమునను శీలమునఁ గర్మ ♦ వలన శ్రుతిని. ౧౭౬

### ౪౪ వంచన.

తే॥ వంచన గలారు దాఁగి చ ♦ రించు చుంద్రు
వంచనము లేనివారు ని ♦ ర్భయత నుంద్రు
నంజు తనకుండు టెఱిఁగియే ♦ నాగుఁ బాము
దాఁగు నీటి పా మారీతి ♦ దాఁగ దెందు. ౧౭౭

ఉ॥ కొందఱు నెల్లకాల మను♦కూలపడం గికురింపవచ్చుఁ బై
నందఱఁ గొంతకాల మను♦వందఁగ మోసము చేయవచ్చు నే
కందువనైన నేమి కల♦కాలము నెల్లరఁ గన్నొఱంగ లేఁ
డెందు నెవండు నిక్కమిది ♦ యెల్లపుడుం బగలే ఘటిల్లునే!

### ౪౫ మృత్యువు.

తే॥ అజ్ఞునకు మృత్యువగు మహా ♦ ప్రాజ్ఞు వాక్కు
ధర్మమే మృత్యు వవని న ♦ ధార్మికునకు
అననుకూల పత్నియె మృత్యు ♦ వగును పతికి
కదళికిని మృత్యువగును తాఁ ♦ గన్న ఫలము. ౧౭౮

౪౬ తృణము.

తే॥ తృణము నల్పుతో నుపమించి ♦ తేల్పఁదగదు
అనుపకారియా నరుకంటె ♦ నదియ మేలు
పసుల మేఁతయై వానిఁ గా ♦ పాడుచుండు
పిఱికివారల రణమున ♦ నరసి కాచు. ౧౮౦

౪౭ భేదము.

తే॥ ఎచటఁ దనవారు లేకుండు ♦ రచట భేద
మునకు నవకాశ మేరీతిఁ ♦ బుట్టఁబోదు
తనదు శాఖయే యచ్చట ♦ నెనయకున్న
తరుల నఱకునే గొడ్డలి ♦ ధరణియందు? ౧౮౧

౪౮ విధి.

తే॥ పైపయిని యెంత యత్నింప ♦ ఫలము లేదు
కానికాలంబునందునఁ ♦ గడఁగు పనులు
పైపయిని వృద్ధిఁ బొంచెడి ♦ ఫల తరువులు
అదనునంగాక ఫలియింప ♦ వనుట నిజము. ౧౮౨

తే॥ ద్రవ్యమును చెలికాంఁడ్రు బాం ♦ ధవులు నున్న
విధి యొసంగినదే తక్క ♦ వేఱు కాదు
వనధిలోఁ గ్రోవి నదిమి ముం ♦ చినను దాని
కొలఁది మీఱి జలము గొనఁ ♦ గలదె చెప్పుము?

తే॥ లోన కుములుచుండెడి వెత్తి ♦ మానసంబ
కల్పకము దగ్గఱిన ముష్టి ♦ కాయ యొసఁగు
తలఁచునవి యెల్ల నెఱవేఱఁ ♦ గలవె నీకు?
తలను వ్రాసిన విధివ్రాలు ♦ తప్పవెందు. ౧౮౪

తే॥ ఈశ్వరుఁడు తాను, మామ న ♦ గేశ్వరుఁడు, ధ
నేశ్వరుఁడు చెలి, కొడుకు గ ♦ ణేశ్వరుండు
ఇట్టులయ్యు భిక్షాటన ♦ మే ఘటించె
హరునకైనను విధి బలీ♦యంబ కాదె? ౧౮౫

తే॥ మొదట గుణ కుల హీనుఁడౌ ♦ పురుషునకును
ధాత సుగతియుఁ గన్యను ♦ ధారవోసి
యవలఁ జింతించి దుర్గతి ♦ యనెడి సుతకు
మంచివానిని వెదకుచు ♦ మసలువాఁడు. ౧౮౬

తే॥ బాడబమునకు జంకి క ♦ పర్దిజటను
చేరి సర్ప విషజ్వాలఁ ♦ జిక్కి చంద్రుఁ
డచటు విడి నింగిఁజేర రా ♦ హుప్పళించె
గీడు లెటకైన దుర్భగు ♦ తోడఁ బోవు. ౧౮౭

తే॥ వ్యాధ బాధయు లేదు ద ♦ వాగ్ని లేదు
వలలు లేవు వేర్వ్యాధమైన ♦ భయము లేదు
అనుచు జింక చంద్రుంజేర ♦ నచటఁగూడ
రాహు దంత వ్రణముచేత ♦ రాయిడి పడె ౧౮౮

### ౪౯. పశ్చాత్తాపము.

తే॥ శ్రద్ధమై బాల్యమున నేను ♦ చదువనైతి
యౌవనంబున నార్జింప ♦ నైతి ధనము
పిదపనైనను తపము గా ♦ వింపనైతి
వార్ధకమున నింకేమొన ♦ ర్పంగ లాఁడ? ౧౮౯

### ౫౦. కుపుత్త్రుఁడు.

తే॥ భూస్థలి నజాత మృత మూర్ఖ ♦ పుత్త్రులందు
మృతుఁ డజాతుండు పరికింప ♦ మేలు వారు
పోయెనని పుట్టఁడని చింత ♦ పొడము సుంత
మూర్ఖుఁ డెల్లకాలము మది ♦ పొగులఁజేయు. ౧౯౦

### ౫౧. కులసతి.

తే॥ ఎదుట సతియుండ లేని దె ♦ య్యేదియు లేదు
గరిత యింట లేకున్నను ♦ పరుసు పలుకు
పలుకునదియైన నాయిల్లు ♦ పులి వసించు
నట్టి పొదరిల్లుగాని గృ ♦ హంబు గాదు. ౧౯౧

తే॥ ప్రియముగల కులసతియును ♦ ప్రియుఁడు నొక్క
పూన్కి నొక్క కార్యమె పూని ♦ పొనరుపఁదగు
కనులు రెండును చేరి యొ ♦ క్కటినె కాంచుఁ
గాని వెవ్వేఱు వానిని ♦ గాంచలేవు. ౧౯౨

## ౫౨ తేజము.

తే॥ బాలుఁడేయైన భానుని ♦ పాదములు మ
హీభృదుపరి భాగములందె ♦ యెలరుచుండు
తేజ మెప్పుడు జన్మంబుతోఁ ♦ దేజరిల్లు
నుత్తములకు వయస్సుచే ♦ నొదవునేమి? ౧౯౩

తే॥ అంకుశం బెంత? వశమగు ♦ హస్తియెంత?
వజ్రమెంత? తద్భిన్న ప ♦ ర్వత మదెంత?
దీపమెంత? తొలఁగిపోవు ♦ తిమిరమెంత?
వెలయునది తేజమేగాని ♦ బలుపు గాదు. ౧౯౪

## ౫౩ దారిద్ర్యము.

క॥ కుల శీల శౌర్య రూపం
బులు విద్యయుఁ గల వరునకుఁ ♦ బుత్త్రిక నొసఁగన్
దలపడు తండ్రింబలె నవి
గల యతనికె నిపుణ విధియుఁ ♦ గట్టును లేమిన్. ౧౯౫

తే॥ వందనములు దారిద్ర్యమా! ♦ వందనములు
త్వత్ప్రసాదంబునం గృతా ♦ ర్థతను గంటి
కాంచితిని జనములనెల్లఁ ♦ గడఁకతోడఁ
గాంచువాఁ డొక్కఁడును లేఁడు ♦ కడకు నన్ను

గిర యాచన.

తే॥ దేహి యను వాక్కు విని యెదఁ ♦ స్థిరత నున్న
పంచ దేవతలును నోట ♦ బయలు వెడలి
తొలఁగుదురు వాని వీడి సు ♦ దూరముగను
సిరియుఁ గీర్తియు ధృతియును ♦ సిగ్గు మతియు.

తే॥ దేహి యను పదంబు బయలు ♦ దేఱినపుడె
ప్రాణములు నోటినుండియే ♦ బయలువెడలు
ఇత్తునని దాత పలికిన ♦ యింపు వాక్కు
వలనఁ జెవిత్రోవ లోనికి ♦ వచ్చు మరల. ౧౯౮

తే॥ ఆస ప్రేరేచి ముందున ♦ కరుగనీడ్చు
వెన్దవిలి పెన్బిడియంబు ♦ వెనుక కీడ్చు
ఆసచే లజ్జచే నిట్టు ♦ లర్థిచిత్త
ముయ్యెలంబలె నిటునటు ♦ లూఁగుచుండు. ౧౯౯

తే॥ ప్రతిగృహద్వారమున నర్థి ♦ పలుకు నిట్లు
వేడకుఁడు మీరు మిమ్మిట్లు ♦ ♦ వేఁడువారి
కిడక మాబోంట్లు కాకుఁడీ ♦ యిచ్చి మిమ్ము
బోంట్లై యగుచుండుఁ డని నీతి ♦ బోసఁగునట్లు.

తే॥ దక్షిణాశావలంబియై ♦ తరణి కరము
చాఁచినంత నేమి యవస్థ ♦ సంఘటించె

నతని నైజ తేజము లఘు ♦ వగుటె కాక
పగలు కూడ లఘుత్వమై ♦ పరఁగెఁగాదె! ౧౦౧

తే॥ ఎడఁద బిడియ మూఁకటిచిచ్చు ♦ కడుపునందు
అగ్ని పైకెగయుట నైజ ♦ మగును గాదె!
ఎదనుగల లజ్జ కాలఁగా ♦ హెచ్చెఁజిచ్చు
కాన మరల వచ్చితిని మీ ♦ కడకు భూప! ౧౦౨

తే॥ రాజ! నీకీర్తి చంద్రికల్ ♦ ప్రబలి పరవఁ
దిశలుగూడఁ బూర్ణిమ లయి ♦ తేజరిల్ల
వెఱచి యొక్కఁడె యేకాసి మా ♦ యిరవు చేరి
బయల రాకుండ మము బాధ ♦ పఱచుచుండె. ౧౦౩

తే॥ రాజ! ఎల్లెడఁ గనక వ ♦ ర్షంబు నీవు
కురియుచుండంగ నెల్లరు ♦ మురియుచుండ
నే నభాగ్యమౌ గొడుగున ♦ నీడనుండ
బిందు వొకటేని నాపయిఁ ♦ జిందకుండె. ౧౦౪

౫౫ లోభి.

తే॥ లోభిఁ బోలిన దాత యీ ♦ లోకమందు
పుట్టియుండఁ డీమీఁదను ♦ పుట్టఁబోఁడు
తాను కూర్చిన ధనము నుం ♦ తయును గొనక
కాచి పరులకే విడుచుండుఁ ♦ గడకుఁ జూడ. ౧౦౫

తే॥ ఇడక కుడువక విభవంబు ♦ పడయకుండ
దాఁచి ద్రవ్యంబుఁ గాచుట ♦ తనకుఁగాదు

తృణముచేఁ జేయఁబడిన కృ ♦ త్రిమ నరుండు
పొలము పరులకై కాచుటఁ ♦ బోలు సుమ్ము. ౨౦౬

## ౫౬. ఆశ.

తే॥ ఆస యెవనికి దాసియై ♦ యడఁగియుండు
వాని కెల్లరు దాసులు ♦ వసుధలోన
ఆస కెవ్వఁడు దాసుఁడై ♦ యడఁగియుండు
వాఁడు దాసుఁ డెల్లర కగు ♦ వాస్తవముగ. ౨౦౭

తే॥ వెండ్రుకలు తెల్లనయి రాలె ♦ వీడెఁ బండ్లు
కనులు కనరావు తడఁబాటు ♦ గాంచెఁ గాళ్లు
ఇప్పుడో యెప్పుడో యొడ ♦ లెడయు నసులు
తృష్ణయను సాధ్వి నను వీడ ♦ కిపుడు నుండె. ౨౦౮

తే॥ తరుణిమంబును మ్రింగ వా ♦ ర్ధకము గలదు
సౌఖ్యమును మ్రింగ వ్యాధులు ♦ చాలఁగలవు
జీవితము మ్రింగ మృత్యువు ♦ చెంతఁగలదు
తృష్ణికను మ్రింగ నొకటియుఁ ♦ బృథివిలేదు. ౨౦౯

తే॥ అఖిల దోషంబులకు మూల ♦ మగును తృష్ణ
అఖిల సుగుణంబులకు మూల ♦ మగు నిరాశ
అఖిల మోదంబులకు మూల ♦ మగును విద్య
అఖిల దుఃఖంబులకు మూల ♦ మగు నవిద్య. ౨౧౦

## ౧౭. సేవావృత్తి.

తే॥ తన తలంపులు మదిలోన ♦ దాఁచవలయు
పరుల చిత్తంబు హర్షిల్ల ♦ జరుగవలయు
ఇతరులకు శరీరము విక్ర ♦ యించుకొన్న
సేవకునకు సుఖంబేడ? ♦ చిత్తమేడ? ౨౧౧

తే॥ ఎన్న సమములు సేవా శ్వ ♦ వృత్తులనుచుఁ
బలుకుదురు కొంద ఱయ్యది ♦ పాటిగాదు
జగతి స్వచ్ఛందచారియౌ ♦ శ్వానమేడ?
పరుల కొడలమ్ముకొనిన సే ♦ వకుఁ డదేడ? ౨౧౨

తే॥ కోరి సేవకై యొడలమ్ము ♦ కొనెడివాఁడు
మాన సౌఖ్యముల్ మొదలంట♦మానవలయు
వేనికొఱకు ధనంబును ♦ తాను గోరు
నవియు క్షీణించుచున్నవి ♦ యతనికన్న ౨౧౩

## ౧౮. సార్థకము.

తే॥ యోగ్యత యెఱింగి కొలువులో ♦ నుంచుకొనుట
వాడి పాడగు చేనిలో ♦ వాన పడుట
ఆఁకటం గుందువానికి ♦ నన్న మిడుట
పేద కీవి సార్థకములు ♦ పృథివియందు. ౨౧౪

తే॥ అదనునం బెట్టుపైరు వ ♦ యస్సునందు
గలుగు పుత్త్రుఁడు పిననాఁడు ♦ కఱచు విద్య

సుజనునకుఁ జేయు మేలును ♦ సుజనమైత్రి
సమయమునకు నుపకరించు ♦ జనున కిలను. ౨౧౫

తే॥ ఉత్తముఁడు గల గ్రామంబు ♦ నుత్తమ సతి
గలుగు పురుషుండు విద్యచే ♦ నలరు బుద్ధి
సత్యవంతమౌ వాక్కును ♦ జడత లేని
నడవడియుఁ బ్రకాశించును ♦ పుడమియందు. ౨౧౬

గీ॥ నిరర్థకము.

తే॥ వనధియందున దండిగా ♦ వానపడుట
ఆఁకలియె లేనివానికి ♦ నన్నమిడుట
ధనికి దానంబు సేయుట ♦ ధరణియందు
నిష్ప్రయోజనములు సుమ్మి ♦ నియత చరిత! ౨౧౭

తే॥ అదను వీడి పెట్టిన పైరు ♦ పుడమియందు
కలుగు కొడుకు పుస్తకమందు ♦ గలుగు విద్య
దుష్టునకుఁ జేయు మేలును ♦ దుష్టమైత్రి
సమయమున కిలఁ గొఱగావు ♦ జనునకెన్న ౨౧౮

తే॥ ఇంపులేని కవిత పుత్ర ♦ హీన గృహము
నుత్తముఁడు లేని గ్రామంబు ♦ బత్తి లేని
వేసమును ప్రీతిలేనట్టి ♦ విందు విద్దె
లేని రూపును వెలయవు ♦ మానితముగ. ౨౧౯

౬౦ ప్రేమ.

తే॥ పరునుచే వైరిని జయింప ♦ వచ్చుఁగాని
ప్రియముచేఁబోలె వశము గా ♦ వింపఁగాదు
కత్తిచే వైరమును చంపఁ ♦ గలము కాని
గెలిచి లోఁగొనఁగాదు నం ♦ గీతమువలె. ౨౨౦

తే॥ కత్తిచేఁ జంపి వైరంబు ♦ కడపుటెల్ల
రోగిఁ జంపి తద్రోగంబు ♦ నీఁగినట్లు
ప్రేమచేఁ జంపకయె పగ ♦ వెడలఁదోలి
చెలిమి కొననగు మిత్రమా ♦ తలఁచి చూడు ౨౨౧

౬౧ ఘంటా ధ్వని.

మ॥ ప్రభుతోద్యోగులు సజ్జనోపకరణా♦భావంబుచే శ్రీకృపా
ప్రభవుల్ లోభముచే నసధ్యయనతన్ ♦ బ్రజ్ఞాయుతుల్ సద్వ్యయః
సుభగుల్ త్రిమ్మరుచుండుటన్ బ్రణుతవి♦జ్ఞుల్ భక్తిలేమిన్ వృథా
గభువింద్రోయుచునుండి రాయువనియా♦గంటల్ ప్రబోధించెడిన్.

౬౨ సవ్యలు.

తే॥ బిలము వెలుపల మార్జారి ♦ బిలములోన
సర్ప మీమధ్యనున్న ♦ మూషకముకరణి
భార్య లిరువురు గలయట్టి ♦ భర్త భువిని
కదలలేక మెదలలేక ♦ కలఁగువాఁడు. ౨౨౩

తే॥ పరుల వ్రాఁత నొక్కఁడు చదు ♦ వంగలేఁడు
వాఁడు వ్రాయఁ బరుఁడు చదు ♦ వంగలేఁడు

ఈ విశేష మన్నిటికంటె ♦ హెచ్చు నితఁడు
తాన వ్రాసి చదువలేఁడు ♦ తానె మరల ౨౨౪

౬౩ సన్మార్గము.

(కందములు)

తగనిది పాపము చేయఁగఁ
దగినది పుణ్యంబు తొల్లి ♦ తాఁజేసినదే
యగు నిపుడు వేఱు గలుగదు
తగ నిదియే సర్వశాస్త్ర ♦ తత్త్వము తండ్రీ! ౨౨౫

తరలెడి వేళను జాతుల
నరయఁగ రెండెయగు ధర్మ ♦ మరసి నడచు నా
నరులే సుజనులు తప్పిన
నరులే దుష్టు లిది తత్త్వ ♦ నయమగు తండ్రీ. ౨౨౬

నిలువని దీ దేహము పలు
సిలుగులకును నెలవు నమ్మ ♦ చెలఁగకు కల లో
పల ధర్మ మాచరింపుము
సిలుగోర్చిన నిజము ముక్తి ♦ చిక్కును తండ్రీ. ౨౨౭

తన పుణ్యపు విధి డాయక
పని యొనరుపఁ గాదు గ్రుడ్డి ♦ ఫలమునకై క
ఱ్ఱను విసరు చందమగు విధి
యనుకూలంబైన వేళ ♦ నగునది తండ్రీ. ౨౨౮

రానివి యలసి పిలిచినను
రానేరవు విసిగి తోల ♦ రానున్నవియుఁ
పోనేరవు జను లాసను
పూని మదిని చింతసేయఁ ♦ బోలదు తండ్రీ. ౨౨౯

తనకున్నదె తనకగు నొ
క్కని విభవము కాంక్షసేయఁ ♦ గలుగదు కలశాం
బునిధిఁ దరించిన దేహికిఁ
గనునది యేమున్న దరసి ♦ కనుమా తండ్రీ. ౨౩౦

పలు విధములఁ బరికించిన
పలు రుజలకుఁ బురుగులకును ♦ భవనము దేహం
బిల దీని నెఱిఁగియే కద
పలుకరు శాశ్వత మటంచుఁ ♦ బ్రాజ్ఞులు తండ్రీ.

ధనమునకై బహు యత్నము
లొనరుప విధి యొసఁగు కొలఁది ♦ నొనఁగూడును త
ద్ధనమును నిలుకడ లేనిది
మనమున నెదకఁదగు ధర్మ ♦ మార్గము తండ్రీ.

తన్నెంత లేమి నలఁచినఁ
దన్నడిగిన వారి కిచ్చు ♦ ధర్మాత్ముఁడు; లో
నున్న జల మొసఁగదే నది
యెన్నఁగ వేసంగి నెండ ♦ కెండియుఁ దండ్రీ. ౨౩౩

ఏఁడులకొలఁదిగఁ బొరలుచు
నేడువ రాఁబోరు చచ్చి ♦ యేగిన వారల్
వీడుము మనకు నదేగతి
కూడ నెదియు రాదు పెట్టి ♦ కుడువుము తండ్రీ. ౨౩౪

కలుగదని పస్తు నోర్వవు
కలిగిన తఱి హెచ్చుతినవు ♦ కడుపా! నీతోఁ
గలిసి మనుట కష్టంబగుఁ
దెలియవు నా సెలుగు లనుచుఁ ♦ దెలియుము తండ్రీ.

తరు వేటి దరిని వెలసిన
నరపాలుం డెఱుఁగు పెను ధ ♦ నంబును చెడు నీ
వరసి మడి దున్ని బ్రదుకుము
పెర వృత్తుల నాశముండు ♦ వినుమా తండ్రీ. ౨౩౬

ఎవ్వరు కాఁగలది చెఱుప
నెవ్వరు మృతినొందు వారి ♦ నిల రక్షింపన్
నివ్వటిలు కలిమి చెడ నీ
కెవ్విధి భిక్షింప మాన్తు ♦ రెవ్వరు తండ్రీ. ౨౩౭

పల్లఱవు లాడ నోర్చుచు
నెల్లిదముగ బ్రదికి బిచ్చ ♦ మెత్తుట కంటెన్
ఉల్లము మానము గల జని
కల్లాడక చావు మంచి ♦ దరయుము తండ్రీ. ౨౩౮

మది దేవార్పణ మనుచును
పదిలంబుగఁ బనులు సేయు ♦ భద్రంబగు ని
య్యదియే ప్రజ్ఞా ఫలమగుఁ
దదితరములు విధివశములు ♦ తథ్యము తండ్రీ. ౨౩౯

జలము కలియు మట్టివలనఁ
గలికి సతీత్వమునఁ గనులు ♦ కారుణ్యముచే
నిల జనము లీవి వలనం
జెలఁగుదు రతిగౌరవమున ♦ సిద్ధము తండ్రీ. ౨౪౦

కలుషము లడఁగాఱు నటం
చలనాఁ డిడ కిప్పు డిడుమ ♦ లల్లార్చిన వే
ళల విధి దూఱినఁ గలదే?
యిల పొంగునె పట్టి పాత్ర ♦ నేర్చినఁ దండ్రీ. ౨౪౧

తలిదండ్రులు తనయులు బం
ధులు మిత్రులు పెద్దలనుచుఁ ♦ దోడుపడరు లో
భులు తన్ను వారి కిత్తురు
తలయుడి కాచినను మేలు ♦ తలఁపరు తండ్రీ. ౨౪౨

కొలుచుట తిరియుట పాలన
సలుపుట పొగడుటయు జలధి ♦ నంచారము పా
టలు పాడుట పాపపు టాఁ
కలి తీర్పనె మొదలిఁ గొండ్రు ♦ కట్టా తండ్రీ! ౨౪౩

వెలయాలి నమ్మి చేరుట
యిలఁ బాత్రముఁ గొనుచు నేటి ♦ నీఁదుట ధరణిన్
బలు లిబ్బి వీడి లేమిడిఁ
గొలుచుటయగు నిహము పరము ♦ గొఱలదు తండ్రీ.

ఇల నిర్వంచకులకుఁ గలు
ముల చెలి ధన ధాన్యములను ♦ పొగడిక పేరున్
బలమును నీడయు నాయువు
తలఁగని సుఖ మిచ్చుచుండు ♦ తథ్యము తండ్రీ. ౨౪౫

పెనుపాట్ల పడి ధనంబును
తినక యిడక భూమిఁ బాఁతి ♦ త్రెళ్లినచో నే
మనుజులపాలో యెఱుఁగము
ఘనమగు నవివేక మదియ ♦ కాదే తండ్రీ. ౨౪౬

కూటమునఁ బక్షపాతము
పాటించిన వాని యింటఁ ♦ బాములు చేరున్
పాటిగ జిల్లెడు పెరుఁగును
నీటుగ మూదేవి వచ్చి ♦ నిలుచును తండ్రీ. ౨౪౭

నదిలేని యూరు తిలకము
గదురని భాలమును నేయి ♦ గలియని కుడుపున్
మదిరాక్షి లేని హార్మ్యము
నెద నిలువని చదువు నింపు ♦ నీయవు తండ్రీ. ౨౪౮

వ్యయ మాయంబున కెక్కువ
యయిన మతియుఁ జెడును మాన♦మడుగంటును పైఁ
బయిదలి చులుకఁగఁ జూచును
ఎయిది పొరుగు దొంగగాఁగ ♦ నెంచును తండ్రీ. ౨౪౯

గోద నొవ్వ యడరెనేనియు
నెద పదిలము కులము చదువు ♦ నీవి తెలివి రొయి
బ్బిదమును యత్నము మానము
ముదము తపము పదియు విడిచి♦పోవును తండ్రీ ౨౫౦

ఒకటి తలఁప నొక్కటి యగు
నొకటి దలఁపకున్న నదియ ♦ యొనఁగూడును వే
తొకటి దలఁప నొడఁగూడదు
సకలము నీశ్వరుని చెయిది ♦ సత్యము తండ్రీ.

ఉడుచునది నాల్గు మూరలు
కుడుచునదో పట్టెఁడెడను ♦ కోఁక లెన్నఁ
గడువేలు లక్ష కోట్లగుఁ
గడవంబలెఁ జెడెను దనకఁ ♦ గష్టము తండ్రీ. ౨౫౨

ఫలియించు తరులు పక్షులఁ
బిలుచునె? పశువులును చేఁపి ♦ పిదుకఁగ నీవే?
వలచినది దాఁవ కీయఁగ
వలయు జనుల కదియ యొదవు ♦ పద్ధతి తండ్రీ.

తొలిబాముసఁ దా నొనరుచు
ఫలమే విధి కుడుపుచుండుఁ ♦ బరు నిందింపక్
ఫలమేమి ? యూరి వారలు
తలకొని విధిఁ దఱుమఁగలరె ? ♦ తప్పదు తండ్రీ.

అందము కవితకు ఛందము
అందము కులమునకు నడత ♦ వ్యాధియె మేలౌ
నందము పాతెడి జెట్టికి
నంద మసతిఁ గొనుటకంటె ♦ నంటమి తండ్రీ.

నదిసేయు మిట్ట మడువుల
పదురున ధన మడరుఁ బోవు ♦ పదిలమ్ముగ నుం
డదు గాన నన్నపానము
లొదవింపుము తోడు ధర్మ ♦ మొక్కటె తండ్రీ.

కరిఁ దగులు శరము జూదిని
చొరదు పరుసు మృదుత నడఁపఁ ♦ జొప్పడదు మహా
పరుష శిలలో ఖనిత్రము
చొరదు మెతువు వేరు చీల్చి ♦ చొచ్చును తండ్రీ.

కలిమిగల యజ్ఞసేనియు
నిల జను లెదు రేగి ఘనత ♦ యిత్తురు ధనమే
తొలఁగిన నతి ప్రేమింపదు
చెలఁగదు తల్లియును పలుకు ♦ చెల్లదు తండ్రీ.

ననుపక కాచెడు తరువులు
ననుపక పనిచేయు చతురు ♦ లవనిఁ గలరు చ
ల్లిన వెద ఫల మీయని యను
వున వెకలికిఁ దెలుపఁ దెలివి♦పొదలదు తండ్రీ. ౨౫౯

కదళియు శుక్తియు వెదురును
పొదలక చెడువేళ ఫలము ♦ పొందినక్రియ సం
పదయును చదువును తెలివియుఁ
జెదరఁగఁ బరసతుల బుద్ధి ♦ చెందును తండ్రీ.

విను మన్ని శాస్త్రములయం
దును కర్మఫలంబుఁ ద్రెంచు ♦ త్రోవ యొకటె వా
నిని ఫలము కోరి చేయకుఁ
డనియున్నది మదిని కోర్కె ♦ లడఁపుము తండ్రీ.

నేనని తానని కాదని
యానని మంచిదని చెడ్డ ♦ దని భేదంబే
లా? నీవు తాన యగుదువు
పానలె? జమ్మునకుఁ ద్రాడు ♦ వలయునె? తండ్రీ.

మూఁడు పదుల యేఁడులలో
మూఁడు మలాదులను విడిచి ♦ మొనసిన నిష్ఠఁ
జూడక నీలో నాత్మను
పాడు చదువు ముదిమిరావు♦పదురగు తండ్రీ. ౨౬౩

పలువురు పెద్దలు గ్రంథం
బులలో వచియించినట్టి ♦ ముఖ్యాంశంబుల్
కలవన్ని యుఁ బరమేశుని
తెలియఁ బలుకు సవిడె యనుచుఁ ♦ దెలియుము తండ్రీ.

## ౬౮ నీతిమంజరి.

విద్య నేర్పినతఁడె ♦ విమల దైవతము
విద్యకుఁ దొడవగు ♦ విశద వాగ్ధార
కలిమికిఁ దొడవగు ♦ గర్వంబు లేమి
ధనులకుఁ దొడవు బాం ♦ ధవ పోషణంబు
విప్రులకుఁ దొడవు ♦ వేద శీలములు
నృపులకుఁ దొడవగు ♦ నీతి పాలనము
వణిజులకుఁ దొడవు ♦ వర ధనార్జనము
కృషికులకుఁ దొడవు ♦ కృషిచేసి తినుట
ప్రగడలకుఁ దొడవు ♦ ప్రభు మేలు కూర్పు
వీరులకుఁ దొడవు ♦ వెఱవని పటిమ
తిండికిఁ దొడ వతి ♦ థికిఁబెట్టి తినుట
మగువలకుఁ దొడవు ♦ మాన రక్షణము
ఇల్లాలికిం దొడ ♦ విలుతేని సేవ
వెలియాలికిఁ దొడవు ♦ వెలయు పైతళుకు
విజ్ఞానికిఁ దొడవు ♦ విద్యచే వినతి
నిజుపేదకుఁ దొడవు ♦ నెఱి దప్పకునికి

పెద్ద వారెల్లరు ♦ పెద్దలు కారు
పిన్న వారెల్లరు ♦ పిన్నలు కారు
కొడుకు లెల్లరు మంచి ♦ కొడుకులుగారు
బంధువు లెల్లరు ♦ బంధులు గారు
పెండ్లాడు వారెల్ల ♦ పెండ్లాలు గారు
తక్కువతనమును ♦ తన చేతఫలమె
తనరు గౌరవమును ♦ తన చేతఫలమె
జనుఁడు తిరిసి యేని ♦ చదువుట లెస్స
చదివిన వానికే ♦ సకల సత్కృతులు
ప్రభులును చదివిన ♦ వాని మన్నింత్రు
అఱగొఱ విద్య యు ♦ నర్థ దాయకము
ధరణి పిల్లికి లేదు ♦ తపమును దయయు
దంతికి నుండవు ♦ దాన ధర్మములు
కొండెగానికి లేదు ♦ కూరిమి చెలిమి
సుజ్ఞానులకు లేదు ♦ సుఖ దుఃఖ చయము
అజ్ఞానికిం గల్గ ♦ దలుకును లజ్జ
చెడినవారికి లేరు ♦ చెలు బాంధవులు
కలిమి పేదఱిమి ని ♦ ల్కడ నుండలేవు
తిరిప మెత్తుటయును ♦ తెఱఁగె బీదలకు
తిరియువారి కిడుట ♦ తెఱఁగె దాతలకు
నింద వచ్చు పనులు ♦ నీఁగుట లెస్స

వేదంబు నేరని ♦ విప్రుండు పొల్లు
కులము మేల్మి చెఱుచుఁ ♦ కుజనుండు పొల్లు
వీలుండి చదువని ♦ వీఱిఁడి పొల్లు
అనువుండి కృషి చేయ ♦ నట్టిఁడు పొల్లు
వ్యర్థ వ్యయము చేయు ♦ బాలుండు పొల్లు
పనిలేక వదరెడి ♦ వదరయు పొల్లు
లోభి జనుండు పొ ♦ ల్లులలోన పొల్లు
ఉపకార మొనరించు ♦ టొగి పుణ్యమునకు
అపకార మొనరించు ♦ టగు పాపమునకు
సత్కీర్తి యొకయేఁట ♦ సాధింప రాదు
అపకీర్తి కనుమూయు ♦ నంతలో వచ్చు
అన్ని కష్టంబుల ♦ కాస మూలంబు
గర్వంబు కలవాఁడు ♦ కడతేఱలేఁడు
కోపంబుచే నను ♦ కూలతల్ చెడును
అన్ని బాధలఁ గూర్చు ♦ నయ్యా యసూయ
గురుల మాట వినని ♦ క్రూరుండు చెడును
పతిమాట వినని య ♦ ప్పడఁతియుఁ జెడును
సోమరి మోమున ♦ సొంపు గన్పడదు
అవివేకి మొగమున ♦ నడగదు తేట
త్రోవనే నడవుము ♦ త్రోవనే మరలు
పెద్ద లేగునదియు ♦ వెరవగు త్రోవ.



శ్రీరస్తు.

# నీతిగుచ్ఛము.

## మలి సగము.

(అన్యాపదేశములు)



నిజముగా నెల్లవారికి ♦ నీకి
అందును ఛలోక్తు లన్నచో ♦ నధిక ముదము
చాటుపెట్టి పల్కుట యన్నఁ ♦ జాల సొంపు
నింపు నింపు ననుభవంపుఁ ♦ బెంపు పెంపు.

పూతలపట్టు శ్రీరాములురెడ్డి.
కర్త.

# విజ్ఞప్తి

అన్యాపదేశమనఁగా వేఱొకదానిని చాటుపెట్టి పలుకుట. కావున వీనికి సాధారణార్థ మొక్కటియు ముఖ్యార్థము వేఱొక్కటియు నై యుండును.



# విషయసూచిక.

శ్రీరస్తు.

# నీతిగుచ్ఛము.



## ౧ సూర్యుఁడు.

తే॥ ఎంతదాఁకఁ జంద్రుఁడు పుట్టఁ ♦ డంతదాఁక
మిడుగుఱుం బుర్వులును మిన్కు ♦ మిన్కు మనును
వేవెలుంగు పొడమినంత ♦ విధుఁడు లేఁడు
మున్నె ఖద్యోతముల కాంతి ♦ ముచ్చ ముడుఁగు. ౧

తే॥ ఎవని పాదంబు లొప్ప భూ ♦ భృచ్ఛిరముల
నా జగచ్ఛత్రువును రాహు ♦ వలమికొనఁగ
నిరులు లేచును మిడుఁగుఱుఁ ♦ బురువు లేచు
లలిని చుక్కలు వెల్గు గూ ♦ బలును మూల్గు. ౨

## ౨ చంద్రుఁడు.

తే॥ క్షీణతను చెంద దగ్గఱఁ ♦ జేరుచుండు
పూర్ణతను చెంద దూరంబు ♦ పోవుచుండు
మిత్రుతోడ దోషాకరు ♦ మైత్రియిద్ది
మలిన హృదయున కది తగు ♦ మార్గమొకద! 3

తే॥ ఎక్కువగఁ జుక్కలున్నచో ♦ నేమి మింట ?
సంద్ర ముప్పొంగునే ? యురుల్ ♦ సమయఁగలవె ?
చల్లఁదనముండునె ? చకోర ♦ ముల్లసిలునె ?
అమృతకాంతి గలదె ? చంద్రుఁ ♦ డవతరిలక. ౪

3 మే ఘ ము.

తే॥ నదులయందు చెఱువులందు ♦ వార్ధిసముఁలందు
త్రావుచుండు జలము సదా ♦ జీవకోటి
చాతకం బట్లు పోవదు ♦ జగతియందు
నిన్ను దక్క వేఁడ దొరుని ♦ నీరదంబ ౧

తే॥ శ్రమముతోడ జలముగొని ♦ జలధినుండి
కల్ప వృక్షంబు లున్నట్టి ♦ కడకుఁ బోక
కురియుచుందువు కడఁక నూ ♦ షరములందు
నీ తలం పది యేమొకో ? ♦ నీరదంబ ! ౨

తే॥ ఉఱుముదువుగాక సుడిగాలిఁ ♦ బఱుతుగాక
మొత్తుదువుగాక వడగండ్ల ♦ నెత్తిమీఁద
నీజలంబుచే జీవించు ♦ నీడజమును
నీవ వీడఁగాఁ దగునె ? యో ♦ నీరదంబ ! ౩

తే॥ కురియు మేఘంబు నల్లనై ♦ వఱలుచుండు
నద్ది దోసంబనుచు జను ♦ లనఁగఁబోరు

మొనసి వెన్నెల కాలపు ♦ మొగులు తెల్ల
నై ప్రకాశింప లాభ మే ♦ మందు గలదు? ౮

తే॥ శరదమా! యెల్లయెడ నీవు ♦ కురియుచుండ
చిగురు లెత్తుచున్నవి యన్ని ♦ చెట్లు కాని
జల్లెడులమైన మాకు ముళ్ ♦ జెలఁగుచున్న
యాకులును గూడ నూడెఁగా! యరయుమీవ. ౯

౪ వాయువు.

తే॥ ఓయి చండ సమీరణ! ♦ యుడుగవయ్య
యెంత ఘోర కార్యంబిది ♦ యెఱుఁగవైతి
చాతకము నోటఁ బడనున్న ♦ జల కణముల
నెగురఁగొట్టితి వక్కటా! ♦ హింసకాదె?

౫ సముద్రుఁడు.

తే॥ అడుగునకుఁ ద్రోయుచుందు వ ♦ నర్ఘమణుల
నెత్తిపైనుంచి తృణము మ ♦ న్నించుచుందు
విద్ది నీకు దోసంబు గా ♦ దే? సముద్ర!
మణి మణియె యెటనైనను ♦ తృణము తృణమె. ౧౧

తే॥ నావికులు నీపయిం బయ ♦ నంబు నేయ
గట్టుపై బావినీటితోఁ ♦ గడవ నించి

కొంచుఁబోదురు దగదీర్చి ♦ కొనఁగనెంచి
సిగ్గుగాదె? సముద్రుఁడా! ♦ చెప్పికొనఁగ. ౧౨

తే॥ రాలు మణులు ముత్తెంబుల ♦ రాశి యిసుక
పగడములు నాచు జలములు ♦ పాలు దరిని
పెట్టుఁబెట్లు కూఁతురు లక్ష్మి ♦ పేరు రత్న
నిలయమేకాని త్రావఁగా ♦ నీరు లేదు. ౧౩

చ॥ అమృతముచే సురాళియు ము♦రారి రమామణిచేత మెరచే
త మహియు శంకరుండును సు♦ధాకరుచే హరి కల్పకంబుచే
హిమగిరి పుత్రుఁడున్ శరణ♦మిచ్చుటచేఁ బరితృప్తులయ్యి నొ
క్కమహితుఁడేనియంబుధి న♦గస్త్యుఁడు త్రావఁగ నడ్డుపోయెనే?

౬ రత్నము.

క॥ అరయకరయొ ప్రేమచేతనో
నరపతి యొక గాజుఱాతి ♦ నయముగఁ దలపై
ధరియించినంత మాత్రన
యరుదగు వెలగలుగు రత్న ♦ మగునే తలఁపన్. ౧౪

తే॥ సోమకాంత మణింబోలె ♦ సూర్యకాంత
మణియు స్వచ్ఛమైనదె యని ♦ గణనకెక్కెఁ
గాని తద్గుణంబులలోనఁ ♦ గలదు వాసి
అమృత మొక్కటి వేఱొక్కఁ ♦ డగ్గిఁ గురియు. ౧౫

తే॥ సంద్రమునఁ బుట్టు రత్నరా ♦ జంబులైనఁ
దత్పరీక్షకుల్ లేకున్నఁ ♦ దఱుఁగు విలువ.
గొల్లవానికి దొరకిన ♦ గొప్ప కెంపు
మూఁడు కాసుల కిచ్చును ♦ ముదముతోడ. ౧౭

౭ శంఖము.

తే॥ కఠినతయుఁ గీట గృహాత వ ♦ క్రతయు శూన్య
మయ్యు క్షీరాంబు సంభవ ♦ మైనయంత
నేమి గొప్ప గుణంబుచే ♦ నిందిరేశుఁ
డిట్లు చేపట్టె శంఖమా! ♦ యెఱుఁగరాదు. ౧౮

క॥ జలనిధి జనియించితి ని
ర్మలినము దేహంబు మఱి ర ♦ మాపతి కరమం
దలరుదువు కాని యొకరును
కల కుటిలత మాన్పరైరి ♦ గా? శంఖంబా! ౧౯

తే॥ తండ్రి రత్నాకరుండు సో ♦ దరియొ లక్ష్మి
శంఖమా! యింట నింట బి ♦ చ్చంబుకొఱకు
రోదనము సేయుచుందు వె ♦ ఱ్ఱోయటంచు
పెట్టి పుట్టని వారికి ♦ పుట్టదు గద! ౨౦

౮ కూపము.

తే॥ అల్ప తోయంబయైన వ్య ♦ యంబు హెచ్చు
దరియు గుణయుత రిక్తపా ♦ త్రములు మరలఁ

బూర్ణతం బొందుచుండు నీకు ♦ బొందినంత
నీవు కూపమా? భువిఁ జిరం ♦ జీవి వగుము! ౨౧

తే॥ జీవనాగారకూపమా! ♦ జీవనంబు
జనుల కవ్వారిగాఁగ లే ♦ దనక ప్రీతి
నొసఁగఁ దలఁచితివేని నీ ♦ యొద్ద నుంచు
కొనుము గుణయుత పాత్ర మొ♦కొండు దరిని. ౨౨

తే॥ సగుణ సత్పాత్రములు నీదు ♦ సరసఁ జేరి
వినతిమై నిన్ను గాంచు జీ ♦ వనము కొఱకు
రూపమున నల్పుఁడవ వైనఁ ♦ గూపముఖ్య!
దాతవగుటచే దొడ్డగాఁ♦దలఁచు వారు. ౨౩

తే॥ జీవనంబుకై నిను చేర ♦ నీవు కూప
ముఖ్య! బహుగుణ గరిమ గ ♦ మ్యుండవైన
నిట్లు పాత్రానుగుణముగా ♦ నిచ్చుచుందు
వతి వివేకివి నీకు జ ♦ యంబు లగుత! ౨౪

తే॥ చాల నల్పుండ నని యిట్లు ♦ జాలి చెంద
వలదు మది నెప్పుడును కూప ♦ వర్య! ధన్య
తముఁడ వత్యంత సరస హృ ♦ దయుఁడ వగుచుఁ
బరగుణ గ్రహణీయతఁ ♦ బరఁగు కతన. ౨౫

౯ గరుడుఁడు.

తే॥ పాము పామని జనులెల్ల ♦ భ్రాంతు లగుచు
మదిని భీతి చెందినను చెం ♦ దుదురుగాక
పక్షిరాజు భక్షించెడు ♦ వానియందు
మృదు మృణాలంబ యగుఁజుమీ ♦ యదియుఁజూడ.

౧౦ హంసము.

తే॥ ఎల్లయెడలఁ దామరలచే ♦ నెసక మెసఁగు
కొలఁకులున్నవి యెన్నియో ♦ కువలయమునఁ
గాని హంసరాజమునకు ♦ మానసమునఁ
గాక మానసమున నింపు ♦ గలదె నిలువ? ౨౭

ఆ॥ కొంగ యంచ రెండు ♦ రంగున భేదంబు
లేకయుండుఁ గాని ♦ లోకమందు
పాలు నీరు వేఱు ♦ పఱచు గుణాన హం
సంబు హంసమే బ ♦ కంబు బకమె. ౨౮

తే॥ అమల గంగా తరంగంబు ♦ లందు తూఁగి
కనక పంకజ రజ మధ్య ♦ మునను పెరిఁగి
వెలయు రాజహంసం బిడ్డ ♦ విధివశమునఁ
గంటు నాఁచు రొంపి జలంబుఁ ♦ గాంక్షఁజేరె. ౨౯

తే॥ అంచ సంజఁ బథిశ్రమ ♦ మపనయింప
కాక బకముల కడఁజేరఁ ♦ గా హసించి

75

మూఁగ యని యవ్వి ఱెక్కలఁ ♦ బొడిచి యీడ్చు
నవమతికి హేతువగును నీ ♦ చాశ్రయంబు.    30

౧౧ భ్ర మ ర ము.

తే॥ రాత్రి కడచును వేకువ ♦ రాకపోదు
భానుఁ డుదయించు వికసించుఁ ♦ బంకజములు
అనుచుఁ జింతింపఁ గోశ గ ♦ తాళి యకట!
తూఁటితోఁ దామరను కరి ♦ త్రుంచివైచె.    3౧

తే॥ చిత్రపద్మంబు నళి కాంచి ♦ చిత్ర మనుచు
వ్రాలి గంధము తేనె మా ♦ ర్దవము లేమిఁ
గాంచి తలయూఁచి యిది యేఁటి ♦ దంచు శిరము
వంచి సిగ్గుచే నెచటికో ♦ వదలిపోయె.    3౨

తే॥ కరి కపోల మదంబునఁ ♦ బెరిఁగి విరియు
నంబుజ రజంబుచే వాసి ♦ తాంగమైన
భృంగ మిప్పుడు కాలంబు ♦ వెడలఁబుచ్చు
వేఁప జిల్లేడు పూలందు ♦ విధి వశమున.    33

౧౨ కో కి ల.

తే॥ ఓయి కోకిల! మౌనంబు ♦ నుడిగి సుంత
పంచమశ్రుతి నొకపాట ♦ పాడు మిచట
నట్లు కాకున్న నిన్నెవ్వ ♦ రరయువారు
మాల కాకులు నిండిన ♦ మావియందు    ౩౪

తే॥ కాక వృక ఘూక బక భేక ♦ గణములార!
వినతితోడ మిమ్మొక్కమాట ♦ వేడికొందుఁ
గలకలము మాని నెమ్మది ♦ గనుఁడు నంత
ఇంపగు రవమ్ము పికము కా ♦ వింపఁదొడఁగె    ౩౫

తే॥ కాకి నలుపు మఱియుఁ ♦ గోకిలయును నల్పు
వన్నెయందు భేద ♦ మెన్న లేదు
భూమి జనుల కించు ♦ నామని యే తేర
కాకి కాకియే పి ♦ కంబు పికమె.    ౩౬

తే॥ సకల జన రంజకంబు వ ♦ సంత రజని
నింపుగాఁ గోకిలాలాప ♦ మొనయకుండు
నంతదాఁ కాలపించుఁగా ♦ కన్నియెడలఁ
గాక కుక్కుటములు బక ♦ భేకములును    ౩౭

తే॥ చెవిటి వారలు నిండిన ♦ భువన మిద్ది
మృదు మధుర కూజితంబుచే ♦ మేలు లేదు
త్వత్కళా దరిద్రులు వీరు ♦ పరభృతంబ!
వన్నెచేఁ గాకి యనియె ని ♦ న్నెన్ను వారు.    ౩౮

తే॥ ఓయి కోకిలా! నీపాట ♦ యుడుగు మింక
వానకారిది తడియుర్వ్యో ♦ వసుధ యెల్ల
కడిమి మోసులు పుట్టి భే ♦ కంబు లిపుడు
వక్త లగుచుండ నిను విను ♦ వార లెవరు?    ౩౯

తే॥ కోకిలా! పాట లింకఁజాలు ♦ ప్రాఁకుమీఁదఁ
గూరుచుండుము వినువారు ♦ గూడ లేరు
కాకిమూఁకలు కటువుగాఁ ♦ గలకలంబు
సేయు నిప్పు డామని గాదు ♦ శిశిరఋతువు. ౮౦

తే॥ కోకిలా! యరణ్యం బిది ♦ ఘోరతరము
కాకి ఘూఁకలు గూండ్లకు ♦ వీఁకఁజేరి
ఘోషణము సేయుచున్నవి ♦ గూబ లదర
నీదు పంచమారావంబు ♦ నిలుపఁదగును. ౮౧

౧౩ చా త క ము.

తే॥ చాతకం బొక్కటే మాని ♦ జగతియందు
వెలయఁ జాలకాలంబు జీ ♦ వించుఁగాత!
వేఁడఁబోయిన నింద్రునే ♦ వేఁడఁబోవు
నొండె దప్పిచే మరణంబు ♦ నొందునొండె. ౮౨

తే॥ ప్రాణముల భరియించె న ♦ వశ్య కార
ణంబుచే జగంబునఁ జాత ♦ కంబు నిజము
ప్రార్థనా భంగ భీతిచేఁ ♦ ప్రాణమైన
విడుచుఁగాని శక్రుని దక్క ♦ వేఁడబోదు. ౮౩

తే॥ మొలచె గింజలు తీవియల్ ♦ మోసులెత్తెఁ
జెట్లు చిగిరించె జనము హ ♦ ర్షించెఁ గురియఁ

బడదు తననోట నొకచేని ♦ వానచినుకు
పాతకం బేమి చేసెనో ♦ చాతకంబు ౪౪

తే॥ కలవు మొగుళులు దగయార్చు ♦ కడఁక గలవి
వానకోయిలా! శ్రమనొంద ♦ వలదు తాళు
మిద్ది శారదాభ్రము నీళు ♦ లిందులేవు
ఊఱుము నూరక యొక బిందు ♦ వుర్విఁబడదు, ౪౫

తే॥ వానకోయిలా! విను మొక్క ♦ పలుకు వినుతు
పెక్కు మొగుళులు కలవు వి ♦ స్వీథియందు
కొన్ని యూరక గర్జించుఁ ♦ గొన్ని కురియుఁ
గనిన వానినెల్లను వేఁడఁ ♦ గడఁగ కయ్య. ౪౬

తే॥ ఇతర పక్షులు దగగొన్న ♦ నెచటనేని
నదుల చెఱువుల నీరాను ♦ నర్మిలిమెయి
కడకు వానకోయిల శుష్క ♦ కంఠమైన
నొరుని వేఁడదు కోరదు ♦ దరియఁబోదు

౧౪ శా ప లి

తే॥ ఓయి మేఘుఁడా! వినుము నా ♦ యొక్కపలుకు
వానకోయిలవోలె జీ ♦ వనము గోర
నీవు సర్వజనామోద ♦ నినద మింత
నెమ్మిఁజేయ ముదమునొందు ♦ నెమ్మి నేను. ౪౭

౧౭. చక్రవాకము.

తే॥ అబ్జమిత్రుండు దినకరుఁ ♦ డస్తమించె
చక్రవాకమా! ధైర్యంబు ♦ సడలనీకు
వశమె విధిని దాఁటంగ ♦ నెవ్వరికినేని
ధీరులే యాపదలు దాఁటు ♦ వారు నిజము. ౫౯

౧౮. చిలుక.

తే॥ సకల పక్షులు స్వాచ్ఛంద ♦ చారు లగుచుఁ
దిరుగుచుండఁగ నక్కటా! ♦ ధరణియందు
శుకము పంజరమునఁ జిక్కి ♦ స్రుక్కుచుంట
కమ్ర చాతుర్య మృదుల వా ♦ క్ఫలము నిజము. ౬౦

తే॥ శుకమ! చిరకాల మిట్లు కిం ♦ శుకముఁ గాంచి
ఫలము భుజియింత మనుకోర్కి ♦ వలదు వలదు
బయటి డాలును నమ్మి నీ ♦ వలెనె యిచట
మోసపోయిరి పెక్కండ్రు ♦ మున్ను నిజము. ౬౧

తే॥ జీర్ణ పంజరమిది తల్పు ♦ చెడియెఁ జిలుక!
తుంటపిల్లులు తిరుగాడు ♦ చింట నుండె
వదనమును మూయు మింకను ♦ వదరఁబోకు
పామరులకు నీపల్కులు ♦ ప్రమద మిడవు ౬౨

చ॥ అనుచిత వాక్కులా రసికు♦లక్కట! యిక్కడి పల్లెవాండ్రు చే
తన్న్కడు మోటువిండ్లుగాని♦తక్షక యేయుటయే ప్రియంబుగాఁ

గొని మనువారు కీరమ! యు♦కంఠిత క్రమ రవంబు సేయఁగాఁ
జనదిఁక మానమే తగిన♦చందము డగ్గఱి ప్రాన డాఁగుమా.

తే॥ చిలుకకున్న సురూప సు♦శీలతలును
వదరుటలు సుభాషితములు ♦ వఱదఁబోవు
నింత చప్పుడు గాకుండ ♦ నేగుదెంచి
యెదుటఁ బ్రత్యక్షమై పిల్లి ♦ యొనసినంత. ౫౪

౨౭ కాకి.

తే॥ కోకిలల గుంపుతోఁ గూడి ♦ కాకియున్న
నెఱక లొడలు రంగున భేద ♦ మెఱుఁగరామి
నరయు వారెవ్వ రిది కాకి ♦ యని జనములు
కా యనుచుఁ దానుగా నది ♦ కూయకున్న. ౫౫

తే॥ పండ్లు తినుగా కొడలు నల్పు ♦ పరఁగుఁ గాక
మావి గున్నలపై నెక్కి ♦ మసలుఁగాక
గండుఁగోయిల నడవడుల్ ♦ గాంచుఁగాక
కల రుతంబునఁ గాకంబు ♦ కాకమె కద! ౫౬

క॥ ప్రతి గృహమునఁ బ్రతి తరువునఁ
బ్రతి తీరంబునను కాకి ♦ పఱచు చఱచుచున్
మతిఁ దృష్టి చెంద దంచయొ
బ్రతుకుచు నబ్జంబులందె ♦ బ్రాఁతిగఁ దనియున్.

మ॥ కలదే పింఛము కేకికట్లు? గోరవం♦కంబోలె మాటాడుదే?
చిలుకంబోలెఁ బఠింపఁగాఁగలవె? హం♦సింబోలె నర్తింతువే?
కలనాదంబు పికంబుఁబోలె వినుతే? ♦ కాంక్షింప నీకెవ్విధిన్
గలుగున్ బంగరు పంజరస్థితి వృథా♦కాకా యనం గాకమా!

తే॥ కాంచన మయమ్ముగాఁ జేసి ♦ గాత్రమెల్ల
మానికంబు ముక్కునకు న ♦ మర్చి యొక్కొక
యీఁకకున్ మణుల్ చెక్కిన ♦ యేని భువిని
కాకి కాకియే హంసంబు ♦ గాదు నిజము. ౭౯

౧౪ పిల్లి.

తే॥ మద మదేల బిడాలమా! ♦ మనుజ పతుల
మణిమయాంతఃపురంబుల ♦ మసలినంత
నీకు లేదది పట్టాభి ♦ షేకవేళ
నందు బయటి గజమునకే ♦ మండనములు. ౮౦

తే॥ పంజరమ్మున నింపుగాఁ ♦ బాడుచున్న
చిలుకఁగాంచి మార్జాలమా! ♦ చిట్టు మనెదె?
నీయొడలిఁ జీల్చు కోఁతల ♦ నెగడుచుండు
శునక మెదుట నీశక్తిని ♦ చూపరాదె? ౮౧

తే॥ చిలుకకైవడిఁ బాడఁగాఁ ♦ గలవె నీవు?
వ్యాఘ్రికింబలె బలము వీ ♦ ర్యమ్ముఁ గలదె?

నక్కవలె సమయస్ఫూర్తి ♦ నడవఁగలవె?
సిగ్గులేనిది నీవృత్తి ♦ చీలి! యరయ. ౬౨

౧౯ బకము.

తే॥ పికమువోలె సుస్వరము భా ♦ వింపలేదు
హంసముంబోలె గతిని లా ♦ స్యంబు లేదు
నెమలికింబలె బర్హంబు ♦ నెగడలేదు
కాని గుణమొండు బకమందు ♦ గలదు వ్రతము. ౬౩

తే॥ మెడయు ముక్కును తెక్కలు ♦ నొడలు సుంత
కదల దొంటికాలను నిల్చుఁ ♦ గలదు ముద్ర
యోగివోలె నిష్ఠను తాల్చి ♦ యుండు నైన
గండె గనఁబడుదాఁక బ ♦ క వ్రతంబు. ౬౪

తే॥ రెండు పక్షముల్ తెల్పవా ♦ రిత గమనము
స్థాణు శిరమె వాసము సదా ♦ మీన భుక్తి
కొంగ చంద్రు గుణంబులఁ ♦ గొఱలనేమి?
గుణము తగుచోట నున్న నే ♦ గురుత గాంచు. ౬౫

౨౦ గూబ.

తే॥ మిత్రు కరముల విశ్వంబు ♦ మేలుకాంచి
యెల్ల తమతమ పనుల వ ♦ ర్తిల్లుచుండఁ
గనులు తెఱవకుండును గ్రుడ్డి ♦ కరణి గూబ
తన పురాకృత కర్మంబు ♦ ననుభవింప. ౬౬

౨౧ మి డు ఁగు ఱుఁ బు రు వు.

తే॥ ప్రొద్దువోయెను చంద్రుని ♦ మొగులు గప్పె
గగనమందున రిక్కలుం ♦ గానరావు
వట్టి చీఁకటి నిండైన ♦ వఱలుమయ్యె
మిడుఁగుఱుంబుర్వ! మినుమినుక్కు ♦ మినుక్కు మనుచు.

౨౨ సిం హ ము.

ఆ॥ ఒంటివాఁడ నాకు ♦ నొరులెవ్వరును లేరు
కృశతఁ జెందినాఁడఁ ♦ గీడువడితి
ననెడిచింత నుంత ♦ మనసునఁ బుట్టంగఁ
బోదు కేసరికిని ♦ భూమియందు. ౧౮

తే॥ ఒకర్తె సత్పుత్రుతోఁ గూడి ♦ యుత్సహించి
చెందుచుండును సుఖనిద్ర ♦ సింహి యడవి
కొడుకు లొక పదుగుండ్రు తక్ ♦ గూడియుండ
మోఁత మోయును గాడిద ♦ మూఁపు విఱుగ. ౧౯

తే॥ పొలము మేయు మెకంబులఁ ♦ బోవఁద్రోల
తృణమయంబగు వెఱబొమ్మ ♦ యేని చాలు
సింహ మాక్రమించిన భూమి ♦ చెలఁగి కావ
గుఱ్ఱములు చాల వంతకే ♦ న్గలును గావు ౨౦

తే॥ నడవలేని ముసలిదైన ♦ బడుగె దైనఁ
గుంటిదైనను మఱి కను ♦ గ్రుడ్డిదైనఁ

జాలియుండును మృగరాజు ♦ చంపు ననెడి
ప్రాణభీతి గూర్పఁగ గజ ♦ రాజమునకు. ౭౧

తే॥ సింహమున కరణ్యమున సం ♦ స్కృతియులేదు
పట్టముం గట్టరెవరు చే ♦ పట్టెఁ దాన
స్వీయ విక్రమార్జిత శక్తి ♦ చేత వన్య
సత్త్వములపైఁ బ్రభుత్వంబు ♦ సంక్రమింప. ౭౨

శా॥ జింకల్ ఁక్రేళులు దాఁటెఁ బందులును బ్ర ♦
చ్ఛేం బల్లముల్ వ్యాఘ్రముల్
పొంకంబార మదించె దూఁకె శశకం ♦
బుల్ కూసె గోమాయువుల్
శంకాలేశము లేక చెట్ల విఱిచెన్ ♦
స్రగ్గాడి యేన్గుల్ మృగేం
ద్రాంకం బేమియు లేనియంతనె యర ♦
ణ్యం బొందె నీ దుర్దశన్. ౭౩

ఉ॥ తెక్కలచేవచే నెగిరి ♦ తేని గృహంబునఁ గాకి తిన్నచోఁ
దక్కెనె దానిచే ఘనత♦తాఁతెనె న్యూనతచే మృగేంద్రుఁడున్
మిక్కిలి దంతిఁగూల్చి బలు♦మేలిమితిండి గ్రహించి యంతఁదాఁ
జిక్కటి గవ్వలంచు నట♦జాఱఁగ వీడును మాక్తికంబులన్.

తే॥ గుహను మృగపతి హాయిగాఁ ♦ గూర్కుదాఁక
సంచరించు మృగాళి స్వ ♦ చ్ఛందవృత్తి

నిదురలేచి కేసరములు ♦ విదిలిచికొని
గర్జనము సేయ బుద్ధులు ♦ కలఁగఁబాఱు. ౭౧

## ౨౩ ఏనుఁగు.

తే॥ మదగజము మస్తకంబుపై ♦ మలము విడువ
కాకి కది తన వంశాను ♦ గతమ యగును
దానిచే నేనుఁగున కైన ♦ తక్కువేమి?
కాకి కాకియె మఱి చూడ ♦ గజము గజమె! ౭౨

తే॥ ఏన్గు తినినవ్వు రాలిన ♦ యెంగిలి గొని
చీమ లోకకోటి జీవించుఁ ♦ జింతలేక
తగ్గు గాదు గజమునకు ♦ దాని వలన
అరయ గొప్ప వారి గుణంబు ♦ లట్టు లుండు. ౭౩

తే॥ ఏన్గు బంధనస్థంబైన ♦ నెసక మెసఁగ
వేయిమందిని భరియించు ♦ నెరవరి యగు
కుక్క స్వచ్ఛందచారియై ♦ కొఱలుచున్న
స్వోదరంబునకే దుఃఖ ♦ మొందుచుండు. ౭౪

తే॥ పిల్లియును కుక్కయును రాజ ♦ వేశ్మమందు
తిరుగుచుండియు నొకయింత ♦ గురుత గనునె!
బయుల నేనుఁగు బంధింపఁ ♦ బడినదైన
గౌరవంబున లోటును ♦ గాంచునేమి? ౭౫

తే॥ పంది గంపెడు కూనలఁ ♦ బడయుఁ ద్వారగ
నవి దరిద్రములై తిండి ♦ కలయుచుండు
ఏనుఁ గరుదుగ నొకపిల్ల♦నీనినంత
లీలఁ బ్రభువుచే నద్దిలా ♦ లింపఁబడును. ౮౦

తే॥ కాళ్ల సంకెలల్ పాశంబు ♦ కంఠమందు
నెత్తిపై సృణిపోటు బం ♦ ధితము మూఁపు
నరుఁడు పైన కూర్చుండును ♦ మరణయోగ్య
వృత్తి గలిగియు గజమ! నీ ♦ కేల మదము? ౮౧

౨౪ జింక.

తే॥ హే కురంగమా? వదలి పో ♦ యెద వదేల?
పొలమునందలి వరి మొల ♦ కలను గాంచి
కసవు విల్లు కసవుతూపు ♦ కసవుచేతఁ
గట్టు వెఱబొమ్మ యగు నిది ♦ కాఁడు నరుఁడు. ౮౩

తే॥ హా! కురంగి! తపోవన ♦ మనెడి భ్రాంతిఁ
జేరితివి బోయపల్లెను ♦ చెడుగు గలుగు
నఱకు చీల్చుము తిను త్రావు ♦ కోఱుకు మనుచు
నిచటి చిలుకలేనియు వచి ♦ యించుచుండు. ౮౪

తే॥ పోతరంబునఁ గన్నులు ♦ మూఁత వడఁగ
హరిణులంగూడి క్రీడించు ♦ హరిణరాజ!

ఇద్ది హరి నఖ భిన్న క ♦ రీంద్ర కుంభ
సార ముక్తామయంబు ♦ విహార సీమ. ౮౫

తే॥ వ్యాధ బాధయు లేదు ద ♦ వాగ్ని లేదు
వలలు లేవు వేర్విధమైన ♦ భయము లేదు
అనుచు జింక చంద్రుం జేర ♦ నచటఁగూడ
రాహు దంతవ్రణముచేత ♦ రాయిడి పడె. ౮౬

౨౫. ఒంటె.

తే॥ ఒడలు పెక్కువంకరలకు ♦ నునికి పట్టు
స్వరము చూతమా శ్రవణ సం ♦ జ్వరకరంబు
మొగము గన వికారములకుఁ ♦ బుట్టినిల్లు
ఆశుగతి నొంటెకెల్లఁ ద్రో ♦ యంగఁబడియె. ౮౭

౨౬. గాడిద.

మ॥ కనరా రాసభ! వస్త్రవాహివయి కు♦గ్రాసంబు భక్షింతువే
ల? నృపాశ్వావసథంబుచేరి సెనగల్ ♦ భక్షింపు సంప్రీతిమై
వెనుతోఁకల్గలవెల్ల వాజులని యా♦శ్వీయాధికారుల్ తలం
త్రు నృపుండుఁ సరియంచు నెక్కును తట♦స్థుల్ సత్యమన్య
ప్రజల్. ౮౮

౨౭. బసవఁడు.

తే॥ బండినీడ్చుచుఁ దిరిగెడి ♦ పనియు లేదు
అలయ మోయుట లేదు సే ♦ ద్యమును లేదు

దేవళప్పుడిండి బసవఁడు ♦ తృప్తిఁ దినుచు
నిద్ర చెందెడిఁ గంటిరే ♦ నీటుగాఁగ  ౭౭

ఆ॥ త్రాడు దగులులేక ♦ తలఁచువారును లేక
వీథులందు నడచి ♦ విచ్చలవిడి
పరుల క్షేత్రములను ♦ పైపయి మేయుచుఁ
దిరుగుచుండు బసవ ♦ దిమ్మరీఁడు.  ౯౦

౨౦ పంది.

తే॥ సర్వ జన మోదకారిణి ♦ స్వర్గ గంగ
విమల జల పూర్ణమై వెల్లి ♦ విరియుచుండ
మురికి గుంటను కంపుచే ♦ మురుగు నీరు
ప్రబల తోషంబు నించు వ ♦ రాహమునకు.  ౯౧

౨౧ కుక్క.

తే॥ పోనఁగ నీజాతి గుంపుతోఁ ♦ బుల్లెల కడ
జగడమాడు రణప్రియ! ♦ సారమేయ!
రాజగృహమునఁగల గజ ♦ రాజుఁగాంచి
కడఁక మొఱుగకు మది వృథా ♦ కంఠశోష.  ౯౨

తే॥ కేసరంబులు మెడకుఁ ద ♦ గిల్చి సింహ
పీఠిపై శ్వానమును నిల్పఁ ♦ బెట్టినంత

మొనసి మత్తేభ కుంభ పా ♦ టన పటిష్ఠ
సింహ గర్జన మది యెట్లు ♦ సేయునేర్చు? ౯౩

౩౦. కప్ప.

తే॥ ఎన్నొ నదుల నీరము వచ్చి ♦ తన్నుచేర
రత్ననిధి సముద్రుండు గ ♦ ర్వంబు గొనఁడు
కాంచి గోష్పాద నీరంబు ♦ కప్ప యఱచు
నందఱును నాకు 'కొఱకొఱ' ♦ యని వెగటుగ ౯౪

౩౧. పాము.

తే॥ కూపమునఁ జేరి భేకముల్ ♦ కుఱకుఱ యని
బెక బెక యటంచుఁ గూయును ♦ వెగటుగాఁగ
కరి కరంబును బోలు నా ♦ కార మొప్ప
త్రాఁచు ప్రత్యక్షమై తమ్ము ♦ దరియుదాఁక. ౯౫

చ॥ శిరమున మానికంబు గుహ ♦ సేవ్యనివాసము త్యాగ మొంటిపై
బొరలు తనంతయూ వినతి ♦ బోనము మారుత మొంటి నున్కి పై
నరయఁగ వక్రవర్తనము ♦ సంగిట చిల్కును రెండు నాలుకల్
పొరిదిని మంచిచేఁ జెడుగు ♦ చొప్పడు నేమిది వింత సర్పమా!

౩౨. శేషుఁడు.

తే॥ ఫణులు గల వనేకములు ప్ర ♦ పంచమందు
భేక భక్షణ తత్పర ♦ వృత్తి ధనర

నందు శేషుఁడొక్కండె కృ ♦ తార్థ తముఁడు
ధరణి భారంబు మోవంగ ♦ దక్షుఁ డగుట. ౯౭

33 చే ప.

తే॥ లోఁతు నీటను వసియించు ♦ లోహితంబు
మిడిసిపడక క్రమంబుగా ♦ మెలఁగుచుండు
స్వల్ప జలమునఁ దిరుగాడు ♦ శఫరి యెంతొ
మిడిసి మిడిసి పడుచునుండు ♦ మిడుకుచుండు. ౯౮

34 వృ క్ష ము.

తే॥ ఔర పరజన్మములును ధ ♦ న్యములు నైన
చెట్లు సకల జీవుల కుప ♦ జీవనములు
తమ్ము కోరి వచ్చినవారు ♦ తనియుచుందు
రరిగి మరల రూరకయె హా ♦ తాశులగుచు. ౯౯

తే॥ పత్ర వల్కల చ్ఛాయల ♦ ఫల సుపుష్ప
దారు మూల నిర్యాస గం ♦ ధముల భస్మ
తోక్మ సంతతిచేఁ గోర్కి ♦ తోడ వచ్చు
జనులఁ దనియించుచుండు వృ♦క్షములు జగతి. ౧౦౦

తే॥ వదనమునఁ గ్రూర విషమును ♦ వదలుచుండు
నురగములు మూలమును చుట్టి ♦ యుండునేని

తరువు ఫల భార యుతమయి ♦ తనరియున్న
జనములకు దానిచేఁ బ్రయో ♦ జనము గలదె ! ౧౦౧

తే॥ పిడుగు మంచును దావాగ్ని ♦ సుడియుగాలి
నెంతవఱకు సహింతువో ♦ యంతవఱకు
రహి నొనర్పు పరోపకా ♦ రంబు వృక్ష
రాజమా ! నీవు జన్మ సా ♦ ర్థకముగాఁగ. ౧౦౨

తే॥ కొన్ని క్రొంజిగుళ్ళులఁ గొన్ని ♦ కుసుమములను
కొన్ని ఫలముల నీడను ♦ కొన్నియిచ్చుఁ
గాని మండు వేసంగిసి ♦ క్రాఁగుచుండు
తరువుల కొకింత నీరిచ్చు ♦ దాత లేఁడు. ౧౦౩

ఉ॥ తింటిమి పండ్లు నేద తగఁ♦దీఱెను నీచిగురాకు సెజ్జపైఁ
గొంటిమి నిద్ర చల్లనగు ♦ కూప జలంబుల దప్పిదీఱె నీ
నంటు ప్రశస్తమయ్యె సుమ♦సః పరితోష మొలర్చె వృక్షమా!
యింటివి సత్పథిక మరల♦నొప్పెడు దర్శన మేగుదెంతుమే!

3౫ చందనము.

తే॥ విధివశంబునఁ జందన ♦ విటపి యిలను
ఫల కుసుమ వర్జితంబయి ♦ పరఁగె నైన
నిజ శరీరంబు సమయించి ♦ ప్రజల తాప
మపనయించుచు నున్నది ♦ యనుదినంబు. ౧౦౫

తే॥ కలుగుచున్న సానువులందు ♦ కాష్ఠజాతి
సంగమా భుజంగములతో ♦ జరగుచుండు
స్వీయ గుణము సుగంధమై ♦ చెలఁగుకతన
చందనమునకు మహిమంబు ♦ చేరె జగతి ౧౦౬

తే॥ కొన్ని రాజపత్న్నుల కేళిఁ ♦ గొఱలుఁగాక
కొన్ని ఫలములచేఁ దృప్తి ♦ కూర్చుఁగాక
చందనమ! నీవు నీయొడల్ ♦ సమయఁజేసి
పరుల దేహ తాపము దీర్చు ♦ పరమ గుణివి! ౧౦౭

## ౩౬ కల్పకము.

తే॥ కోరినపుడు లేదనకయుఁ ♦ గొసరకిచ్చు
కల్పకంబు నదనుదాఁకఁ ♦ గాచెనేని
దానికిని జగతిని గల ♦ తరు వరముల
కే విశేష భేదము గణి ♦ యింప నగును? ౧౦౮

## ౩౭ మాలతి.

తే॥ నవల గుత్తులచేఁ జాల ♦ నమ్రములగు
లతలు పెక్కులు గలుగు ని ♦ లాతలమునఁ
గాని శ్రాంతిఁజెందినయట్టి ♦ గండుఁదేఁటి
శ్రమము మాలతి యొక్కటే ♦ సాగఁదోలు. ౧౦౯

తే॥ హృదయ హారియౌ హేతువొం ♦ డెదియొ కాఁగ
ప్రేమకు విశేషగుణములు ♦ పెక్కులేల?

వనము వికసింపఁ బిక కల ♦ ధ్వనియు నింప
నరయు మామని మాలతి ♦ విరియ దేల ? ౧౧౦

౩౮ సంపెంగ.

తే॥ చంద్రచెట్ల గుంపున నొక్క ♦ చంపకంబు
మఱుఁగుపడియున్నఁ గనులకు ♦ నెఱుఁగరాక
పూలు పూవ గంధవహుఁడు ♦ పుష్ప గంధ
మెల్లెడలకుఁ గొంపోవుచు ♦ నెఱుకపఱచు. ౧౧౧

౩౯ అశోకము.

తే॥ నీడనేమి ? యడఁగియేమి ♦ నిక్కియేమి ?
చిగిరిచియు నేమి ? మఱి నని ♦ చియును నరియొ
డస్సి యూఁకలిచేఁ జాలఁ ♦ గ్రుస్సి వచ్చు
బాటసారి కశోకమా! ♦ ఫలము లిత్తె? ౧౧౨

౪౦ మావి.

తే॥ పారిజాతాది పరిమళ ♦ బహుళములగు
తరువు లెల్లెడ నున్నవి ♦ దండిగాఁగ
నైన నొక్క రసాలమే ♦ యవనిలోన
నింపు గూర్చుచున్నది పిక ♦ హృదయమునకు. ౧౧౩

తే॥ మావి మధుర కీర్తిని విని ♦ మచ్చరమున
కంటగించెను పనస ♦ టెంకాయలోన

తాతె జలము దోస పగిలె ♦ ద్రాక్ష స్రుక్కె
మొగము ముడిచెఁ గజ్జూరము జం♦బువు మసిఁగొనె.

తే॥ చెమట వోయెను బడలిక ♦ శిథిలమయ్యె
దప్పిదీఱెఁ బికధ్వనిం ♦ దనిసె మనసు
నిన్ను చేరఁగ మాకు, న ♦ న్నియును గలిగె
సెలవె? చూతమా! నీకు స్వ ♦ స్తియగుఁగాత! ౧౧౫

౪౧ వేము.

తే॥ చిత్రముల విచిత్రము మహా ♦ చిత్రమిద్ది
విధి యుచితరీతి సృష్టించె ♦ వేఁపచెట్టుఁ
దత్ఫల రస కళాభిజ్ఞ ♦ తతియె వేలు
కనఁగ నయ్యుదియే పలు ♦ గాకి మూఁక. ౧౧౬

౪౨ చెఱకు.

తే॥ సరస మధుర సంతత మనో ♦ హార సుమూర్తి
వగుదు వద్వితీయ ధను వ ♦ నంగ మూర్తి
కిన్నియును సరియే కాని ♦ యేల చెఱక!
నిన్ను సేవింపఁ గ్రమముగా ♦ నీరసింతు. ౧౧౭

తే॥ విరస భావంబు మొగమునఁ ♦ బెక్కు గనుపు
లొడలిపైఁ గొంత శ్రమియింప ♦ కున్న ఫలము

లేదు రస లిప్సులకు నీదు ♦ లీలలివ్వి
తగవు చెఱకా! తగును నీకు ♦ దారణంబు. ౧౧౮

తే॥ విఱిచినను నలఁచినను మా ♦ ధురిమ విడద
అంగము వికారమే యైన ♦ నభిమతంబ
వృద్ధిపొంద దక్షేత్రాన ♦ వేసినంత
నివ్వి దోసంబు లగునొకో ♦ యిక్షువునకు. ౧౧౯

౪౩ ఉమ్మెత్త.

తే॥ అమృత మాధుర్య సారంబు ♦ సందినట్టి
పనసకుం గంటకము లుంట ♦ పాడియె యగు
పిచ్చి సేవించు వారల ♦ కిచ్చు నీకు
నుమ్మెతా! కంటకము లుంట ♦ యోర్వఁదగునె ? ౧౨౦

తే॥ ధూర్త ! యున్మత్త ! బాలేందు ♦ మూర్తియుండఁ
దగినచోట శంభుఁడు నిన్ను ♦ తాల్చినంతఁ
గఱువ లుల్లసిల్లునె ? యిరుల్ ♦ తొలఁగఁగలవె ?
కడలి పొంగునే ? నెలతాలు ♦ కరఁగునేమి ? ౧౨౧

తే॥ పనసతోఁ గంటగించితి ♦ పరులు తాఁక
నీఁక కంటకిత్వంబుఁ బూ ♦ నితివి వృథగ
విబుధులు హాసింత్రుగాని సే ♦ వింపఁ బోరు
ఉమ్మెతా! నిన్ను సేవింప ♦ నొందుఁ బిచ్చి. ౧౨౨

౭౭ ద్రాక్ష.

తే॥ కంటకావృతమై క్షుద్ర ♦ కంబు నైన
బదరియే యుష్ట్రమునకు మో ♦ దదమ యేని
కవి కవిత్వ పాక వినుతి ♦ గన్న ద్రాక్ష
దొరక సాక్షా దమృతసిద్ధి ♦ కరణి గాదె? ౧౨౩

౭౮ బూరుగ.

చ॥ కమల వనాళి హంసలు సు♦గంధరసాళిను షట్పదంబులున్
ప్రమదమునించుపండ్లనుచుఁ♦ బాంధులు కాకులు గ్రద్దగుంపుమాం
సములభియించె నంచు నిను♦చాలఁగ దవ్వులఁ గాంచి రాఁగ మో
సము నొనరింతు సారెకును♦శాల్మలి! యున్నతిచే సుమాలిచే

ఉ॥ కాయమునిండముండ్లు తగు♦గంధము లేదు సుమంబులందు తా
మీాయవు నీడ నీచివుళు♦లింపును పొందవు పత్రముల్ ఫలం
బా యహహా వచింప మది♦నందెడి నిబ్బితి శాల్మలీ! యిటుల్
హేయపు జన్మమెత్తి మఱి♦యెట్టులనుందు విహారసీమలన్?

౭౯ తుమ్మ.

చ॥ ఒడలిని ముండ్లు నిండినవి♦యెప్పుడు చల్లనినీడ యాకులున్
గడు నలుసుల్ ఫలంబులును♦కావు భుజింపఁగఁ బుష్పగంధమిం
పడరద యిట్టులుండియు జ♦నావళి కొందురు నిన్ను కంచెగాఁ
బుడమి విహారసీమలను♦పొందఁగ లేవెటు తుమ్మవృక్షమా!

చ॥ ఒడలిని ముండ్లు నిండినవి♦యొప్పదు చెల్లని నీడ యాకులుఁ
గడు నలుసుల్ ఫలంబులును♦కావు భుజింపఁగఁ బుష్పగంధమిం
పడరదు గాని గొప్పతన♦మందిన దొప్పు గుణంబు తమ్మ్రకొ
క్కఁడ పెర పండ్లచెట్టులకుఁ♦గంచెగ నొప్పి రహించు నెల్లెడన్.

౪౭ మో దు గు.

తే॥ పుష్పితాభిమానంబును ♦ పొందఁబోకు
మోదుగా! తేంట్లు నినుచేరి ♦ ముసరి ననుచుఁ
గలఁవ నవమల్లికా వియో ♦ గమ్ము తమ్ము
వహ్ని యను భ్రమచే నందు♦పడఁగ వచ్చు. ౧౩౮

౪౮ త ప సి.

చ॥ఎవఁడవు నీవు? దుర్భగుఁడ♦నేఁ దపసిన్ ; దెలిసెన్ విరాగినా
నెవడుచునుంటి వొంటి నది♦నేమ మొ? కాదు వచింతు దూరమం
దవిరళమైన మత్తి కల♦దందు జనంబులు విశ్రమింపఁగాఁ
దవిలి రవంత నీడయును♦తార్పఁగ లేనిట దారి నుండియున్.

౪౯ ప్ర త్తి

తే॥ ప్రత్తికాయ నీరసమయ్యుఁ ♦ బ్రజల మదికి
సమ్మతంబయ్యె గుణమయ ♦ జన్మమగుచుఁ

బరుల మానంబుఁ గాపాడఁ ♦ బొలుపడుచు
వస్త్రరూపంబుఁ దాల్చుట ♦ వసుధయందు. ౧౩౦

౫౦ కంటకారిక.

తే॥ మొగిలి పొదకు నారింజకు ♦ ముండ్లు కలిమి
యుక్తమగు గంధమును రస ♦ మొసరలేని
కంటకారిక కేలొకో ♦ కంటకములు?
వలయు గుణమున్న చోఁటఁ గా♦వలియు నిజము. ౧౩౧

౫౧. ఉల్లిగడ్డ.

తే॥ కప్పురవు ధూళినే పాదు ♦ గా నొనర్చి
కస్తురియుఁ గుంకుమము నొత్తు ♦ గాఁగ మెత్తి
స్వర్ణ ఘటముతోఁ బన్నీరు ♦ చల్లుచున్న
నుడుగునే నైజ మింతేని ♦ యుల్లిగడ్డ. ౧౩౨

౫౨ వడ్లు.

తే॥ చండ ముసల ఘాతములకు ♦ సహన మొంది
నవ్య శుభ్రత గను రాజ ♦ నాలు మేము
స్వల్పపీడచే స్నేహంబు ♦ వదలి యప్పుడె
ఖరత వహియించు తిలలము ♦ గామనుమ్ము. ౧౩౩

౫౩ సా ర స.

చ॥ ఒకసారతీఁగనుండి యగు♦నొప్పుగఁ గాయ లవెన్ని యైన నం
దొకటి యతీశుచేతఁబడి ♦ యర్జితపాత్రత గాంచియుంచె వే
ఱొకటి విశుద్ధవంశయుతి♦నొందుచు సుస్వర మాలపించె నిం
కొకటి గుణాన్వితంబగుచు♦నోపని యాపగదాఁటఁజేసె వే
ఱొకటి జ్వలించు నుల్లమున♦నొప్పుచు నెత్తురుద్రావుఁ గంటిరే!

౫౪ వె దు రు.

తే॥ నిశిత శస్త్రంబుచేఁ ద్రుంచి ♦ పోసఁగ నేడు
తొమ్మిదిగ రంధ్రములు మఱి ♦ తొలువ నేమి?
ధరణి శుద్ధవంశము తప్పి♦దారి యేని
విరస జల్పముల్ వానుండి ♦ వెడలనీదు.

౫౫ క మ ల ము.

తే॥ అనము లగువారితో సము ♦ లగుటకంటె
నెద్దడిని నొచ్చుటే మేలు ♦ పృథివి ననుచు
కుముదములు వికసింపఁగాఁ ♦ గొఱఁతపడుచు
కమలములు ముకుళించిన ♦ కరణిఁ గంటె! ౧౩౬.

తే॥ తామరసపత్రమా! నీ చరి ♦ త్రంబు నంత
నుడువఁ జిత్రంబుగా నుండు ♦ నడుసునందు

బుట్టియును జలంబుల సదా ♦ తొట్టియుండి
పంక సంగిగా వచ్చు భా♦వంబువలన. ౧౩౭

తే॥ లోకబంధుఁడు బంధుఁడు ♦ లోకగురుఁడు
బావ తోఁబుట్టు శ్రీలక్ష్మి ♦ బ్రహ్మ సుతుఁడు
స్వచ్ఛచరితంబు గలది కం ♦ జంబు దాని
మంచుబాధ నొకండైన ♦ మాన్పలేదు. ౧౩౮

తే॥ పంకజంబ! ప్రేమము మధు ♦ పాయులందు
అప్పులోన నెలవు కంట ♦ కాలి సంగ
మట్టులయ్యును చిత్రం బ ♦ దేమి చెపుమ?
మిత్రుఁడే తేర హర్షంబు ♦ మిగులఁ గనుదు. ౧౩౯

మ॥ అమలాంభో మధుర ప్రశస్త జనివై ♦ శ్యామాముఖ స్పర్ధివై
యమరశ్రేణి మనోనుకర్షణ సుగం♦ధాఢ్యంబవై శ్రీశు హ
స్తమునం జెంది మనోజ సత్కవివచ♦స్సర్వస్వమై యొప్పి యో
కమలంబా! మధుప ప్రియంబుగొన నిం♦కంబల్కఁగా నేమగుఁన్?

## ౫. జలము

ఉ॥ సాజము శీతలత్వమును♦సాజము స్వచ్ఛతయుఁన్ జనంబు ని
న్నొంజ స్పృశించినన్ శుచిత♦నొప్పును తోయమ! జీవకోటికిన్
పూజితరీతి జీవనము ♦ పూర్తిగనిత్తు ప్రశస్తవై ఖరుల్
గాఁ జను నీవె నీచపథ ♦ గామివిగా నెవఁ డాపనోపెడిన్?

౫౭ బంగారు.

తే॥ అనలమున వైచి తాపంబు ♦ నడరఁజేసి
త్రుంచి కొట్టి సాఁగఁగఁదీసి ♦ రుద్ది విక్ర
యింప బంగారు దుఃఖంబు ♦ నెనయదైన
గుంజతోఁ దూఁచుటను గూర్చి♦కుములు మిగుల.

౫౮ ముత్తెము.

తే॥ జన్మమూ గజరాజ మ ♦ స్తకమునందు
మసికియా మహీశ్వర లస ♦ న్మకుటమందు
అజ్ఞ లోక కొంద ఱోకట న ♦ నాదరింప
నాణి ముత్యాల కది దోస ♦ మగునయేమి? ౧౪౩

౫౯ తగరము.

తే॥ తగరమా! స్వర్ణముంబలెఁ ♦ దనరి తులను
తూఁగినంతనె మదమేల ♦ తుదిని గనుమ
రత్నఘటితమై యది చేరు ♦ రాజు శిరము
పేదచెలుల కాళ్లఁ బెనఁగి ♦ వేఁగు దివు. ౧౪౪

౬౦ పంజరలావుకము.

తే॥ అన్న! పూరేడు పిట్ట! యి ♦ ట్లలర వలదు
పెక్కు పెర విహంగములఁ జం♦ పితి నటంచు

నిన్ను నొకనాఁటి యుదయాన ♦ నీప్రభుండు
చంపి భక్షించు ననుట ని ♦ జంబు తెలియు. ౧౪౫

౬౧ వ్యాఘ్రుఁడు.

ఉ॥ నమ్మిన ప్రాణికోటుల న♦నారతము౯ హరియించుచుండు దౌ
ష్ట్యమ్మిది నీచు నంచు మది♦సారెకుఁ జింతిలకోయి వ్యాఘ్రుఁడా!
ఇమ్ముల రాచకూటముల ♦ నిద్ధ పవిత్ర తలంబులందు ల
క్ష్యమ్ముగ సాధుహింస పని♦గా నొనరింతురు కొందఱన్నలై!

౬౨ కస్తూరి.

తే॥ ఓసి కస్తూరి! గురుగర్వ ♦ ముడుగు మింక
నఖిల పరిమళముల శ్రేష్ఠ ♦ నగుదునంచు
నడవిగుహాల వసించు న ♦ త్యంత దీన
జనకునకుఁ బ్రాణహానియె ♦ సల్పుచుండు. ౧౪౬

౬౩ దీపము.

తే॥ దీపమా! శ్రీ వివృద్ధియుఁ ♦ దేజరిల్లు
పాత్రగతము స్నేహంబు గా ♦ పాడుకొనుము
అట్లు చేయక పోవుదే ♦ నవలఁ గనుము
నీ గుణమ్ములు బూదియై ♦ నిలుచుఁజుమ్ము. ౧౪౭

తే॥ దీపమా! యెల్ల చీఁకట్లఁ ♦ ద్రెంచు నీకు
శలభము ఫలాశ రా మాడ్కి ♦ చంపఁదగునె!

తెల్లవాఱ నీ యశమును ♦ తెల్లవాఱు
స్నేహము దశయు జ్యోతియుఁ ♦ జెంద వవల. ౧౪౯

## ౭౪ కడవ.

తే॥ గట్టిగా మెడ కురిత్రాడు ♦ గట్టనేమి?
బావిలోఁ ద్రోవనేమి? కుం ♦ భమ్మ! నీవు
దప్పిదీర్తువు జీవన ♦ దాత వగుచుఁ
గష్టజన్మంబు ధన్యత ♦ గాంచునట్లు. ౧౫౦

## ౭౫ స్వర్ణకారుఁడు.

తే॥ స్వర్ణకర! పర దుఃఖ వి ♦ చార మూఢ!
వైచెదేల మాటికి నన్ను ♦ వహ్నియందు
స్వర్ణమును నేను మఱి నాకు ♦ వన్నె హెచ్చు
నీఱు మోమున నిండుచే ♦ నీకు ఫలము! ౧౫౧

## ౭౬ కుండలము

చ॥ మునుపవనాగ్నిశస్త్రజల♦ముఖ్యములందుతపంబు దుష్కరం
బొనరిచి తత్ఫలాకృతిగ♦నొందితి విట్టి సువర్ణ దేహముల్
వనిత కపోల చుంబనము♦వారని మేల్ రతనాల సంగముల్
గునియుచునూఁగెదింక నెది♦కోరెదొ ?కుండలమా! వచింపుమా.

౬౭ నటకుఁడు.

శా॥ కేలిన్ మౌళిఁ గిరీటకాంతి భుజముల్ ♦ కేయూరభవ్యంబులౌ
లీలన్ భృత్యులు కంచుకుల్ జయములో ♦ లిం బల్క సేవింప నీ
హేలాకల్పన విస్మరించి మదిలో ♦ నేలా నృపాహంకృతుల్?
లీలాంతానఁ గుశీలవా! వదన మా ♦ లిన్యంబె దక్కుంజుమీ!

౬౮ త్రాసు.

తే॥ గురుత గాంచిన వంతువు ♦ శిరసు లఘుత
యమర వంచవు సమమైన ♦ సమత నుందు
త్రాస! యుచితజ్ఞ వగుదువే ♦ తలఁప నీవు?
ఉదిరి గురిగింజలను తూఁచి ♦ యుంతు సమత. ౧౫౪

తే॥ ఏటి ప్రామాణిక పదవి ♦ నెనసి తీవు
గర్వమేల? తులా! చేతఁ ♦ గాని పనికి
క్రిందికిం దించుచుందు గ ♦ రిష్ఠములను
పైకి నెక్కింతువు కనిష్ఠ ♦ వస్తువులను. ౧౫౫

౬౯ గోపురకలశము.

మ॥ అరరే! కాంచనలేప తామ్రకలశం ♦ బా! చాలకాలంబు సు
స్థిరమై యుండుము దేవళంబుపయి భీ ♦ తిన్మాను తామ్రత్వమే
తొలఁగెన్ బంగరుకీర్తి సంతతము చెం ♦ దు న్నీకు నిక్కంబులో
నరయంబూనరు లోకు లెప్పుడు బహి ♦ ర్వ్యాపార బుద్ధుల్ గదా!

౭౦ పాలు.

తే॥ నైజ మధురిమ శుద్ధ గు ♦ ణంబునందు
పాలతో సాటి వేఱొండు ♦ వసుధఁగలదె?
కాఁచి పేరిచి చిలికినఁ ♦ గాని తన్ను
యేఁచు వారికి స్నేహ మిం ♦ పెనయ నిచ్చు. ౧౫౭

౭౧ బడిశదండము.

తే॥ సరళమును తటస్థితమును ♦ సద్గుణంబు
వంశ భవమయ్యుఁ గావింతు ♦ పాపకృతుల
బడిశదండము! నీకద్ది ♦ వక్రగుణము
గలుగు కంటక సంగతి ♦ ఫలము నిజము. ౧౫౮

౭౨ హాలాహలము.

తే॥ అమిత దారుణ గుణము నా ♦ యది యటంచు
హాలహాలము! మదిని చింత ♦ నడలనేల?
నిన్ను మించిన వారలీ ♦ నేలఁ గలరు
పలుకుల సుదుస్సహ విషంబు ♦ గలుగువారు. ౧౫౯

౭౩ కడప.

తే॥ దేహమున జన్మమందును ♦ దిటవునందు
తొలచి తీర్చుటలో రెంటఁ ♦ గలుగు సమత

కాని యొక్కటి దైవమై ♦ కాంచు వినుతి
కడపపైన ఱాయి భజించుఁ ♦ గాలిత్రొక్కు. ౧౬౦

౨౪ రోఁకలి.

తే॥ కలువకంటి లలిత మృదు ♦ కరములంట
ముసలమా! నీకు చిగురులు ♦ పుట్టకుంటఁ
గఠిన హృదయ కాష్ఠంబవే ♦ కాక యడవి
వర్ధిలుట మఱి సత్యంబు ♦ వాస్తవంబు. ౧౬౧

శ్రీ విక్టోరియా జూబిలి ముద్రాక్షరశాల, చిత్తూరు.

# ౨. మధురాకాండము

## ౧౧. అటవీ దర్శనము

మంజరి॥ ముప్వురు చంద్రుల - ముడిచిన కరణి
నడరి యంగగు [1]మూఁడు - గొడుగుల క్రింద
నినకాంతి కంబెసు - తనరి పుష్పించి
మాలికలుగ వ్రేలు - పూలతో నొప్పు
కంకేలి క్రింద సం-గతి నెలకొన్న ౫
యాదిదేవుండగు - నర్హుఁ బూజించి
నిష్కండు పల్లియ - నెలవుగాఁ గొనుచు
మునులున్న తోఁటలో-మున్ను చారణులు
తెలిపిన ధర్మముల్ - తెఱఁగుగాఁ దెలిపి
నాఁడట నిల్చి మ-ర్నాఁడు దక్షిణము ౧౦
సన నెంచి వేకువ-జామున లేచి
నడచి భానుఁడు తూర్పు-నం దోఁచుసరికిఁ
బొలములు కొలఁకులు - పొలిచి లేఁజెట్ల
వనమునఁ గల మండ-పమ్మునఁ జేరి
రాజరాజైన మా - ప్రభుఁడు సుఖించు ౧౫
నాకల్ప మీలోక - మరసి రక్షింపఁ
బ్రభులకుఁ దనమేల్మి - పదమునఁ దెలిపి

1. మూఁడు గొడుగులు:— (ముక్కడై) చంద్రాదిత్యము, నిత్యవినోదము, సకలభూషణము.

[1] పూర్వవైరము నోర్వఁ - బోక కుమారి
గిరి నబ్ధి వేష్టించి - పరవుట కతన
పడదెస గంగను - పడఁకు గుబ్బలిని ౨౦
గెలిచిన రాజు సు-ఖించును గాక
చంద్రుని వంశమ్ము - జాసుగ వెలుఁగ
నింద్రుఁ దొసంగిన - యించు హారమ్ము
సురియఁ దాల్చిన తేఁడు - సుఖియించుఁ గాక
మన యింద్రు నెత్తి మొ-ట్టిన వాఁడు గాన ౨౫
నిట నిల్వరాదని - యేగు వర్షమును
వలసిన యంత దై - వాఱంగఁ గురిసి
పంట పండించిన - ప్రభుఁడు సుఖించు
నని పాండ్యునకు విజ-యమ్ములు పలుకు
చరుదెంచు విప్రు న-యంబారఁ గాంచి ౩౦
యూరేది యిటకు రాఁ - గారణమేమి ?
యని యర్థిఁ గోవలుఁ - డడుగ న విప్రుఁ
డిట్లని పలికె నో-యీ పుణ్యపురుష !
మబ్బులొలయు పైఁడి - మలయందు శేష
తల్పంబు మీఁదఁ బ-ద్మావతిఁ డగుచుఁ ౩౫
గావేరి దీవిని - ఘనులు నుతింప
వేంచేయు శ్రీపతి - వేసంబు తీరు

1. పూర్వమొక పాండ్యుఁడు తన శక్త్యాయుధముచే సముద్రనీరము నింకింప నావైరము మదినుంచుకొని సంద్రము పాండ్యదేశమందు కొంతభాగము ముంచి వైచినదని పూర్వ గాథ.

వృషభాచలమ్మున - నిరుపక్కియలను
చంద్ర సూర్యు లలరు - స్థలమున మెఱుపు
వలువగా నింద్ర చా-పము ధరియించి ౪౦
నిలిచిన కారు మొ-గులు వలె నొప్పి
శంఖ చక్రములు హ-స్తమున ధరించి
యురమునఁ గౌస్తుభం - బొప్పుగా వెలుఁగఁ
గనక చేలము తోడఁ - గమల [illegible]
నేత్ర పర్వంబుగా - నిలిచిన తీరు [illegible] ౪౫
కాన్పింపు మనుచు నా - కన్ను లుల్లమును
పీడింప నైఁపక - వెడలి వచ్చితిని.............
పడమటి కొండల - ప్రక్క మాంగాడు
మాయూరు పాండ్యుని - మహిమమ్ము దేశ
సంపద కన్నులు - చల్లన గాఁగఁ ౫౦
గాంచితిఁ గాన దీ-వించితి నిట్లు
వినుఁ డిది నా రాక - యని విప్రుఁ డాడ
మధురకుఁ జన మంచి - మార్గమ్ము తెలుపుఁ
డని కోపఱుం డన - నాతఁ డిట్లనియె
దక్షులౌ మంత్రులఁ - దగఁ గొనకుండు ౫౫
రాజు పాలనచే న-రాజక మైన
ధరణికై వడిని మా-ధవుఁ డను మంత్రి
తోడ వేఁడి వెలుంగు - తేఁజు మార్పడుచు

చల్లని ధూముల - సత్స్వభావంబు
చెడ మరు భూమిగాఁ - జేయుచు నుండు ౬౦

పట్టునఁ జెలువతో - బయలు దేఱితిరి
రాలు రప్పలు నెక్క - రాని గుట్టలును
గట్టులు మిట్టలు - గలిగి దుర్గమము
గా నున్న యీ త్రోవఁ - గడచి చనంగ
నటఁ గొడుంబాఱూరి - కవ్వల నుండు ౬౫

గుంట గట్టును చేరఁ - గొండ విల్కాని
శూలాగ్రముం బోలెఁ - జీలి ముత్రోవ
పొదకట్టు నందలి - కుడిత్రోవఁ బోవ
విరిసిన తలగల - వెల్ల కడిమియు
కాఁగిన తలగల - కారు మామిడియు ౭౦

నెండిన వెదుళులు - నెండిన పొదలు
మాఁడి నల్లన యయి - వేఁడియౌ చోట్లు
దప్పి నల్లాడుచు - దుప్పులు లేళ్ళు
తిరుగాడు నడవి వేఁ-టరుల పల్లియకుఁ
బ్రక్క త్రోవయుఁ గల్గుఁ - బై దాఁటి చన్నఁ ౭౫

బర్వత ప్రాంతాలఁ - బండెడి వరియు
ముదిరి పక్వం బయి - పొలుపారు చెఱకు
తలలు వ్రాలుచు వెన్ను - గల కొఱ్ఱ చేలు
పసుపును వెల్లుల్లి - పండు పొలములు
ఆకుఁదోఁటలు పోఁక - లరటి టెంకాయ ౮౦

పనస మామిడి తోఁట - లసువుగాఁ గలుగు
పాండ్యుని చిఱుమల - పడయంగ వచ్చు
దాని కెడమ ప్రక్కఁ - దరలిన మధుర
చేరంగ వచ్చు నా - దారిఁ బోరేని
ఎడమ త్రోవను పోవ - నెసరేఁగి తేంట్లు ౯౫
పాడు కొలంకులు - పంట పొలములు
చల్లని తోఁటల - జాస్తైన త్రోవ
దాఁటి యడవి త్రోవ - దాఁట నళఘరి
వసియించు తిరుమల - ససిఁ జేరుఁ దచట
పీత మోహమ్మగు - బిల మొండు కలదు ౯౦
వేలుపుల్ వినుతించు - వింతలు గలుగు
శరవణ మన భవ-హరణ మనంగ
నిష్ట సిద్ధి యనఁగ - నెసఁగు తీర్థములు
గలవందు తొలిదాన - జలమాడ నింద్రు
వ్యాకరణ జ్ఞాన - మలవడును భవ ౯౫
హారిణీ యందాడ - నపురూప మైన
పూర్వ జన్మ జ్ఞాన-ముం బొందు వారు
ఇష్టసిద్ధి మునుంగ - నిష్టసిద్ధి యగు
ఆ కొండపై విజ-యము చేసియుండు
భగవంతుఁ బూజించి - తగ మది నతని ౧౦౦
చరణమ్ము లుంచి యా - ధరణీ ధరమ్ము
ముమ్మాఱు వలగొన్న - భువి చీలినట్టు

లగపడు లోఁతైన - యందె పేరేటి
గట్టున నొక గోఁగు-చెట్టు క్రీనీడ
నైదు నల్లని జడ - లుల్లసిల్లంగ ౧౦౫
విరిలతఁ బోలిన - మరులు కన్నియను
కన నగు నది మిమ్ముఁ - గని యిట్లు పలుకు
"నీమేన మఱుమేన - నెసఁగు సుఖములు
శాశ్వత సుఖ మబ్బు - చందంబు చెపుఁడ
చెప్పిన నీకొండ-చేరువ భూమిఁ ౧౧౦
జేరి మీయానతిఁ - జేయుదుఁ బనులు
బిలము వాకిలి దీసి - తెలుపుదు త్రోవ
నను వరోత్తమ యని - జనులు వచింత్రు"
తత్ప్రశ్నములకు ను-త్తర మీయ నామె
తలుపు తెఱచి చూపు - దారిని పోవఁ ౧౧౫
బొడవగు ద్వారంబు - లెడనెడ నుండు
వాని దాఁటిన జంట-వాకిలి గలదు
అట వేలుపులు వ్రాయ - నమరిన ప్రతిమ
వంటి చెలువ యొర్తు - వచ్చి నిల్చుండి
తుదిలేని సౌఖ్యమ్ము - ముదమున నాకు ౧౨౦
వాక్రువ్వ మీరలు - వలచిన కీర్తి
ధర్మమ్ము ముక్తి నం-దం గలవారు
మీకు నే నొక కీడు - మేకొన కుండఁ

చేరఁ బిలుచు చోటఁ - జేర్చెడు వాస
నని పల్కుఁ జనువార - లనువగు నుత్త ౧౨౫
రం బీయ మూఁడు తీ-ర్థములకుఁ ద్రోవఁ
జూపి మరలు నంత - సొరిదిఁ బంచాక్ష
రీ మంత్ర మష్టాక్ష-రీ మంత్రరాజ
మేక చిత్తతఁ జ-పియించి యమ్మేటి
వలచు తీర్థమ్మున - జలమాడి చేసి ౧౩౦
తాపసులకును బొం-దఁగరాని ఫలము
లభియించు నిజ మవ్వ-లన్ మల మీఁది
మాధవు పాద ప-ద్మమ్ముల నెడఁదఁ
దత్పర మతి నిల్పఁ - దద్ధ్వజస్తంభ
మరయఁ గానఁగనగు - నరసినయంత ౧౩౫
భవ పాశములు పటా-పంచలై పోవు
నట్టి మహానంద - మంది యామీఁద
మధురాపురము చేరు - మదితోడఁ బొందు
కనుల పండువు గాఁగఁ - గానంగవచ్చు
బిల మహిమం బిది - తెలియఁ జెప్పితిని ౧౪౦
ఈరెండు త్రోవల - నేగర యేని
తక్కిన యది మంచి - దారి యందందు
పూల తోఁటలు గల - యూశలు గలవు
నడుమ నడుమఁ గల - యడవులఁ గడచి
నడచుచో నా త్రోవ - నిడుమలు కూర్చు ౧౪౫

దేవత యుండు నా - దేవత మంచి
యాకారమునఁ దోఁచి - యాటంక పఱచు
దానిని మీరలు - తప్పించుకొన్న
మధురకుఁ జను మూఁడు - మార్గముల్ చేరుఁ
జనుఁ దేనును త్రివిక్ర-ముని పదమ్ములను ౧౩౦

కొలుచు నభీష్టంబు - గలవాఁడఁ గానఁ
బనివినియెద నని - పల్కు విప్రునకు
గొంతి యిట్లను సార్థ-క వ్యాహృతులను
సచ్ఛీలవర్తనా-సక్తి నొప్పారు
వేద విద్వర ! విను - బిలమును కాంచు ౧౩౫

కాంక్ష మాయెడ లేదు - కల్పంబు గలుగు
నింద్రు వ్యాకరణమ్ము - నిమ్మగ సుగతు
నాగమంబులఁ గాన-నగుఁ గానఁ బుణ్య
శరవణ స్నాన కాం-క్షను చేయ మేము
చనిన జన్మమునఁ జే-సిన కర్మఫలము ౧౪౦

కనిన జన్మమ్మునఁ - గాంచుట లేదె !
భవతారణిని మున్గఁ - బనియేల మాకు ?
సత్యంబు తప్పక - సకల జీవులను
కాచువారికిఁ బొందఁ - గాని యర్థమ్ము
లిల లేవు గావున - నిష్టసిద్ధియును ౧౪౫

సేవింపఁ బబలేదు - శ్రీ మీఱ నీవు
ప్రేమించు దైవమ్ము - వీక్షింపఁ బొమ్ము

మేము దూరపు దారి - మేకొని చనుదు
మని పంపి యిరువురఁ - గొని త్రోవఁ జనుచు
శ్రమ చెంద నిలుచుచు - శ్రమఁ దీర్చికొనుచుఁ ౧౭౦
జని చని మున్త్రోవఁ - గని నడుదారిఁ
బయనింప యత్నించు-పట్టునఁ బ్రక్క-
త్రోవను చని కొంత - దూరమ్ము నందు
గల కొలనిం గని - జలములఁ ద్రావఁ
గోరి రేవున నుండు - కోవలు కడకు ౧౭౫
దారి దయ్యము వల - తలకొన వచ్చి
మాధవిం గాంచు - మాడ్కి- నితండు
వలచు ననుచు నెంచి - వాసంతమాల
యురువునఁ గనఁబడి - యులియు పూఁగొమ్మ
పగిది నాకోవలుఁ - పదముల కెరఁగి ౧౮౦
కన్నీరు కార్చుచుఁ - గడఁక నిట్లనియె
మాలికలో వ్రాయు - మాటలయందు
పొరపాటు లేదు నీ - పోఁడిమి వలనఁ
బలికిన పలుకులఁ - గలదు కాఁబోలుఁ
గావున నతఁడు కి-న్కను పూనినాఁడు ౧౮౫
అనుచు వికలచిత్త-యై తపియించు
చున్నది మాధవి - యురు దయాకలిత !
తాపసులైన వి-ద్వద్వరులైన

విజ్ఞానులైన వి-వేకులె యైన
మనసు నొప్పించుట - చన దంద్రు కాదె ౧౯౦

వదనమ్ము చూడ కొ-ప్పరికించు కతన
మాధవి వెలయాంద్ర - మనుగడ నీచ
మని బాష్పములు కార్చి - తన కేల మెడను
ధరియించి యున్న ము-త్యాల హారమ్ము
వడి దీసి పాఅంగ - వైచి నిర్వేద ౧౯౫

మంది నన్నును వీడి-నది గాన మీరు
మధుర కేగుట దారి - మనుజుల వలన
విని సాతుతో వచ్చి - వెతఁ గుందుచుంటి
నేమని యుత్తర-మిత్తువో యనుడు
మరుఙ దేవత వన-మధ్యంబు నందు ౨౦౦

కలదని విప్రుండు - తెలిపెను గాన
వంచనా భంజక - వరమంత్ర మహిమఁ
గల రూపెఱింగెదఁ - గాకని మంత్ర
మర్థి జపింప న-య్యది దుర్గ దేవ
తాక మగుట మిట్టి - తలఁకి దద్దఱిలి ౨౦౫

యీ వనచారిణి - నేనౌట భ్రాంతి
గలిగించితిని దీనిఁ - గౌంతికి సతికిఁ
దెలుపకు మని వేఁడి - దిచ్చుమోమయ్యొ
నవలఁ దామర దొన్ని-యను శీతజలము

తెచ్చి కన్నుగిలగ - దీర్చి సతంబు ౨౧౦

పండ పెంచ్చుచుఁ బ్రోవ - నమరించి కట్టి
మసి యెంచి మున్ముందు - నటఁ గురవకము
గోఁగులు మరువమ్ము - వేఁగియుఁ జూచి
యున్న చల్లని త్రోవ - నొగి నేగు వారి
ఘనము చోఁచుచు వర్ష-మునఁ బండు పంట ౨౧౫

కలుగమి వింటిచేఁ - గలిగెడి కృషిని
చేయు దోయిలు యమ్రుఁ - జెనయు బలమ్ము
చేఁ బోవ విజయమ్ము - చేపడఁ జేసి
ప్రతిగాఁగఁ బౌరుష-బలిఁ బ్రతిష్ఠించు
చుండు నెత్తిని కన్ను - లొప్పారు కుమరి ౨౨౦

వేల్పులు వినుతించు - విమల విగ్రహము
గల యాలయమ్మును - గని యందు దిగిరి.

## ౧౩. పెఁటల యాటపాటలు

వేవెల్గు గాటంపు - వేఁడిమి వలనఁ
గన్నగి మిక్కిలి - గాసిలి యడుగు
వెల్లువారఁగఁ బొక్కు - లెగయంగ నిడుపు
టూర్పులు పుచ్చుచు - నుండంగఁ గాంచి
దుర్గాలయంబునఁ - దూఱి యందొక్క

ప్రక్క నెవ్వరెఱుఁగ-రాక యున్నంత
బోయలపల్లెలోఁ - బూర్వంపు టప్పు
నడుగంగ శాలిని - యను నొక్క వదర
వచ్చి వేఁటరు లెద-వడి యంజి చూడ
దేవతావేశ మం-ది కరమ్ము లెత్తి ౧౦
వెంద్రుకలు విదిర్చి - వెస మెడ త్రిప్పి
యడుగులు విదలించు - చాడుచు నిలిచి
యూరి వా రొక్కచోఁ - జేరి భుజించు
రచ్చ కొట్టము చేరి - ప్రామొక్కుబళ్ళు
చెల్లింపకుంటచేఁ - జెలువుగఁ బగఱ ౧౫
యూరఁ బసుల మంద - లొగి వృద్ధి నొందె
మీ కూటములు మేర - మీఱి పాడఱియె
నది గాక మీకు స్వా-మ్యంబైన త్రోవ
దోఁపిడితనమును - దొరకుట లేదు
పౌసఁగ ధార్మికులకుఁ - బుట్టిన వారి ౨౦
వలెఁ బౌరుషము లేక - వడిఁ గ్రుస్సినారు
బిచ్చంపు బ్రదుకు మీ - యిచ్చ నెంచితిరా ?
జింక తత్తడి వేల్పు - చేయిచ్చి యొసఁగు
గెలుపునకుం బ్రతి-ఫలముగా జీవ
బలి భుజించినఁ గాక - యలరి మీ విండ్ల ౨౫
కిఁక మీఁద విజయమ్ము - నీయంగ రాదు
త్రోవ దోఁపిడి చేసి - తూలంగఁ ద్రావి

వర్ధిల్లు జీవిక - వాంఛింతురేని
క్రొముక్కుబడుల యప్పు - మొదటఁ జెల్లింపుఁ
డని పల్క విని బోయ - లది సమ్మతించి 30
తలఁచిన పగవారి - తలలు ఖండించి
పొగడొందుటలు గాక - పొసఁగుపాటేల ?
యని యుత్సహించి గెల్పందిచ్చు కుమరిఁ
బాఁప పిల్లయుఁపవు - బంగారు పేరు
చే జడ పొడవుగాఁ - జేరిచి చుట్టి 35
తోఁటలపైరుల - దొమ్మాడు చేయు
పందికొమ్ములఁ జంద్రవంకల వంటి
బలు కోఱలుగ నుంచి - పులినోరు చీల్చి
వాని పండ్లను లాగి - వరుసగాఁ గూర్చు
తాళిబొట్టుల పేరు - తగిలించి మెడను 40
రశనగా పులితోలు - రాజిల్లఁ జేసి
వెలవిల్లు చే నుంచి - జింక వాహనము
పైఁ జేర్చి మదనుని - ప్రతిమయుఁ జిల్క
యడవి కోడి నెమలి - యాట బంతియును
పొసఁగించి స్తుతియించి - పూవులు చల్లి 45
వన్నియ కలపంబు - బంగరు పొడియుఁ
జందనగంధమ్ము - గందవొడియును
నువ్వుల యుండలు - క్రొవ్వు టన్నంబు

బందరు పొడి ధూప - పాత్రమ్ము మొదలు
గాఁగల వస్తువుల్ - గైకొని వరుసఁ ౫౦
బడుచులు నిలువంగఁ - దుడుములు తమ్మ
టమ్ములు చిన్నముల్ - కొమ్ములు పిల్లఁ
గ్రోవులు పంబలు - మ్రోఁగంగ నెదుట
బలిపీఠమునకును - వాహనమునకుఁ
గుమరికిఁ బూజలు - కొమరుగాఁ జేసి ౫౫
వినుతించి యాడిరి - వేడ్క వేఁటరులు
ననఁబోణియైన క-న్నగిని గాన్పించి
కొడగుదేశపు లక్ష్మి - పడమటి కొండ
రాణియౌ ద్రవిడ వి-గ్రహము జనమ్ము
నలిపిన సత్తప-స్సార మీలోక ౬౦
మునకు నిర్మల మణి - [illegible]యు స్త్రీరత్న
మనుచు శాలిని దేవ-తావేశమంది
పలికి పూజలఁ దృప్తి - పడితి నంచాడ
విన్న కన్నగి యామె - విభ్రాంత యగుచుఁ
బలుకు పలుకు లని - ప్రాణేశు వెనుకఁ ౬౫
జేరి యలఁతి నవ్వు - చెలఁగంగ నిలిచె.
చంద్రవంక ధరించు - జడముడి తెప్ప
లార్ప కుటిమి చూచు - నతులు నంజు
మ్రింగి నల్లనయైన - మెడ పాఁప పేరు
మేరువు విలు చను - మిట్టల పైని ౭౦

పాఁప కచ్చియ కేల - వాఁడి శూలమ్ము
కరి తోలు కప్పు సిం-గపుఁ బోతు రవన
గలది యందియ పీర - కటకమ్ము నెదమ
కుడికాళ్ళఁ గలది యె-ప్పుడు విజయమ్ము
కార్య సాఫల్యమ్ము - గలక త్తి కేలఁ ౭౨
గలయది మేనను - తలయును వేఱు
తెఱఁగునుగ బలిష్ఠ - దీర్ఘ బాహువుల
దున్న యసుర తలఁ - ద్రొక్కి నిల్చినది
కౌమారి నీలిని - గౌరి సంపూజ్య
శూలిని వెన్నుని - సోదరి కాళి ౭౦
సంపత్ప్రదాత్రి యీ-శ్వరి కలా కుశల
తోఁచిన రూపమ్ము - దొడ్డది యనుచుఁ
గన్నవారలు పల్కఁ - గరుణ చూపినది.

తే॥ కలవు పొన్నల సన్నలు - గన్నెరులును
తావి క్రోవులు మావులు - క్రేవఁ గలవు
ఆరెలుం గల్గు చందన - మారఁ గల్గు
భర్గు సామేని నేలెడి - దుర్గ యెదుట. ౧

వేఁగు లపరంజిఁ బోలిన - విరులఁ జిందుఁ
దొగరు పూల తేకులను బూ-రుగులు చిందుఁ
బేలలం బోలెఁ గానుగ - విరులు చిందు
భర్గు సామేను నేలెడి - దుర్గ యెదుట. ౨

తే॥ పూచె గోఁగులు వేఁగులు - పొన్నచెట్లు
వీచెఁ జల్లని మెల్లని - విరుల గాలి
పాడె గొండ్లికిఁ బెండ్లికి - భ్రమర పంక్తి
భర్గు సామేని నేలెడి - దుర్గ యెదుట. ౩

అంబ నగలను తాను నె-య్యమునఁ దాల్ప
నెంత తప మాచరించెనో- యీ కుమారి
యీమె పుట్టిన వంశాన - నెసక మెసఁగఁ
బుట్టు వేఁటరుల కులమ్మె - పొలుపు గాంచె. ౪

దేవి యాభరణమ్ము లొం-దిన కుమారి
ఎట్టి తపమాచరించెనో- యెఱుఁగరాదు
ఈమె పుట్టిన వంశాన - నెసక మెసఁగఁ
గలిగినట్టి వేఁటరుల యీ - కులమె కులము. ౫

పవన జవనముగల జింక - వాహనముగఁ
గొనిన దుర్గ సౌందర్య మం-దిన కుమారి
సలుపు తపమెట్టిదియొ యీమె - జననమంది
వెలసి నట్టి వేఁటగిరుల - కులమె కులము. ౬

ఏన్గు తోల్గప్పి పులితోలు - నెసఁగఁ జుట్టి
కారు దున్నపై నిల్చితి - కడఁకఁ జూడ
వేదశీర్షార్థమై సురల్-వినుతి సేయ
జ్ఞానసారమై నిత్యమై - చనెద వేల ? ౭

కత్తిఁ దాల్చి హరిణి నెక్కి - కడఁక మహిషుఁ
దెరలఁ జంపి నిల్తు విట మూ-ర్తిత్రయమ్ము
హృదయ కమల సదన వయి - యెసఁగుచుందు
జ్యోతి రూపమ్ముతో గుణా-తీత వగుచు. ౮

తే॥ శంఖ చక్రముల్ కర పంక-జముల వెలుఁగ
సింగమెక్కి- నిల్చితి విట - గంగఁ దాల్చు
శంభు నర్ధ దేహమ్మున - శ్యామలాంగి
వగుచు వేపవిసితి గొంధు - పమ్మ ! దుర్గ ! ౯

జేల పూవులు తులసి గూ-రిచిన పూల
మాల భుజములఁ దాల్చి కు-మారి వచిచు
వేల్పులకు గెల్పు గూర్చఁ దొ-ల్వేల్పు లోడ
నాడు మరగాలి యాట యుం-డాతఁ దగను. ౧౦

పసిఁడి యుండెలు వలయముల్ - రశన మెరయఁ
గలకు టసురలు నశియింపఁ - గత్తిఁ బూని
యేచి మరగాళ్ళతో నటి-యింప సురలు
పొగడి చల్లు పూవులు వాన-వోలెఁ గురియు. ౧౧

బెట్టిదుండగు సీహరి - వీరుఁ డరుల
పసుల మందఁ గైకొనఁ బోవు - పట్టునందు
భార్గవియుఁ బోవ నిచ్చింపఁ - బగలుయూర
నడవి నల్లంచి వారికిఁ - జెమగఁ దెలుపు. ౧౨

ముసుపు టప్పు నీయక కల్లు - పోయ ననుచు
గొండ్ల దనఁ దన వెంబడి - గ్రద్ద లరుగఁ
బగలు యూల మందలఁ బట్టి - బయలుదేలు
వీరు వెంబడి దేవియు - వింట నడుగు. ౧౩

ఆ.వె॥ మావి చాయదాన ! - యీవానిఁ జూడుమా
వారి వేఁట ఫలము - పసులమంద
కొలుచునట్టి వైణి-కుఁడు తమ్మటీఁడు ము
న్నైన వారి యింట - నార నొప్పె. ౧౪

ఆ.వె॥ మందహాసవదన ! - మంద వారేద్వంగ
నాక్రమించుకొనిన - యాలమంద
లివ్వి కల్లు నమ్మ - నింతి నిమిత్తకు
నింట నిండి యుండె - నిచ్చఁ గనుము. ౧౫

పగఱ యూరె యేద్వ - వారి జయించి తె
చ్చినవి యివ్వి వికచ - వనజనేత్ర !
ప్రల్లదులును మునలి-వారలు నగు వీరి
యెదుట నిండి యుండె - నిచ్చఁ గనుము. ౧౬

వాలఖిల్య మునుల - వేలుపుల యిడుమ
లడఁచు పదములకు జో - హారు లమ్మ !
వేఁటరులకు గెలుపు - వేడ్క నొసంగితి
ప్రతి ఫలమ్ము గొమ్ము - రక్తఘటము. ౧౭

అమర పూజ్యమైన - యడుగుఁదమ్ములకు న
మస్కరింతు మమ్మ - మాఱుతురను
గెలిచి కదుపులఁ గొను - బలువేఁటరు లొసంగు
ప్రతి ఫలమ్ము గొమ్ము - రక్తఘటము. ౧౮

తుడుము తమ్మటములు - గుడుసు కొమ్ములు మ్రోఁగఁ
గారుటిరుల వచ్చు - వారు నీదు
భక్తవరులు వేఁట-వాండ్రు నీ యడుగుల
కప్పగించు రుధిర - మలరి కొనుము. ౧౯

దారి నడచు వారు - దండిగ నుండ వి
ల్లమ్ము లూని కొల్ల-లాడు చుండు
వేఁటకాండ్రు బత్తి - దోఁటు పూజలఁ గొను
మమ్మ ! దేవి ! కాళి ! - యార్య ! దుర్గ ! ౨౦

తే॥ దిగులు గొలుపు ధ్వనులతోడఁ - బగలు నిద్ర
వేళ హింసించు వేఁటరుల్ - వేడ్కఁ నొసఁగు
నర్చ లందుమ సుధ నాని - యపుడు లడల
నంజు కడిగొని నిలిచిన - కంజనేత్ర ! ౨౧

పాంథుల ధనమ్ము చూఱాడి - వారి యెడల
నెనరు చూపని వేఁటరుల్ - నీ కొసంగు
బలులఁ గొనుమ యుష్ణన పాద-పముల నడుమఁ
దూటి పడఁద్రోచి శకటమ్ముఁ - దూలఁ దన్ని
మామ కంసుఁ జంపితి కద - మనుజ లీల. ౨౨

నలువ సముఁ డగస్త్యుండున్న - మలయ మేలు
పాండ్యభూపతి పగవారి - బవరమందు
గెలిచి కదుపులఁ గొనువారి - ఖేటవృత్తి
డిందువాఱంగ జయము గ-డించుఁగాక. ౨౩

## ౧౩. కోటపల్లె చేరుట

మంజ॥ వేఁటరుల కుమారి - వేసిన దైవ
వేసమ్ము వీడిన - పిదపఁ గోవలుఁడు
కడుఁ బుణ్యవతి యగు - కౌంతి పాపముల
కెరఁగి యీ కన్నగి - యెండ వేఁడిమిని
భరియింపఁ జాలదు - పలుకుడాల్గలుగు
నడవిత్రోవల నీమె - నడపంగ చేదు
త్రవ్వవు పల్మీక తతి - భల్లుకములు

తఱుమవు బెబ్బులుల్ - తెఱుఁ జింకలను
కఱవవు పాములు - కాలఁ ద్రొక్కినను
పట్టవు మొసళులు - వారిఁ జొచ్చినను ౧౦
పిడుగులు చల్లనై - పడుచుండు ధరణి
పాండ్య భూపతి పరి-పాలన మహిమ
బీఱెండఁ జనుకంటె - వెన్నెలరేయి
నడవ నాయాసంబు - పొడమ దనంగ
గొంతియు నందుల - కెంతయు నొప్పి ౧౫
దుష్పాలనమ్మునం-దున ప్రజ తేని
చావుఁ బ్రతీక్షించు - చందాన భాను
నస్తమయము చూచు - నట్టి వారలకు
పలు రిక్కలను సైన్య-ములఁ గూడి వెల్ల
కాంతులు విరియించి - కలువల ఱేఁడు ౨౦
పాండ్యకులము నందు - ప్రప్రథముండు
తూరుపు దిక్కునఁ - దోఁచిన యంత
తారలఁ బోలిన - తార హారములు
కలపమ్ము చనులపైఁ - దొలఁగి మల్లాడఁ
దొగలు మొల్లలు జడఁ - దొఱఁగి యల్లాడ ౨౫
చెందలిరులు మేనఁ - జేరక తొలఁగ
మలయంబునం బుట్టి - మధురలోఁ బెరిఁగి
విద్వద్వరేణ్య జి-హ్వాకల నటించు

తెమ్మెర చంద్రు దీ-ధితులంతోఁ బరప
మాధవ చంద్రుని - మఱి వేఁడు చుంటి ౩౦

వాకా యని భూమి ని-ట్టూర్చిన పిదప
నధిక మార్గాయాస - మందిన సతిని
కాంచి కోపలుఁడు శు-భాంచితగాత్రి !
నడయాడు నీత్రోవ - నడరి బెబ్బులులు
గూబయు గూయు నె-గ్గులు బొబ్బవెట్టు ౩౫
నంజక నడువుమ - యంచు న త్తరుణి
కరములు తన భుజ - గిరులపై వైచి
కొనుచుఁ బవిత్ర వా-క్కులు గల కొంతి
యుపదేశ వాక్కుల -నొప్పుగ వినుచు
వెడునలఁ బుట్టి వ-ర్ధిన యగ్గివలనఁ ౪౦
గాలి సల్లనయైన - కాననమందు
కోశ్య సూర్యునిరాక - కొమరుగఁ దెలుప
నాటల పాటల - నభ్యసించుచును
వైదికాచారముల్ - వదలిన విప్రు
లుండు పల్లియఁ జేరి - యొకచోట వారి ౪౫
నుంచి యతఁడు కొలం-కున్నెడ కేగెఁ
బడతితో నదవుల - నిడుమలు కుడుచు
కతన గొలిమి తి త్తి-కరణి నిట్టూర్చి
కలఁగి వాడుటచేతఁ - గసుమబ్బుచేత
నాతనిఁ దెలియలేఁ-డయ్యె గొశికుఁడు ౫౦

ప్రియుఁడు వీడుటఁ జేసి - పెనువంత నొందు
మాధవివలెనె యీ - మాధవ తాప
మున మాధవీ ! నీవు - ముప్పు లొందితివె ?
యను చొక్కు పొదనీడ - కరిగి కూర్చున్న
కౌశికుండను వడు - గని పల్కు విన్న ౫౫
కోవలుఁ డటకేఁగి - కోరిక నీవు
పలికిన పలుకుల - భావంబు వినఁగ
పలతు ననఁగ శంక - వదలి వటుండు
దాసి తనదు రాక - తగ నిట్లు తెలిపెఁ
దన తలి దండ్రులు - తలచుచు మణిని ౬౦
నీఁగు సర్పము వలె - నెఱ తపించుటయుఁ
బ్రాణముల్ తొలఁగిన - మేనులఁ బోలెఁ
బడి చుట్టములు దుఃఖ-వనరాశి మునిఁగి
పరితపించుటయు సే-వకులను పనిచి
కోవలు రోసి తో-డ్కొని రండి యనుచుఁ ౬౫
దండ్రి పంపుటయును - తన తండ్రి యాజ్ఞ
నెఱవేర్చుటయె గొప్ప - నియత ధర్మమని
యడవుల కేఁగిన - యాజిపుత్రకు వి
యోగంబు వలన న-యోధ్యయుం బోలె
సంగమ పురజనుల్ - సంతపించుటయు ౭౦
తన శ్రీముఖ మ్మనా-దరము సేయుటలు
చేటి వలన విని - చింతతో నలఁగి

పెను మేడ నడిమి ని-వాస గది యందు
వసవుచు మాధవి - పడి యుండుటయును
ఆమె రహంగము విని - యచటికిఁ దాను ౭౫
చని యుండుటయుఁ దన్ను - గని యప్పుడంతి
వందనం బొనరించి - వగఁ దీర్చ మనుచుఁ
బ్రార్థించి యొక కమ్మ - వ్రాసి పత్రికను
ముద్రవైచి యొసంగి - మొగిని నీ వేగి
హృదయేశ్వరు వెదకి - యిమ్మని తన్ను ౮౦
పంపుటయును తాను - బహుదేశములను
తిరిగి యలయుటయుఁ - చేటగాఁ దెలిపి
మఱిఁగి కృశించిన - మాధవి యొసఁగు
కమ్మ కోవలుని క-రమ్ముల నునుపఁ
దానా చెలువఁ గూడి - తనివొందు తఱిని ౮౫
పూసిన జవ్వాది - వాసన లేని
కురుల నొత్తిన మట్టి-గుర్తు చూపినది
కావున నమ్ముద్రఁ - గదలింప కవలి
ప్రక్క లేఖను విచ్చి - శ్రద్ధమైఁ జదివి

తే॥ పెద్దల పద పద్మములకు - వినతి చేసి
ప్రశ్నిచాలని నా యల్ప - వాక్కు వినఁగ
వేఁడుచుంటిఁ బెద్దలసేవ - విడుటగాక
యాభిజాత్య కన్నగితోడ - నద్దరేయి. ౧

తే॥ నేరికెం జెప్ప కేగ నే - నేమి పాప
మొనరిచితినొ యెఱుంగ నా - యుల్ల మధిక
తాపమునఁ దత్తఱించెడిఁ - దలఁగఁజేసి
విజ్ఞుఁడా! కావుమని వ్రాయు - విషయ మరసి ౨

చామ దోసంబు లేదని - శంక వీడి
తన దొసఁగె యంచు మదిని చిం-తనము చేసి
కమ్మయందలి యర్థమ్ము - కన్నతండ్రి
కొప్పిదముగ లక్షణచేత - నున్నదనుచు. ౩

కౌశికా! తల్లిదండ్రుల - కడకు నేగి
వారి చరణపద్మములకు - వందనములు
చేసె ననిపల్కి యీ కమ్మ - చేతికిమ్ము
మద్వియోగదుఃఖము వాప - మరలి వడిగ. ౪

జనుమ యనిపల్కి - యాతని సాగనంపి
కన్నగియుఁ బవిత్ర చరిత్ర - కౌంతియున్న
కడకు నేగి దుర్గాదేవి - కలని వేస
మలరి పాడు గాయకులతోఁ - గలిసి మంచి ౫

యేడుతంత్రులు గల వీణ - నెత్తికొనుచు
మెట్లు చూచి శ్రుతి స్వర - మేళనమున
మూటి నాలుగింటిని గాంచి - పొందుపఱచి
మధ్యమము శ్రుతిగా నుంచి - మంద్ర మధ్య ౬

తారములయందు సంపూర్ణ - తరగతులను
మఱి యసంపూర్ణరాగ సం-బంధులరసి
కొంతసేపు వారలతోడఁ - గూడి పాడి
వీణ వాయిఁచి సంతోష-పెట్టి పిదప

తే॥ మధుర యిక్కడకెన్ని యా-మడలొ యనుచు
వారిజముగ నిట్లనె యో - ధర్మచరిత !
కాంచుమదె చేప యనునువు - గంధమంచు
సారముగు కుంకుమంబు క-స్తూరి కలప ౮

మలఁది, కలువలు సంపంగి - కలయఁ జల్లి
మల్లె మొల్ల మాలతి యల్ల-సిల్లు పడక
లందుగల వాసనయుఁ, బ్రొవ్వ-లందునుండి
వెడలు తాళింపుపొగయు, నం-గడుల నప్పు ౯

మమ్ము వారు కాలుచు పొగ, - హార్మ్యములను
వైచు నగరుపొగయు, మఖ-వహ్ని పొగయుఁ,
దక్కి పెక్కువగల పొగల్-నిక్కి క్రమ్మి
పాండ్యునాలయమందును - పరిఢవిల్లి ౧౦

విజ్ఞులకు పేరయిడరాక - వెలసి హృదయ
హారియగు కలపమ్ము నిం-డార విరియ
ధీర వాక్కులచే విను-తింపఁబడెడి
మలయమారుతమును శ్రేణి - నలువుపగిది ౧౧

మధురగాలి వీతెంచెడి - మలయఁగంటె
పాండ్య నతిశయ సంపద్వి-భాసమాన
మధుర దూరమ్ము నక్షాలేదు - మగువ లాంటిఁ
జన్న నాపద దరియదు - చనఁడు నాఁగ ౧౨

వారు కౌంతితో మునుపటి-వలెనె రేయి
నడచి సర్వలోకేశ్వరు - సడిని రాచ
నగర వెవ్వేఱ మ్రోఁగు ప్ర-సన్నని రవముల
మేలుకొలుపులు చెవులకు - మేలుకొలుప ౧౩

తే॥ ద్విజులు బ్రాఁజదువుల వల్లె-వేయు ధ్వనులు
మునిజనోదయ ధ్యాన సం-జనితరవము
నిత్యవిజయియౌ పాండ్యుని - భృత్యవరులు
వీరభటులొనర్చెడి బహు-విధ రవములు ౧౪

విజయచిహ్నంబులై యొప్పు - ద్విరదరవము
గిరులఁబట్టి తెచ్చిన గజ-ఘీంకృతులును
నవరసగ నున్న యశ్వహే-షా రవంబు
బొలముకాఁపుల పాటల - కలకలంబు ౧౫

సంగమస్థల మందలి - జలధి యులివు
పగిదిఁ గోలాహల ధ్వని - పరవ వినుచు
వంతలెల్లఁ దొలఁగఁ గుర-వకము గోఁగు
వేఁగి వకుళ చంపక కురు-వింద తిలక ౧౬

పాటలీ సురపున్నాగ - పారిజాత
వృక్షసంతతి పూవులు - విరిసి యడరఁ
గుటజ మాలతీ మాధవీ - కుంజ పుష్ప
రశన యొప్పారు దరులనఁ - గ్రాలు శ్రోణి ౧౭

తలముతో సైకతములను - స్తనములొప్పఁ
దరుల రాలిన మోదుగు - విరుల నోరు
వెల్లువంబడి కనవచ్చు - మొల్ల పండ్లు
నల్ల యిసుక కురులు మత్స్య - నయనములును ౧౮

పరఁగ [illegible] సంపత్ప్రది-వ ర్తనమున
సత్కవీంద్ర వాగ్వినుత ప్ర-శ స్త సకల
గుణగణౌఘ వైఘ నృపాల-కుల పతాక
తెలవ కయ్యేడి కష్టంబు - నెటిఁగినయది ౧౯

పోరెఁ బావిపూవులనెడి - పోర్వఁ గప్పి
కొనుచు నశ్రువుల నవంచు - గొనఁగ నీటి
వెల్లి యుదిగాఁడు పూవుల - వెల్లి యనుచుఁ
గన్నగియుఁ గోపముఁడు భక్తిఁ - గరము నెత్తి ౨౦

మ్రొక్కి రేవున శార్దూల - ముఖ గజముఖ
సింహముఖ హయముఖములఁ - జెలఁగు నౌక
లందు పయనంబు చనురేవు - లందు పసికి
కుఱఁగలిం జిన్నరేవునఁ - దెలుపు తోడఁ ౨౧

గొంతితోఁ జిన్న పడవను - గాంక్ష నెక్కి
వనులతోఁ జెలువారు డ - క్కినవు దరిని
చేరి యీ దివ్యపురిఁ బ్రద - క్షిణము సేఁత
పాడి యనియెంచి కావలి - వనము చుట్టి ౨౨

యుండు నగడిత వలగొని - యొక్కయెడను
వీర తెడఁబాసి పొందెడి - గోరములను
తెలిసినట్టులు కలువలు - జలజములును
బాష్పములు నించి తేఁటుల - పాటతోడ ౨౩

వెక్కియేడ్చు యటమటించు - విభముదోఁప
శత్రుభయదంబుగాఁ బోరు - సలుపఁగోరు
వారిఁగని కోటబురుజుల - పైని పొడవు
సిడము లిటకు రాకుండని - చేతు లార్చు ౨౪

తెలుఁగునఁ జలింపఁ బక్షులు - తీరుగ నడ
యాడుచుండఁ గనుల పండు - వగు పొలములు
పూలునిండిన కొలఁకులు - పొలుపు దెలుపఁ
బండ్లతోఁటలు గెలలతోఁ - బండి వ్రేలు ౨౫

పో(క యర(టి టెంకాయల - (మా(కులొప్ప
వెదురుపందిప లుటజముల్ - వెలయు నెలవు
లెంచగా( దగి ధర్మ మా-ర్గించు మునులు
తక్క నెవరు చేరని పురి - ప్రక్క పల్లె ౨౬
యందు చొచ్చిరి ముప్వు రా - నంద మంది.

## ౧౪ పుర సందర్శనము.

మంజ॥ కోటపల్లియ చుట్టు - తో(టలయందు
సరసుల యందును - తరువుల యందు
వంగిన వెన్నుల - వరిమళ్ళయందు
పక్షి యుచ్చావచ - ధ్వనితోడ లేవ
కొల(కుల( దామర - యలరుల బందు ౫
తొల(గించు లోకబం-ధు(డు పగతేంద్ర
శిరములదర( గ త్తి - చే( దాల్చు పాండ్య
పురము( గూరుకు నుండి - తొల(గించి లేవ
విశ్వేశు కోవెల - విష్ణునాలయము
హలధరు గుడియు ష-డాననుఁ గుడియు ౧౦
[1] ధర్మమార్గము వొల్చు - తపసుల యూళ్ళ

1. మూ(డాశ్రమముల వారికిని సన్న్యాసులకును దరిద్రులకు చచ్చిన వారికిని దేవతలకును మునులకును విందులకు బందుగులకు తక్కినవారికి( దోడు పడుట అగ్నిహోత్రము శీల సంరక్షణము ప్రేమ, కరుణ మొదలగు గుణములు కలిగియుండు గార్హస్థ్యము ధర్మమన(బడును. చర్యక్రియ యోగము జ్ఞానము గల సన్న్యాసమును ధర్మమన(బడును.

రణభయంకరుడగు - ప్రభుని మందిరము
ప్రాంత పవిత్ర వాస్తు - రమునం దుండె
ధ్యాన సమగ్నుడై - తనదు స్వామినిఁ దేఁ
పతి గణుతించి వం-దన మొనరించి ౧౫

నెటిఁ దప్పినాఁడనై - తెలివ కక్షింపఁ
గ్రొత్తనాటను దరి-ద్రుడ నయి దైన్య
మొందంగ పలసె నా - యున్నట్టి స్థితికి
నీ పురంబున నున్న - వేపాటంకు ప
దీయ దుస్థితిఁ జెప్పి - తిరిగి నే వచ్చు ౨౦

దనుక నీ సతి సుప-దంబులఁ గోట
యందుండుఁ గాన భ-యమ్ము లే దనఁగఁ
గొంతి యిట్లనుఁ బ్రేమ-గల భార్యతోడ
ధర్మంబు తప్పి వ-దలి దుఃఖములను
కుడిచితి కాన నా - చెడుత్రోవనుండి ౨౫

తలఁగుఁడు తలచేసి - తత్పాపచయము
తలఁగక యగచాట్లఁ - గలిగించు ననుచు
ధర్మజ్ఞులను వాట - తగిన పద్ధతుల
నోరను తప్పెట - నారంగ నాల్క
యను కత్తితోఁ గొట్టి - యదలించి చెప్ప ౩౦

మతిహీను లందలి - మంచి గైకొనక
పదపడి తత్కర్మ - ఫలమును కుడుచు
నెడ భ్రాంతు లగుదురు - వెడఁగుఁదనమున

క్రూర కర్మఫలమ్ము - గుడువ నౌ నెడల
ఫీటులు కుందక - తెగ్గవ నుండుదురు ౩౫

యోగ వియోగ స-ముదిత దుఃఖములు
మడని దుఃఖము చెలి - మరులు గొన్నట్టి
వారికిఁ గాక సం-ప్రాజ్ఞుల కున్నె ?
సుదతులు తిండియే - సుఖదంబు లనుచుఁ
దలఁచు మూఢులు పొందు - నలజడిఁ గాంచి ౪౦

మునివరుల్ వీడిన - మోహ లతికను
పట్టుఁగొమ్మగఁ గొని - పడరాని పాట్లు
పడి దరి గనరేక - యడలిన వారు
పూర్వులం గలరు ప-ల్వురు నిక్క మిట్టి
దుర్దశ వే రూని - తొడరిక వచ్చు ౪౫

నట్టి సనాతన - మైనదే చుమ్ము
జనకునాజ్ఞ వసుల - సతితోడ మనుజు
దద్వియోగమున సం-తాపమ్ము
కుందు వాఁడు చతుర్ము-ఖుని గన్న తండ్రి
యగు వెన్నుఁడే యని - యరయవే నీవు ? ౫౦

పుష్కరుచే జూద-మున రాజ్యమెల్ల
గోల్పోయి సతితోడ - ఘోరాటవులకుఁ
జని పతివ్రతను ని-ష్కరుణుఁడై నబుఁడు
నట్టడవిని నట్ట - నడురేయి విడిచి
పోవఁడే ? యది వారి - పూర్వదుష్ఫలము ౫౫

కాక భై మియెదలఁ - గలదె దోషమ్ము ?
వారలఁ బోలిన-వాఁడవు గావు
సతి నెదఁబాయని - బ్రతుకు గాంచితివి
ఈ పట్టనమ్మున - కీవు ప్రాఁడింత
మఱచి యరిగి యందు - మర్యాద యెఱిఁగి ౬౦

యతిథుల మన్నించు - మతి గలవార
లున్నచో నారసి - క్రన్న రమ్మన్నఁ
గంచియచే వంపు - గలిగి యగ ర్తఁ
గరులకు రాక పో-కలకు నేర్పఱచు
క్రంత మార్గమ్మునఁ - గడువడి నేగి ౬౫

కోట వాకిలి గాచు - కూటువర్ యవన
వీరుల కొాక శంక - చేరంగ నీక
లోని కేగి సహస్ర-లోచను మేలి
నగలుంచు పేటిక - తగ నోధు తెఱచి
నట్లున్న యాకోట - యందొక్క ప్రక్క ౭౦

గాలికిఁ బడగలు - గదలుచు నున్న
వీధి యందున్నట్టి - వేశ్యలు తమ్మ
వలచి తిరుగు యువ - వ్రాతమ్ముతోడ
నేటి రేవునఁ దెల్ల - యిసుక తిన్నియలఁ
దెప్పల నెక్కుచుఁ - దెడ్లతో నడపి ౭౫

తెప్పఁ బట్టికొని యీఁ -దెడి కాంక్షతోడ
చల్లని కమ్మని - మొల్లలు మెట్టి

తామరల్ కలువలు - దామముల్ గూర్చి
కొప్పులఁ జెరివి బా - గొప్పఁ జందనము
నలఁది పురప్రాంత - లలిత వనముల ౨౦
విచ్చలవిడిప్రేమ - విహరించు కాంక్ష
సంకేత వేళలఁ - జంద్రశాలలను
ఇచ్చ వచ్చిన వేస - మింపార వేసి
చెలువుండ్రు పొగడ బూ - నెజ్జలనుండి
పూసనిగల పట్టు - పుట్టంబు గట్టి ౨౫
కొప్పులఁ గుటజముల్ - మెప్పుగ ముడిచి
పర్వతాధిత్యకో - పత్యక ప్రసవ
ములఁ జుట్టి వక్షోజ - ముల పయి నెట్టి
గందమ్మున మకరి - కలు వ్రాసి తొమ్మ
నందు పగడసరుల్ - పొందుగ జేర్చి ౩౦
కూడలి పల్లికిఁ - గోరి కై సేఁత
చూపంగ వర్షర్తు - భూపుఁడు వాడ
గాలితోడుత వచ్చు - కాలంబు, మఱియు
మేఘముల్ ముద్దిడు - మేడల నగరు
కట్టి కుంపటి సెగ - గాచుకోఁ గోరి ౩౫
ప్రియులతోఁ జెలువయి - వేడ్కతో సుండ
సన్న కన్నులు గల - జాల దోరములఁ
జల్లఁ దెమ్మెర వీచు - శారద వేళ,

కలయిండ్ల కలుకులు - కాంతులు చంద్ర
శాలల వెన్నెల - చవి చూచువారు ౧౦౦

లేయెండ చవిచూచు - లీల నొప్పారి
యినమండలమ్ము ద - క్షిణమునఁ దోఁపఁ
దెల్ల మొగుళ్లు బా - త్తిగ లేక యుండు
నెడమంచుకారగు - హేమంత ఋతువు,
వనరాశిలోని నా - వలయందు చోళ ౧౦౫

దేశీయు లుంచిన - దిటవగు నగరు
పట్టు గంధము పూల - వాసన కప్పు
రం బను వాని తో - రపుఁ దావి మోచి
వచ్చిన తూరుపు - వాయువు తోడ
మన్నీఁడు కూడలి - మదనోత్సవంబు ౧౧౦

గాంచెడి ముదిమంచు - కారగు శిశిర
ఋతువను రాజన్ని - యెడలఁ గలండు
సరిపూల సురివెంద - చిఱు తీవచెత్త
నందనములు తావి - ననలను పూవఁ
గూన తెమ్మెర తోడఁ - గూడలి చొచ్చి ౧౧౫

వర దంపతులు పర - స్పరము గాటముగ
నలమికొనం జేయు - నవ్వసంతుండు
సర్వదా యచట వా - సము చేయుచుండు
నని పూవుఁబోఁడ్లు ప్రి - యాలితోఁ గూడి
పర్వంబుల గణించు - పరిమోదవేళ ౧౨౦

పిల్లలతో నున్న - పిడులతోఁ గరులు
నడుకు నల్లెండలు - మిడియు నక్కొండ
చెంత నడవియెల్లఁ - జిచ్చు పర్వాడు
కరణిని పడమటి - గాలితో వచ్చి
మరగి కూడలి నేలు - మాధవసేత ౧౨౫

వేఱు ప్రాంతములకు - వే పయనింపఁ
దటిమెడి వేసవి - తరుణంబు నందు
కొల్లారు బండియుఁ - బల్లకి మణుల
కోళ్ళ మంచము తోఁట - మెల్లఁ బచారు
చామరా లడపంబు - శాత ఖడ్గంబు ౧౩౦

ప్రభు నాశ్రయమున పై - భవ జీవితంబు
పడుచుల పెండ్లిండ్లు - పరిఢవిల్లంగ
చేడియల్ దెచ్చిన - పైఁడి గిన్నియలఁ
దేట కల్లాని మ - త్తిలి రొదసేయు
తేఁటుల నవిలేని - చోటుల మాల ౧౩౫

తోడఁ దోలుచు దొండఁ - దులకించు మోవి
ముత్యాలకోవను - పోలు దంతముల
ప్రభలు పర్వంగ చి - ర్నవ్వు నవ్వుచును
ప్రణయ కోపమున నూ - అట గొల్పకున్నఁ
జెలువల పోటు మా - టలు మదిఁ గాఁడ ౧౪౦

నాల్కతోఁ దెలుపక - నవ్వుతోఁ దెలుపు
పలుకులు క్రేగంట - సలిపిన పోరు

కనుబొమల్ ముడివడం-గ నొసటం బొడము
స్వేదకణంబుల - మోదంబుతోడఁ
దిలకించు ప్రియులచేఁ - బేయుచునుండె ౧౪౯

చణుయును హోరంగఁ - బిగ్గ పీడియును
ఇటుకలు నెత్తిపై - నెక్కించగ నిక
గౌరవమున మనం-గోలు ఘాతుకుల
పసియింప నసువైన - వాతలు గఱిగి
శాంతి వినోద దృ - శ్యములు స్వభావ ౧౫౦

మరసి క్రమము చెడ - కాడు నాటయును
పాటయు తాళముల్ - వాని భేదములు
జతఁ బాడ వేణువుల్ - సాదన చేసి
నాల్గువిధము లభి-నయ పద్ధతులను
స్వర పద్ధతులను మా-ర్పులును నేరుపును ౧౫౧

పరఁగంగఁ పలకోలి - బిరుసు గలదియు
పల్లవి మట యుని - పల్లవి చరణ
మావర్తముగఁ దాపు - నాట వెంఁదుచు
నాల్గు మార్గంబుల - నాణెంబు నొంది
ధృతి వేయు నెస్త్రది - దీనారములను ౧౫౨

1. వ్యభిచరించిన వారినెత్తిపై పేడు కాలిన యిటుకరాలుంచి ఊరు దట్టించి వదలుట పూర్వకాలపు దండనము.

2. నిలుచుట (నిట్రల్), కదలిక (ఇయంగల్), హస్తక్రియ (ఇరుత్తల్), ఉనికి (కిడత్తల్). (సాత్త్వికాంగిక వాచికాహార్యకములు కావు).

ఏరికిఁ జేరంగ - నీయని నేర్పు
గలిగి సోకు పిసాసి - కరణిని మెలఁగు
వెల వెలంది కనుల - వలలోనఁ దవిలి
సాధింప నరుదైన - జ్ఞానంబు క్రుంగ
దపసులైనను తమ్మి - తమ్మికిఁ దిరుగు ౧౬౫
భ్రమరంబులం బోలు - కమసులె యైన
కామరుచియె యెఱుం-గని వారలైన
గలయికలో మున్గి - సొలసి నిద్రిల్లఁ
బఱుచు నేర్పున నఱు-వది నాల్గు కళల
నారి తేజిన వెల-యాండ్రున్న వాడ ౧౭౦
కొల్లారు బండ్లును - పల్లకుల్ తేర్లు
వివిధ కవచములు - వింజామరములు
అరపట్టికలు మంచి - యంకుశములును
వంపుకత్తులు తేరు - వడములు త్రాళ్ళు
ములుకేడెములు పంది - మూతి కేడెములు ౧౭౫
అడవికేడెమ్ములు - పొడుచు కోలలును
లోహంపుఁ గోలలు - లోహ పాశములు
సవరముల్ దంతంపు - సౌరు దువ్వెనలు
ధూప పాత్రములు చాఁ-దులు పూలసరులు
మున్నగు రాసుల - మొనరుచుఁ బ్రభులుఁ ౧౮౦
గాంచఁగాఁ గోరు నం-గళ్ళ వీదులును
అయిపులు పంద్రెంట - నగ్గలమ్ములగు

కాకపాదము కలం-కము రేఖ బిందు
వసు న్నాగ్రలేక గు-ణావలిఁ గొఱఁత
వడక సుసుపు రంగు - పక్షముల్ మొనలు ౧౮౫
స్వచ్ఛ కాంతులు గల - వజ్రసంతతులు
అయిపు రెనిమిదింట - సధిక దోషములు
కటి గీఱ మాలయున్ - పొరపులు లేని
పసిమియు చాల వి-ధానసు కాంతి
గలిగి చెన్నరు మర-కత వితతులును ౧౯౦
పొర పొచ్చెములు లేని - కురువిందములును
నీల రత్నములు మా-నికములు మంచి
గోమేధికమ్ములు - కౌమరు పుష్యమ్ము
రిక్కఁబోలిన రూపు - చొక్కంపుఁ బసిఁడి
రంగు రంగగు పుష్య-రాగ రత్నములు ౧౯౫
కలఁక లేని పరిధి - కాంతియుఁ దేనె
వన్నియ నొప్పారు - వైదూర్యమణులు
ఇరులు గల్పించు న-ల్లనఁగు నీలములు
ఇరు వన్నియల పొందు - నెనయు రత్నములు
ఏకసూ జన్మంబు - నేను భేదముల ౨౦౦
కాంతులు గుణములు - గలిగిన మణులు
గాలి నీరము మన్ను - కల్లుచేఁ గలుగు
గరుసు దోసమ్ములు - గలుగక తేట

కాంతి నొప్పారి యం-గారక [1] చంద్ర
సుతులఁ బోలిన వన్నెఁ - గొమరారు నాణి ౨౦౫

ముత్తెమ్ములును బెజ్జ - ములు గల్గి చొట్ట
నొక్కులు పుప్పియు - నెక్కడ లేని
తీఁగ పగడములు - తెగల లక్షణము
లెఱిఁగిన వణిజులు - వరుసగ సుంచి
యరి చోరభయ మిసు - మంత యరయని ౨౧౦

రత్నాల యంగళ్లు - రాజిల్లు వీథి
జాత రూపమ్మును - జాంబూనదమ్ము
శుక పక్షము మఱి హా - టక మను నాల్గు
తెఱఁగుల బంగారు - గుఱుతు లెఱుంగు
వర్తకుల్ సంశయం - పడఁ బని లేని ౨౧౫

పగిది శీర్షికలను - వ్రాసి యందందు
కట్టిన పైఁడి యం - గళ్ల వీదియును
పట్టున సన్నని - ప్రత్తి దారమున
నెలుక యున్నిని పలు - పలు పగుదులుగ
పడికించి నేయించి - వందవందలుగఁ ౨౨౦

బేర్చిన పేర్పులు - వేల కొలంది
గలుగు వస్త్రాల యం - గళ్ల వీథియును
త్రాసులు గుంప్లు బ్ర - ద్దలు గలవారు

1. చంద్రుఁ గురువు శుక్రుఁడని వ్యాఖ్య.

తూముల గలవారు - దొంబడి గాఁగఁ
దఱుఁగు కొంగ్రొడు బియవఁ - దిరిగెడివారు ౨౨౫
మిరియాలతో నన్ను - తెఱఁగుల ధాన్య
శాలల నొప్పు మం - డీల వీధియును
బ్రాహ్మణ క్షత్రియ - వైశ్య శూద్రులను
జాతి వాడయును త్రి - సంధి చతుష్క
ముసు గుడు లంగళ్ల - యొనయు వీదులును ౨౩౦
మండపమ్ములు పలు - మార్గముల్ కలియు
కూడయును సందు - గొందులు తిరిగి
నడుమింటి ప్రొద్దు నెం - డయుఁ జొరకుండు
పచ్చని తీఁగల - పందిళ్ల నీడఁ
తిరిగి పాండ్యేశ్వరు - పురమును గాంచి ౨౩౫
డెందాన నానంద - మంది కోవయుఁడు
నతతెంచె గ్రమ్మటి - విడిసిన యెడకు.

## ౧౫ ఇల్లడ

మంజరి॥అవనికి బహుళ భా - గ్యమ్ము లొసంగు
కరుణామయాజ్ఞ స - క్రమముగాఁ బూని
నెరపు పాండ్యుల గొప్ప - పరువు నిల్కడయు
గొడుగుచలువ యేలు - బడి మేల్మి ఖడ్గ
విజయమ్ము విలసిల్లు - వినయ శీలములు

ప్రజల నెమ్మదియును - పరికించి కాంచి
కోట వెల్పల ముని - కోటి వసించు
పల్లియ తోఁటకు - మెల్ల నేతెంచి
మధుర సౌందర్యమ్ము - మధురాధి నాథు
విభవమ్ముఁ గౌంతికి - వినిపించుచుండ ౧౦
కడలి నీరె యగడ్త - గాఁగ నొప్పారు
[1] చెంగా డనెడి యూరఁ - జెలువార నుండు
వేద పారఁగుడు వి - వేకి సచ్చీలి
లలిత వాక్యుండు మా - డలుఁడను వాఁడు
మలయ పర్వతమును - వలగొని కుమరి ౧౫
తీర్థాన నీరాడి - తిరిగి స్వస్థలము
చేరఁ జనుచుఁ గౌంతి - చేరిన తోఁట
కేగ నతనిఁ గాంచి - యెదురేగి మ్రొక్క
కోవలునకు వాక్య - కోవిదుఁ డైన
మాడలుఁ డిట్లను - మానిత సుగుణ! ౨౦
ప్రభునిచేఁ దలకోల - పడసి పేరొందు
మావిచిగురుఁబోఁడి - మాధవి యొక్క
పాల బ్రదుకు నాఁడు - పడుచును గాంచి
పురుడు దీఱిన యాల - ముదుసలి గణిక
లరుదెంచి బిడ్డకు - నరుదైన పేరు ౨౫

1. చెంగాడు = శోణవనము

పెట్టుడ మని పల్కి - విని నీవు తొల్లి
నడురేయి కడలిలోఁ - బడవ వొందవడి
మునుఁగ మా పూర్వుండు - పూర్వదినములఁ
బుణ్య దానమ్ములు - బొసరుచు కతనఁ
జాల దినము లీఁది - చని యొక్క దీవి ౩౦
చేరంగ నొక వేల్పు - చేరంగ వచ్చి
యీదీవిఁ జేప వా - రెవ్వారలైన
దైత్యుల హింసకుఁ - దలఁగి కావుమని
వాసవుఁ డంపంగ - వచ్చిన దాన
నను మణి మేఖల - యనువారు జనులు ౩౫
తలరకు నీదాన - ఫలము నివ్వేడి
చన దీకడలి నీఁడు - నరణిని దుఃఖ
వనధి దరిం జేరు - మని తెచ్చి యివల
విడిచిన మా యిలు - వేలుపు పేరె
పెట్టుఁడి యని కత - వినిపించు నంత ౪౦
మణిమేఖలలు నితం-బములఁ జలింప
వెలసిన గణికలు - వేవుర కూడి
మణిమేఖలాదేవి - మహిత నామమ్ము
నుంచి దీవించఁగా - నువిదతో నీవు
కరముల నుండి బం-గరు వాన కురియ ౪౫
దానము గొనువేడ్కఁ - దడఁబడు నడక
నూఁతకోలను గొని - యేతెంచు గూని

విప్రుని ముదుసలి - విజ్ఞాన నిధిని
మావటి యంకెకు - మరలక మీఱి
చని చుట్టుకొను మద - సామజాతమ్ముఁ ౫౦
ద్రుటిలోనఁ దఱిమి వి-ప్రుని విడిపించి
తొండమ్ము క్రిందుగాఁ - దూఱి దంతమ్ము
వట్టికొని యడంగి - వడి గుంటి క్రింద
డాఁగిన యొక్క వి-ద్యాధరు మాడ్కి
నుండి మెడకు నెక్కి - యుక్కఱఁ ద్రొక్కు ౫౫
యురు దయావీర ! మ-హోదార ! నినుఁగుఁ
గాచిన ముంగిని - కాంత చంపంగ
నా పాప మాఱ గం-గాపగా స్నాన
మొనరింపఁ బయనమై - చను భర్త తెగడ
నంగలార్చుచు భార్య - యట వెంబడింప ౬౦
నీచేతి యోరెంబు - నేఁ దినఁదగదు
దీని యర్థము తేట - తెల్లగఁ దెలియు
వారి కిమ్మని [1] యొక్క - పద్దెంబు వ్రాసి
యిచ్చి పోవఁగ నామె - యిల్లిల్లు దిరిగి
పాపము పాపి ప-త్పలము గొనుండి ౬౫
యనుచుండు దాని ర-మ్మని పిల్చి నీవు
చెందు పాపం బేది ? - చేతి యాకేమి ?

---

1. అపరీక్ష్య న కర్తవ్యం కర్తవ్యం సుపరీక్షితమ్,
పశ్చాద్భవతి సంతాపః బ్రాహ్మణీ నకులం యథా॥

యన నామె తానొందు - నధిక దుఃఖమ్ము
వాకొని పద్దెంపు - టాకు నొసంగి
ఛన మిచ్చి నా పాప - మును తొలఁగింపు ౭౦
మని కోర నంజకు - మని దుఃఖ మేను
తీర్చెద నంగద - నోర్పుమ యనుచు
నప్పుడ యార్యులు - చెప్పిన విధులఁ
బాలుత చేసిన - పాపమ్ము దీఱ
దానముల్ చేసి సం-తాపమ్ము మాన్పి ౭౫
యడవి త్రోవంబట్టి - యరిగిన యామె
విభుని జనులఁ బంపి - వెదకి తెప్పించి
యధిక సంపద నిచ్చి - యాతని గృహము
నిలువఁబెట్టిన దయా - నిధివి నీవయ్య!
ఒక పతివ్రతపయి - నూరక వట్టి ౮౦
యగడు మోపఁగ నామె - మగనిని కల్ల
సాక్షితోఁ గొండెముల్ - చాటిన వానిఁ
దపసివేసము నూని - దాఁగి చరించు
వానినయినఁ బట్టి - వాత పైచికొను
ఘాతమ్ము తన పాశ-మునఁ గట్టివైవ ౮౫
నల వాని తల్లి నెం-జలిఁ గాంచలేక
వీనిని చంపక - వీడుము మాఱు
గాఁగ నా ప్రాణముల్ - కైకొను మిత్తు

విప్రుని ముదుసలి – విజ్ఞాన నిధిని
మావటి యంకెకు – మరలక మీఱి
చని చుట్టుకొను మద – సామజాతమ్ముఁ ౨౦
ద్రుటిలోనఁ దఱిమి వి–ప్రుని విడిపించి
తొండమ్ము క్రిందుగాఁ – దూఱి దంతమ్ము
వట్టికొని యడంగి – వడి గుంటి క్రింద
దాఁగిన యొక్క వి–ద్యాధరు మాడ్కి
నుండి మెడకు నెక్కి – యుక్కఱఁ ద్రొక్కి ౨౫
యురు దయావీర ! మ–హోదార ! నినుఁగుఁ
గాచిన ముంగిని – కొంత చంపంగ
నా పాప మాఱ గం–గాపగా స్నాన
మొనరింపఁ బయనమై – చను భర్త తెగడ
నంగలార్చుచు భార్య – యట వెంబడింప ౩౦
నీచేతి యోరెంబు – నేఁ దినఁదగదు
దీని యర్థము తేట – తెల్లగఁ దెలియు
వారి కిమ్మని [1] యొక్క – పద్దెంబు వ్రాసి
యిచ్చి పోవఁగ నామె – యిల్లిల్లు దిరిగి
పాపము పాపి సత్–ఫలము గొనుండి ౩౫
యనుచుండు దాని ర–మ్మని పిల్చి నీవు
చెందు పాపం బేది ? – చేతి యాకేమి ?

---

1. అపరీక్ష్య న కర్తవ్యం కర్తవ్యం సుపరీక్షితమ్,
పశ్చాద్భవతి సంతాపః బ్రాహ్మణీ నకులం యథా॥

యన నామె తానొందు - నధిక దుఃఖమ్ము
వాకొని పద్దెంపు - టాకు నొసంగి
ధన మిచ్చి నా పావ - మును తొలఁగింపు ౭౦
మని కోర నంజకు - మని దుఃఖ మేసు
తీర్చెద నంగద - నోర్చుమ యనుచు
నప్పుడ యార్యుఁడు - చెప్పిన విధులఁ
బాఱుత చేసిన - పాపమ్ము దీఱ
దానముల్ చేసి సం-తాపమ్ము మాన్చి ౭౫
యడవి త్రోవంబట్టి - యరిగిన యామె
విభుని జనులఁ బంపి - వెదకి తెప్పించి
యధిక సంపద నిచ్చి - యాతని గృహము
నిలువఁబెట్టిన దయా - నిధివి నీవయ్య!
ఒక పతివ్రతపయి - నూరక వట్టి ౮౦
యగడు మోపఁగ నామె - మగనిని కల్ల
సాక్షితోఁ గొందెముల్- చాటిన వానిఁ
దపసివేసము నూని - దాఁగి చరించు
వానినయినఁ బట్టి - వాత పై చికొసు
భూతమ్ము తన పాశ-మునఁ గట్టివైవ ౮౫
నల వాని తల్లి నెం-జలిఁ గాంచలేక
వీనిని చంపక - వీడుము మాఱు
గాఁగ నా ప్రాణముల్ - కైకొను మిత్తు

నని నీవు పల్కఁగా - నాభూత మపుడు
పాపి ప్రాణములకుఁ - బ్రతిగఁ బుణ్యాత్ము ౯౦
ప్రాణమ్ములం గొని - పరలోక గతుల
హతము చేసికొను ప-ద్ధతి యిట లేదు
పదమని యెదుటనే - పాపాల ముద్దఁ
జేర్చి భక్షింపఁగాఁ - జింతించు నామె
తోఁ జని యాతని - తోయంబు వారి ౯౫
కాఁకలి నొవ్వి పో-కార్చి పెక్కేండ్లు
తేఁకువఁ గాచిన - దీన మందార !
వృద్ధగోపాల ! నే - నెఱిఁగిన వఱకు
నీవు కావించిన - వీ జన్మమందు
సత్కర్మములె కాఁగ - సాగర కన్య ౧౦౦
మాణిక్య పల్లవ - మగు కల్కితోడ
నిట్లు వచ్చుట పూర్వ-కృత కర్మఫలమొ ?
యని మాడలుం డన - ననియెఁ గోవలుఁడు
ఒక యల్పువలనఁ బాం-డ్యుని పురమందు
ఐదు వగల జడ - లల్లుకొనియెడి ౧౦౫
కన్నగి, కనువారు - కన్నీరు కార్పఁ
దగు దుఃఖమంద నే - ధరియించు వలువ
పరులు కైకొన నేను - పందిపై నెక్కి
జరిగిన ట్రీమెతో - సంసార బంధ
మీఁగిన వారొందు - హెచ్చైన పదవి ౧౧౦

నే నొందినట్లును - సూన బాణముల
పసుభూమి డిగవిడి - పదునందు చేష్ట
యుడిగి యేగగ బోధి - యుర్వీజము కడ
మణి మేఖలను గౌని - మాధవి యేగి
బుద్ధున కర్పించి - పోయిన యట్లు ౧౧౫
కడ జాము రేయొక - పలగంటిఁ గానఁ
జెలి నేదో శీఘ్రము - చెనయు నన్నుడు
నన్ను బంధమ్ముల - నదుగంటఁ ద్రుంచు
సన్యాసులకుఁ గాక - చనునె మిబోఁటి
వారిటనుండఁగా - వల దీ పురమునఁ ౧౨౦
గల వణిజులు నీ య - గణ్య యశంబు
వినిన వారలు గాన - వేడ్కతో నీకు
నెదురేగి కొంచుఁ బో - వుదు రట్లు చేయు
చాలింపు మిట నున్కి - సప్తాశ్వుఁ డస్త
గిరిఁ జేరు మున్నె నీ - తరుణితో నగర ౧౨౫
మునఁ బ్రవేశింపు మా - యని మాదలుండు
కౌంతియుఁ బలుకుచోఁ - గాంచి యా కోట
వెలుపలి ప్రాయూర - వేంచేసి యున్న
స్త్రీదేవతకు బలి - క్షీర మొసంగు
నది మాదరి యనెడి - ముది గొల్ల వనిత ౧౩౦
యరుదెంచి స్వామిని - ఘనుగుల మ్రొక్కి
నావుల మేపుచు - నా ఫల మెల్ల

వారి కొసఁగు గొల్ల - బ్రదుకున నుంత
యేని దొసఁగు లేద - యీమె నిర్దోష
వృద్ధ సచ్ఛీల యీ - వెలఁది గృహమున ౧౩౫
కన్నగి నుంచుట - కడు సమంజసము
సంకటంబును జంకు - కొంకు లేని పని
యని కౌంతి తలఁచి యా - యమతోడ ననియె
కన్నగి శ్వశురు పే - ర్వీన్న మాత్రానఁ
దత్కులజాతు లీ - స్థలి నున్న వారు ౧౪౦
పెను లిబ్బిఁ గన్నట్టి - పేదల మాడ్కి
గోరికతో నెదు-ర్కొని కొనిపోవు
వారంత వఱకు నీ - వనితను నీకు
నిల్లడ యుంచితి - నింతిఁ గొంపోయి
మొగి శుద్ధజలమున - బోరుకాడించి ౧౪౫
చలువ వలువ గట్టి - చెఱువారఁ గనుల
కంజన మిడి తల - యమరిక దువ్వి
తుఱుమున నరవిరుల్ - తుఱిమి యీ యమకు
నేడుగడగ నీవ - యేపారు మమ్మ
తన్వంగి చిన్ని పా- దమ్ముల మున్ను ౧౫౦
పృథివిదేవియుఁ గాంచి - యెఱుఁగదు భాను
నెండ నలఁత గొన్న - హృదయేశుఁ గూర్చి
నడుకు పుట్టించు నం-గద నొంది నాల్క

యెండ నధ్వశ్రమ - మెఱుఁగనిదగుచుఁ
బతులకుఁ దోడగు - సతుల వ్రతంబు ౧౫౫

నిష్ఠఁ బూనిన యట్టి - శ్రేష్ఠ దైవంబు
గాన వేఱొక వేల్పు - గానము గాన
మేటి క్రొత్తడు లున్న-నాట మేఘములు
కాలాన వర్షించుఁ - బాలన చెడదు
పంటలు దండిగాఁ - బండు సత్యంబు ౧౬౦

ధర్మంబు చెడదను - తద్‌జ్ఞుల పలుకు
విని యెఱుంగవొ తప-స్విను లిచ్చినట్టి
న్యాసంబుఁ గాచుట - యరిది కాదైన
గొప్ప యానందంబు - గూర్చున దగును
విందువు గాక కా-వేరిపూ నగర ౧౬౫

మున నశోకము నీడ - మున్ను శ్రావకులు
నిలిపిన యొక శిలా - తలముపై నిలిచి
జైనధర్మమ్ములఁ - జారణుల్ దెలుప
మెఱుపు నా విలసిల్లి - మిఱుమిట్లు గొలుపు
మేనితోఁ బొడవు ప్ర-సూన హారమ్ము ౧౭౦

తో హేమ భూషల-తో వేల్పులెల్లఁ
గై మోడ్పఁ దగు దివ్య - కాంతితో నలుపు
వ్రేలు గలిగి కోఁతి - కేలితో నొక్క
వేలుపు ప్రత్యక్ష - విధి నిల్వఁ గాంచి
లోకవ్రతతతి కే-ల్మోడ్చి చారణుల ౧౭౫

నీ వేల్పు రాకకు - నేమి కారణము ?
వినిపింపు( డనుడు( జా-రణ నాయకుండు
పలికె సుపాసంబు - వదలంగ నెంచి
వచ్చిన పలువురు - వ్రతు లొగి(జేరు
గృహమున నొక ముని-శ్రేష్ఠుని గాంచి ౧౮౦
'ఎట్టి' యనా రా బిరు - దెనసి వర్తిల్లు
సాయలు నిల్లాలు - చేయెత్తి మ్రొక్కి
భిక్షకై రండని - వినతి( గొంపోవ(
బిన్న కో(తి యొకండు - వెఱపుచే నొదిఁగి
యా యింట( జొచ్చి య - య్యమలుని యడుగు( ౧౮౫
దమ్ముల కడనిల్చి - తద్భుక్త శేష
మానందమున మెక్కి - యాతని మోము(
గాంచిన తీరును - గాంచి యమ్మౌని
యో తల్లి! నీ తనూ-జాతుని పోల్కి
దీని( గాతువు గాక - తే(కువ ననిన ౧౯౦
నా మహామహుని వా-క్యము నిక్కపఱచి
యామె కో(తి మరించు - నందాక( బెంచి
యంత్యక్రియలు దీర్చి - యధమ దేహమ్ము
తొలఁగ మేలగు నీగి - సలిపెను గాన
వారణాసి యనెడి - పట్టణ వాసి ౧౯౫
యుత్తర కొత్తున - కొంద నా కో(తి
కొమరుడై పుట్టి మే - ల్కొమరు రూపొంది

గొప్ప గెల్పులతోడ - గొప్ప దానములు
కావించి దిక్కుల - కడల సత్కీర్తి
నిండించి ముప్పది - రెండవ యేఁట ౨౦౦
వపువుఁ ద్యజించి ది-వ్యత్వమ్ము నందెఁ
గాన సంపాదించు - కలిమి ఫలమ్ము
దాన ఫలమ్మని - తగఁ జూప నొండు
కోఁతి చేయిగఁ గొని - కోరిక మీఱ
సాయలు నిల్లాలు - సలిపిన దాన ౨౦౫
ఫలమున నీ రూపు - పడసితిఁ గాంచుఁ
డని శ్రావకులకుఁ దా - నర్మిలిఁ దెలుప
నీ దివ్యరూపుఁ డి - య్యెడ నిట్లు కానఁ
బడియె నఁచు ముని-వర్యుండు పలుకు
ధర్మంబు విన్న యం-దలి తపస్వులును ౨౧౦
స్వార్థ రహితులు శ్రా-వణులు సాయలుఁడు
వాని భార్యయు మోక్ష-పదమంది నారు
దానమహిమ మిది - తత్పర మతిని
సమ్మతించివేని - యిమ్మాననవతిని
వెంటఁ గొంచింటికి - వెడలుమ యనిన ౨౧౫
కౌంతిపల్కుల కామె - కడు సంతసించి
లే సిగ్గు మొలచు ల-లిని దంత రాజి
లే మొల్క వెదురుఁ బో-లిన భుజములును
కడుఁదెల్వి గలిగిన - కన్నగితోడఁ

దపసుని వేఁడిమి - తగ్గిన వేళఁ ౨౨౦
గ్రేపులఁ దలపోసి - చేఁపుల తోడ
మెడలెత్తుకొని పరు-విడు పాఁడి యాల
వెంటను గొట్టెల - వెంటఁ బిల్లలను
భుజముల నిడి చిక్క-ములు చంక వ్రేల
గొల్లలు రా వెంట - గొల్లతల్ కొంద ౨౨౫
ఱీ యమ క్రొత్తయో - నేయూరో యనుచుఁ
బ్రక్కల వెనుకల - వచ్చుచునుండ
కావలి యడవి య-గడ్తయు యంత్ర
ధనువులు కఱికోఁతు-లను బోలు యంత్ర
ములు వడిసెలలును - వలచు నేయియును ౨౩౦
రాగి కరంచు పా-త్రలు కొలుములును
రాల గంపలు కిట్టి - కోలలు చిలుకు
లఱు గొలుసులు కోడి - యంగు కుంపటులు
కొఱ్ఱులు గడియ మ్రాఁ-కులు గొట్టములును
గానుఁగ మ్రాఁకులు - కఱకు శూలములు ౨౩౫
పొదులు గోడల మీఁదఁ - బొదుగు శూలములు
పక్షుల ముక్కులు - పంది ముక్కులును
వెదురుదండంబులు - విసరు కఱ్ఱలును
కుంతంబు లీఁటెలు - కుఱు పిట్ట తలలు
మొదలుగాఁ గల యంత్ర-ముల దయివాఱీ ౨౪౦
సర్వదా విజయంబు - సాధించి నిక్కి

చలియించుచున్న ధ్వ-జమ్ముల నలరు
వాకిలి దాఁటి య-వారణ త్వరను
రహిఁ శరణాగత - రక్షణ ధరణ
కరుణ మాదరి తన - శరణమ్ము చేరె. ౨౪౫

## ౧౬ వధ విధానము

మంజరి॥ కన్నగి న్యాసంబు - గాఁ గొన్న గొల్ల
మాదరి చల్లమ్మ - మడఁతుల తోడ
నిలుప మనసు రాక - నీడ పందిరియుఁ
గంచెయుఁ గల్గి చి-క్కని యెత్తు మట్టి
పూఁతచే నలరారు - పూరింటఁ జేర్చి ౫

గొల్లచెలులఁ గూడి - గోర్వెచ్చ నీట
తానంబు చేయించి - తన్నగరమున
మగువలు కై సేయు - మాడ్కిఁ జేయింప
నక్కఱ లేని స-హజ సుందరాంగి
సేవ గావించు నీ - చెలువ నా పుత్రి ౧౦

బంగారుగా నిన్ను - భావించు దాన
ఎలనాఁగ నాతోడ - నిచ్చట నిలుము
కొంతి మార్గాయాస - మింతయు లేని
త్రోవలోఁ దెచ్చి ని-ర్దుష్ట మౌచోట
వదలెను గాన నీ - పతి కింక నిచటఁ ౧౫

గుఱుగడు చింతింపఁ - గారణ మనుచు
[1] శ్రావక వ్రతమున్న - జనులు మీరౌట
పగటనే భుజియింప - వలయు వస్తువులు
పాత్ర యున్నవి పంట - పని చూడు మనుచు
గొల్లల స్థితులకుఁ - గొదువ కాకుండ ౨౦
పూజ్యుల యీవి నాఁ - బూవక కాయు
పనసయుఁ జిక్కుడు - వంకాయ బీఱ
మాతులుంగంబును - మామిడిపండ్లు
అరఁటులు శాలిబి-య్యము పాలు నేయి
కొనుమని యీయ న-క్కోమలి కొనుచు ౨౫
వ్రేళ్లెఱ్ఱగాఁ గత్తి - పీఁటపైఁ గోయఁ
గడు నందమైన మొ-గమ్ము చెమర్చె
నెఱ్ఱ సిరల కన్ను - లెఱ్ఱ వాఱినవి
నల్లఁ బాఱిన బ్రొయ్యి - నల్లనఁ గాంచి
మొగము వన్నియ మాఱఁ - బ్రొయ్యి ముట్టించి ౩౦
చెలి సాయ మొనరింపఁ - జేతనై నట్లు
భర్తకొఱకు నయి - పడఁతుక వండి
సొరైన తాటాకు - చాపపై నతఁడు
కూర్చున్న యంతటఁ - గూరిమి మీఱ
మట్టిపాత్రము గొని - మగని పాదములఁ ౩౫

1. సన్న్యసింపక యాచరించు వ్రతము.

గడిగిన నీరమ్ము – విడిగిన పూవు
వలె సున్న యఱచేతఁ – బట్టి భూదేవి
మోహమ్ము తీర్చిన – మొగివోలెఁ జల్లి
యలికి కన్నెయరఁటి – యాకును పఱచి
యన్నముంచి భుజింప – సగు నన్నయంత ౪౦
వణిజులకుం దగు – బలి మొదలైన
వానరించి వ్రేపల్లె–నొగి వెన్న మెక్క–
వెన్నుఁడే యిప్పు డీ – వ్రేపల్లె మెసవు
కోవలుఁ దగు నీమె – గొల్లల యింటఁ
బుట్టి కృష్ణుని ప్రేమ–మును గుత్తగొన్న ౪౫
యా రాధయే ; వీరి – యంద చందములు
కన్నుదోయి కడంగ – కున్నవి యనుచు
మాదరి తత్పుత్రి – మఱి వినుతింపఁ
బ్రియముతోడ భుజించి – విశ్రాంతి గొన్న
పతికిఁ దాంబూలంబు – భక్తితో నొసఁగు ౫౦
చెలువసు రమ్మని – చేరంగఁ దీసి
నీ మృదు పదములు – నిష్ఠుర శిలల
నడవంగఁ దగినవా ? – నలిన దళాక్షీ !
వేఁటకాండ్రుర యూళ్ళ – విడియంగ వలనె
మనము కానక యుండ – మన తల్లిదండ్రు ౫౫
లెట్టి వంతల నొంది – యేమయి రొక్కొ !
కల్లగాదిది కల – గాదు బలీయ

విధికృతమో యేమొ - వెలఁది యెఱుంగ
పదరలతో విట - పాళితోఁ గూడి
నీచుల యల్ప వా - జ్నియతులు కేరు ౬౦
ప్రల్లదంబులకు నేఁ - బాత్రమై మఱియు
సద్విధుల మఱచి - సత్యవాక్యులగు
పెద్దల నడవడి - వీడి వంశమున
కపకీర్తి యొదవించి - నట్టి నా కింక
సద్గతి కల్గుట - స్వప్నవార్త చుమి ౬౫
తల్లిదండ్రుల సేవ - తగ వీడినాఁడ
ననుపమసతి నీకు - నపచారి నైతి
నభిజనమ్ముమ హైన్య - మనక వీడితిని
వెడలుమనంగ నా - వెంట వచ్చితివి
అరుదగు నాగంబు - లాచరించితిని ౭౦
అని కోవలుఁడు పల్క - ననుతాప మతిని
ధార్మికులకుఁ దృప్తి - దానంబు నేఁత
అతిథుల మన్నించి - యాదరించుటయు
భూమీసురుల కోర్కి - పూజించి యిడుట
సన్యాసుల కెదురు - చనుటయు వీడు ౭౫
నా యెదుటికి మేటి - నాజెంపుఁ గీర్తి
ప్రభుగౌరవంబుతో - వఱలు మీ తండ్రి
మీ తల్లితో వచ్చి - మీరు నన్వీడి
యుంటకుఁ జింతించి - యురుదుఃఖ మేను

తోఁపనీకుండిన - తోయంబు మెచ్చి ౮౦
ప్రియవాక్కు లాడ నా - హృదయాన దాఁచు
శ్రమము తాపము దెల్పఁ - జాలిన యట్టి
తెచ్చికోల్ నవ్వుచే - నొచ్చెడు కరణి
పెద్దల నిందించు - పెడత్రోవఁ బట్టి
నారలు మీ యాజ్ఞ - గోరంతయైనఁ ౮౫
దప్పరాదనెడి చి-త్త స్థిరత్వమును
చెందితిఁ గాన మీ - చెప్పిన యట్లు
కదలివచ్చితి నని - కన్నగి పలుక
తొలి యిలు వేల్పులై - వెలసిన తల్లి
దండ్రుల బంధుల - దాసీ జనములఁ ౯౦
బెద్దలు చను త్రోవ - వీడి గౌరవము
బిడెము సతీత్వంబు - విడని సాయముగఁ
వచ్చి యిచ్చట నా య-వాంత్రముల్ తలఁగఁ
గరుణించు బంగారు ! - విరిలత ! నాన
పతిమ ! యందంపు సం-పల్లక్ష్మి ! లోక ౯౫
దీపమ ! క్రొత్తడి - తిలకమ ! దయిత !
నీ కాలియందియ - నేఁ గొనిపోయి
యమ్మి వచ్చెద వచ్చు-నందాఁకఁ జింత
నొందక నెమ్మది - నుండుమ యనుచుఁ
బ్రియురాలి యొడలెల్ల - విరవిర వీఁగఁ ౧౦౦
దడవి సఖీజనుల్ - దాసీ జనములు

రేమికి వగచి వె-ల్లిగ నశ్రు వితతి
గ్రమ్మ గొల్లల యిల్లు - క్రన్నన వీడి
తడఁబడు నడకతోఁ - దద్వీథిఁ జనుచు
బసవండు పొడువంగ - వచ్చుట గనఁడు ౧౦౯

తన కుల మది లెక్క - గొనునది కాదు
ఎరువు కుప్పల దాఁటి - తొరతొర దేవ
దాసీజనుల వాడ - దాఁటి యంగళ్ళ
కలవీథి నడచుచోఁ - గరఁచు వారలును
చే నేర్పు పోగర - చెక్కఁడ మందు ౧౧౦

తేటిన కమసలుల్ - నూఱుగు రతని
వెంటరాఁ జొక్కాయ - యొంట ధరించి
బహు వినయం బుట్టి-పడఁ జూపు నడక
కై కోల గల యొక - కమసలిఁ గాంచి
పాండ్యుని కడ గౌర-వం బందినట్టి ౧౧౧

వాఁడు గావలయును - వీఁ డని డాసి
జనపాల సతికి భూ-షణము కాఁదగిన
దొక కాలి యందియ - యున్నది కాంచి
వెలకట్టి యంచన - వేయంగఁగలవె ?
యనుడు నే నంత నే-ర్పునఁ జాలనైన ౧౨౦

మకుట మంగదము నీ - మొదలుగాఁ గలుగు
వెల కట్టరాని న-గలు ప్రభువునకుఁ
చేయుచుందు ననుచు - రోయుచు యముని

మాతగా వచ్చిన - దుడుకు సొన్నారి
చే యెత్తి తన నేర్పు - చెప్పిన యంత ౧౨౫
ముడి విప్పి మానిక - ములుసు వజ్రములు
పొదిగిన యపరంజి - పోగర పసులు
కలయందె నీయ నా - కల్లరి తత్ర
కాఁడు పరీక్షించి - కాంచి పార్థివుని
కడఁ దా హరించిన - కాలి యందియను ౧౩౦
పోలుట చూచి యా - పోయిన యందె
యిదె యని తద్దోష - మితనిపై మోపఁ
దగు నని మదిలోనఁ - దలఁచి కోవలుని
గని రాజపత్నియె - గాక యీ యందె
తక్కువారు ధరింపఁ - దగరని పలికి ౧౩౫
నేను మున్నుగ దీని - నృపునకుఁ దెలిపి
యేతెంచు దనుక నా - యీ చిన్ని గుడిసె
లో నుండు మనఁ గోవ-లుఁడు చని వాని
యింటి చెంగటఁ గల - యెత్తైన చవికె
జొచ్చిన పదపడి - సొన్నారి నేను ౧౪౦
వంచించి కొన్న యీ - పార్థివు నందె
తనయొద్దఁ గలదని - జనులకుఁ దెలియు
మున్నె యీ నూతన - పురుషుని వలన
నా దొంగతికమును - నే దాఁచుకొందు
నని నిశ్చయించి వాఁ - డరుగుచుఁ జదుక ౧౪౫

మందాట వెలఁదుల - యాటలోఁ దోఁచు
తోఁపిక పాటల - తోయంబు గీత
ఫలమును మిక్కిలి - ప్రభుని యుల్లంబు
నలమిన వని యెంచి - యలుక నడంచి
తల నొప్పి యను మిష - వెలయించి రాణి ౧౩౦
ప్రక్కక తనువీడి - శుద్ధాంతమునకు
నేగుటచే మధు-రేఖుండు మంత్రి
కూటంబు విడి చెలి-కూటంబు తోడ
రాణివాసమ్ము చే-రం జనుచుండఁ
గమసలి వాఁగిలి - కడు నుతియించి ౧౩౫
కన్నంపుఁ గోలయుఁ - గడ్డ పాఱయును
బలపము లేక ద్వాః - పాలుర కనుల
మంత్రంబుతో మచ్చు - మందులు చల్లి
నగర నందియ గొన్న - జగదొంగ దొరకె
రక్షకభటుల మొ-ఱంగి నా గుడిసె ౧౪౦
కడఁ జేరినాఁడనఁ - గాల మాసన్న
మయ్యెఁ గావునఁ బొండ్యు - డావంతయైనఁ
బరికింప కూరి కా-వలి వారిఁ బిలిచి
దేవేరి కాలి యం-దియ హరియించు
చోరుఁ డీతఁడు చూపు-చో నున్నవాఁడు ౧౪౫
వాని వధించి య-ద్దాని నిచ్చుటకుఁ
దెండని తన భట - తండంబు తోడ

నంప హింసాప్రియుం - డగు కమసాలి
తనలోన సుప్రొంగి - తవిలి దుర్బోధియు
డాసిన కోవలు - డాసి రా జసుప ౧౭౦

నందియ( జూడంగ - నరుదెంచినాడు
వీరని యందె( జూపింప(గ( జేసి
వారి దూరంబుగ - వడి( గొనిపోయి
యందియ మేలిమి - యంతయు( దెలిపి
దేవేరి యందె యందియ యని నమ్మ( ౧౭౫

బలుక, నిచ్చట నున్న - వా(డు శరీర
లక్షణముల మేటి - లలిని వధ్యుండు
కా(డను వారల( - గని ముసినవ్వ
సారించి చోర శాస్త్రమున హేతువుల(
దల(పించువా(డు మంత్రము మందువేల్పు ౧౮౦

తంత్రమ్ము శకునమ్ము - స్థలము కాలమ్ము
సాధన మనెడి యష్టకమునే కాదె
దొంగ లానిక( గొని - దొంగిలుచుంట
వీని వంచన కిడ్డు - లోనైతి రేని
రాజ దండనకు( బాత్రము లగువారు ౧౮౫

మంత్రంబు జపియింప - మఘవు కుమారు
లను వలె( గాంచ(గలామె వారలను ?
మచ్చు మందులు చల్లి - మైకము గూర్చ(
గదలి యెచ్చటికి( బో(గలుగు వారలము ?

తమ వేల్పు రూపమ్ము - ధ్యానింతురేని ౧౯౦
ధనమును చూపియుఁ - దప్పించుకొం్రడు
శాస్త్ర విధుల వారు - సలుపుదు రేని
హరి బొమ్మ పేరైన - హరియింపఁ గలరు
కడు సన్నిమిత్తముల్ - గలిగినఁ గాక
యధిక ధనము లభ్య-మైనఁ గైకొనరు ౧౯౫
ఇది యటఁ గొనఁ దగి-నది యని యెన్న
వారిని గనిపెట్ట - వలఁతు లెవ్వారు ?
అదను నెఱిఁగి యర్థ - మపహరించునెడ
వేలుపు లేని త-ప్పింపఁ గలారె ?
తగు సాధనము గొని - ధనము హరింప ౨౦౦
జగమునఁ గనిపెట్టఁ - జతురు లెవ్వారు ?
వారికి రే లేదు - పగలును లేదు
వారలు దొంగిలు - వస్తువు దెలియఁ
దెలియనీయక దాఁపఁ - దెరువును లేదు
మున్నొక్క నాఁ డొక్క - విన్నాణి దొంగ ౨౦౫
దూత వేసము తోడ - దొరయిల్లు పగటి
పూట గాచుచు నుండి - ప్రొద్దువోఁ జెలువ
వేసమ్ము గొని రాణి-వాసమ్ముఁ జేరి
దీపపు నీడనే - తేఁకువఁ బడక
గది చేరి యువరాజు-కంఠ హారమ్ము ౨౧౦
గైకొన నతఁడు ది-గ్గన లేని మెడను

హారమ్ము గానక - యడిదమ్ము దూయ
వాఁడొఱతో దాని - వారించి కత్తి
యొఱలోనికే చను - నొగిఁ బట్టి యతఁడు
ముష్టితోఁ బొడువంగ - మొగియంగ నొక స ౨౧౫
ణిస్తంభమున దాఁగి - నిలిచి యా చేతి
పోటునకుం గంబ-మును గుఱిచేసి
తన శాస్త్రనైపుణిం - దప్పించుకొన్న
దొంగను పట్టు చ-దురు గలరేని
దెలుపుఁడు వీరికి - దీటు లోకములఁ ౨౨౦
గలుగరు నిజమంచుఁ - గమనలి పలుకఁ
దళతళ మెఱయ హ-స్తమున ఖడ్గంబుఁ
గలిగిన యువకుఁ డొ-క్కరుఁ డిట్లు పలికె
ఖలపంబు నీలి యం-బరము ధరించి
యాఁకొని జింకల - నారసి తఱిమి ౨౨౫
యలసిన బెబ్బులి - యనువున నొకఁడు
నడురేయి పబ్బున - నా కంటఁ బడియె
వాని నఱకఁ గత్తి - వడి దూయు నంత
వాఁడు నేర్పున దానిఁ - బట్టి లాగి కొని
పరుగిడెఁ దరువాత - వాని నెచ్చటను ౨౩౦
కాంచనైతిని వీరి - వంచన చేష్ట
లరయ నెవ్వరికేని - యరిది యీ చోరు
వదలిన మనలను - బ్రభుఁడు దండించు

మీరును క ర్తవ్య - మారయుఁ దనుదు
ముక్కడి మదయుతుఁ - డొక్కండు చేతి ౨౩౬
క త్తితోఁ గోవలు-కంఠంబు నఱకె
నది సరాలున మెడ - నడ్డంబు త్రెంచె
నెత్రు వెల్లువ గాఁగ - నేలపైఁ బాఱె
భూదేవి దుఃఖముం - బొందె మిక్కిలిగ
భూపతిపాలన - మొక్కవోవంగఁ ౨౪౦
బూర్వ దుష్కర్మము - ముదురుట చేత
నరకుడు వడి భువి - దొరలెఁ గోవలుఁడు.

మ॥ తిరమై మోఘము చెందకుండు గురునీతిప్రాజ్య సామ్రాజ్య ము
ర్వరఁ బాండ్యేశుని పూర్వజన్మకృత పాపక్లాంతిచే ఘోర దు
ర్భర నాశమ్ము భజించెఁ గోవలుమిషఁ బ్రాక్కర్మజాతంబులై
పరఁగుం గష్టసుఖంబు లట్లగుట సల్పం జెల్లు సత్కార్యముల్.

## ౧౭ గొల్లల యాట

మంజరి॥ గిరిరాజ శిఖరానఁ - గీల్కొల్పు మీను
ప్రక్కఁ బులియు విల్లు - వ్రాయించి నట్టి
చేరుఁడు చోళుఁడు - ధారణీవిభులు
తన యాజ్ఞ నడప భూ-తలనాధ తతుల
నేలిన పాండ్యభూ-మీశుని కోట

మేలు కొలుపు ధ్వనుల్ - మేటిల్లి మ్రోఁగె
నగరికి నేఁబ యొ - సఁగఁ దగు వంతు
గలదని మాదరి - కడుపడి లేచి
తన కూఁతు నార్యను - తమిమీఱఁ బిలిచి
కవ్వంబు త్రాడును - గై కొని పెరుఁగు ౧౦
కడవల కడ నిల్చి - కాంచి యిట్లనియె
కడవల పాలు తో - డిడి పేరలేదు
పాఁడి యావుల కనుల్ - బాష్పముల్ గార్చె
దుర్నిమిత్తంబులే - తోఁచు చున్నయది
కరఁచినఁ గరఁగదు - కడవల వెన్న ౧౫
మేఁకపిల్లలు గంతి - మిట్టి యాడవును
దుర్నిమిత్తంబులే - తోఁచు చున్నయవి
ఆవులు వడఁకుచు - నఱచు చున్నయవి
పాల పూసలు తెగి - నేలపై రాలె
దుర్నిమిత్తంబులే - తోఁచు చున్నయవి ౨౦

—: హేతువు :—

వ॥ బానల పాలు పేరకుండుటయు, నావులు కన్నీరు గార్చుటయు, వెన్న కాఁచినఁ గరఁగకుండుటయు, మేఁకపిల్లలు త్రుళ్ళుచు నెగురక ముడిఁగి పరుండుటయుఁ బసుల మెడపూసలు తెగి పడుటయుఁ జూడ నేదియో చెడుగు రాఁగలదని సూచిత మయ్యెనని కూఁతుం గాంచి, 'చింతింపకుము. కాంతల కాభరణ మైన కన్నగియుఁ గాంచునట్లు మున్ను గొల్లపల్లియ మంటపమున శ్రీకృష్ణుఁడు బలరామునితో నాడిన పెక్కాటలలో నీలతో నాడిన యాటను పసియుఁ గ్రేపులు నెరగు నీఁగు కొఱ కాడుద' మనియె.

—: ఉద్దేశము :—

సం॥ కొరెద్దు చేసుకకుఁ - గంగాదు పడక
పొడువ వచ్చిన కోడె - నొడిసి చే పట్టి
పిలుకు మాల్చిన వాని - వలచు మా నీల
కనలు గిబ్బసు బట్టి - గబ్బడఁగించు
దిట్టకానిం జెట్ట - వట్టు మా నీల 25
ఈ బలిష్ఠంబైన - యెద్దుపై నెక్కి
స్వారి చేసిన వాని - స్వామ్య మా నీల
పొడల కోడియ మద - మడఁచిన మేటి
మగవాని కర్ధాంగి - యగును మా నీల
అందమౌ పూఁ బొడ - లొందు కోడియసు 30
అంకెకుఁ గొను దిట్ట - కర్త మా నీల
ఎవరి కడంగని - యీ గిత్త నడఁచి
నడుపు వానికె లభ్య-పడును మా నీల
ఈ పొడ కోడియ - కోపు లడంచు
వానికే కాయని - వలతావి పూవు 35
వంటి వన్నియ కన్నె - వరణీయ యగును.

—: చూపుట :—

ఇట్లు పూజాస్థలి - నెనసిన యేడు
కోడెలఁ దమ పెండ్లి - కొఱకె యేడుగురు
కన్నెలు పెంచిరి - కాంచుఁడీ యనుచుఁ

వన కాంతుఁ గాంచి యా - తలిరు బోణులను ౪౦
స్వరములు నిలిచెడి - సరవిని నిలుపు
మనుచు వారలకు హే-త్వభిధాన మిట్టు
లుంచంగఁ దన మది - నూని పై దెసను
షడ్జంబు మొదలు ని-షాదంబు వఱకుఁ
గ్రమముగాఁ నిలుప ష-డ్జము కృష్ణుఁడయ్యె ౪౫
బలరాముఁ డయ్యెను - పంచమ స్వరము
నిల రిషభమయ్యె - నెవి నట్లె దక్క
వారలు తగు చోట్ల - వారక నిలుప [1]
కృష్ణుఁడౌ షడ్జంబు - నెడమను కుడిని
రిషభ నిషాదముల్ - కృష్ణుని యన్న ౫౦
యును పంచమమునకు - నట్లు మధ్యమము
ధైవత ముండె, గాం-ధారమ్ము నిల
కెడమను, మొదటిదై - యొసఁగు నిషాద
మునకుఁ గుడిగ నిల్చె - మొగి ధైవతమ్ము
వారిలో హరిమెడ - వనమాల వైచి ౫౫
శాస్త్ర పద్ధతి నాడఁ - జనిరి చైత్రమ్ము

1. వృషభ సింహ కటక తులా ధనుః కుంభ మీనములను నేడింటి షడ్జాది సప్తస్వరముల నిలుపుట యొక పద్ధతి. తులా ధనుః కుంభ మీన వృషభ కటక సింహముల నేడింటిని సప్తస్వరములుగా నిలుపుట వేఱొక పద్ధతి. ఈ స్థానముల గుర్తించి యేడుగురు చేతులు కూర్చుకొని పాడుచు నా యా స్థానములఁ బాదము లుంచుచు ఎడమప్రక్క నిలిచినవారు కుడిప్రక్కకు, కుడిప్రక్క నిలిచిన వా రెడమ ప్రక్కకుఁగా మాఱుచు నిలుచుట పద్ధతి.

మెన్నఁ బరమ్మన - వెలయు శ్రీదేవి
మక్కువఁ గనమికి - మన నీల కాదె
నతమని మాదరి - సుత వినుతించి
ఎలమి నమస్థితి - నిలిచి మండలము ౨౦
గాఁగఁ జేతులు కట-కమ్మగాఁ గూర్చి
యాడఁ దాళము గతి - నరసిన షడ్జ
మందున్న హరి యను - నామె పంచమము
నుద్దేసించుచుఁ జేన - నొగి వచ్చి మోస
నే నిల్చిన వెలగ - చెట్టును విఱుచు ౨౫
కమల పత్రాక్షిఁ [1] బం-చమము షడ్జముగఁ
వనరు స్థాయిని పాడు-దమ యని పలికి
షడ్జ మంద్రముగఁ బం-చమము మధ్యముగ
రిథష తారముగఁ గూ-రిచి ధైవతమును
మంద్రముగాఁ బట్టి - మైత్ర స్వరమ్మ ౩౦
పట్టుగా నొక పాట - పాడంగఁ దొడఁగె.

పాటలు — ఉత్సాహ వృత్తములు.

[3] వంచనమ్మ తోడ వచ్చు - వానిఁ గ్రేపు రూపునిఁ
క్రుంచి కాన్పు పట్టి త్రిప్పి - కొట్టి చంపు శౌరి మే

---

1. అడవియుఁ దత్ప్రాంతమును 'ముల్లై' యనఁబడు. దాని కధిదేవత విష్ణువు. గొల్లల యాటకును 'ముల్లై' యని పేరు. దానికి పంచమము శ్రుతి యగును. దాని కైదవదియగు మిత్ర స్వరము నీశ.

2. వేణువులు ముత్తెఱఁగు :— (1) తేలకాయ తొల చేసిన క్రోవి (కొన్రై). (2) గాడిద మొగపు టనుసు గల ఒలుపక్రోవి (ఆంబల్). (3) మొల్లతీఁగతో ముప్పురిగాఁ బెనఁచిన వలయమును వంపునోరుగాఁ గట్టినది మొల్లక్రోవి (ముల్లై).

తే॥ ప్రొద్దుఁ జేతి చక్రంబులో - మూసి నట్టి
నల్లవాని కెడమప్రక్కఁ - దెల్లవాని
కుడి వలంకున నొప్పిన - పడఁతి నీళ
నారదుం డామెకుం దాళ - మార వేయు. ౯

కుడిని మాయి నమాయికు - నెడమఁ గలది
మెడను వంచి నిల్చిన నీళ - మడఁతి కను గ
లముగ సంగీత మర్మంబు - లమర నరయు
నారదుఁడు తాళగాఁడయి - యార నిలిచె. ౮

చ॥ వెలఁదులు కేలు గూర్చుకొని వేనలు లల్లలనాడ గాజులున్
జెలువుగఁ దాళసంగతులఁ జెందఁగ నీళయు శౌరి సీరియున్
గలిసి నటింప మోదమునఁ గాంచి యశోద నుతింప మందలో
వెలసిన గొల్లయాట కడు వేడుక గూర్చె జగంబువారికిన్. ౯

తే॥ కూర్చని మలయహారమ్ము - కూర్చు కడలి
హార మింద్రుఁ డిచ్చిన హార - మరయఁ బాండ్య
నక్కఁ నందలి వతఁ డెవఁ - డనఁగ మంద
నాల మేపిన కన్నయ్య - యంద్రు బుధులు. ౧౦

హిమగిరిని పులిఁ జిత్రించి - యీవలి మహి
నేలువాఁడె సంగమ వురి - నేలువాఁడు
ఆతఁ డెవఁడన భూభార - మమరఁ దాల్చు
వెన్నుఁడే యని యీ భువి - విబుధు లంద్రు. ౧౧

వనధిఁ జొచ్చి యచ్చటి కదం-బమును నఱికి
జగములకు మేలు గూర్చిన - జనవరుండు
చేరరా జతఁ డెవఁడన - క్షీర వారి
రాశిఁ జిలికిన శ్రీ భార్గ-వీశుఁ డంద్రు. ౧౨

1. తరళ

నగము కవ్వముగా నొనర్చుచు - నాగరాజును త్రాడుగా
మిగిలి చిల్కిన వాఁడవే గద - మున్ను క్షీర పయోనిధిన్
దగిలి చిల్కిన కేలు గొల్లత - త్రాటఁ గట్టిన కెల్లదా!
జగము నేలిన జాణ ఏ కిది - జాలమో మరి మేలమో. ౧

2. మత్తకోకిల.

మూల వస్తువు నీవుగా ముని - ముఖ్యులెల్ల నుతింపఁగాఁ
జాలి యాఁకలి దప్పి లేకయె - సర్వ మొక్కటి మ్రింగ దా
చాలు నోటిని గాంచ నుబ్బుస - పట్టి వెన్నలఁ దిన్న దే
జాలమా! యిది మేలమా! జల-జాతనేత్ర! వినోదమా! ౨

3. మత్తకోకిల.

నీ పదాబ్జము లీ జగమ్ముల - నిండు పోష మడంచె నీ
యీ పదమ్ములె పాండు పుత్రుల - కేఁగె దౌత్యము నేయఁగా
పాపకారుల రూపడంచెడు - పావనాత్మక! నీ కృతుల్
నాపకారులొ? నోపకారులొ? - యారనారయ లే మహో. ౩

4. కవిరాజ విరాజితము.

జగముల మూఁడిటి నీడిచి కొల్వఁగఁ జాలవు రెండుపదంబుల కా
పొగడఁగఁ దగ్గ పదంబులు నొవ్వఁగఁ బోయితి కానకుఁ దమ్మునితో
మగువకు లంకను నాశ మొనర్చితి మాధవ! యట్టి భవద్యశమున్
పగిలి లలిన్ విన నోమని వీనులు తథ్యము వీనులు కావు సుమా!

5. మానిని

లోకములం దననాభి జలేజము లోన నడంచిన వాని జగ
చ్ఛ్రీకరు మాయల నేర్పరి నోరును చేతులు కాళులు నెఱ్ఱనయై
మై కఱియై కన వచ్చెడు వాని రమాపతిఁ గన్నుల పండువుగా
నేఁకటదీఱఁగఁ గాంచనికన్నులు నేర్పడఁ గన్నులటే ! జగతిన్.

6. మానిని

కేరుచుఁ గంసుఁ డొనర్చిన మాయల గెల్చిన వాని జగత్త్రయమున్
గోరి భజింప శ్రుతుల్ వినుతింపఁగఁ గూరిమి పాండవ దూతగ వే
సారక పోయిన వానిఁ గృపాళుని సారెకు సారె హరే యనుచున్
నారణ ! యంచు నుతింపని నాలుక నాలుకయే యది నిక్కముగన్.

మంజ॥ అనుచు మేమాడిన - యాటల యందు
ప్రణుతింపఁ బడిన దై - వము మన మంద
కగు నాపదలను తొ - లఁగఁ జేయుఁగాత
వజ్రి మకుటమున - వఱలిన తొడవు ౨౫
దాల్చిన పాండ్య భూ - దారుని భేరి
పగఱ గుండెలు వ్రీలఁ - బరుసుగా మ్రోఁగి
విజయమ్ము నెల్లప్డు - వెలయించుఁ గాత.

## ౧౮ దుఃఖము

మంజ॥ కూడి తా మాడిన - గొల్లల యాట
కడపల ధూప మ-క్షతలు చందనము
ప్రసవమ్ము లర్పించి - వైఘ తీరమున
వెన్ను పాదములు సే-వింపఁ దలంచి
వారక మాదరి - నీరాద నేఁగి ౫

నగరానఁ గలిగిన - దగు వార్త యొండు
విని తొట్రుపడు వడి - వెనుక కేతెంచి
నిలిచి కన్నగి కది - తెలుపంగ లేక
నిలువంగఁ గన్నగి - పలికె నీ రీతి
నా ప్రాణములకంటె - నర్మిలి చెలిమి ౧౦

కనజాల కుంటి నా - కాంతు నిందసుక
మనము కలంగె వే-దన మెచ్చిరిల్లెఁ
గొలిమి తిత్తిని మించి - వెలరె నిట్టూర్పు
పొరుగు చెలులు పల్కు - తెఱఁగు లెట్టివియొ
పట్టపగట మేను - వడఁకించు చెడుగు ౧౫

మితి మీఱి వచ్చిన - వితము గన్పడియెఁ
బతిఁ గాన కుల్లంబు - పరితపించెడిని
పొరుగు చెలులు పల్కు - తెఱఁగు లెట్టివియొ ?
కాంతుండు కనరాఁడు - గతి వే ఱొకండు
కలుగదు వంచనా - కార్య మొక్కండు ౨౦

తారిన యట్లు చి - త్తము కలంగెడిని
ఇపుగు పొపగు వార - లెవరిని గూర్చి
పలుకువారలొ సుంత - తెలియంగ రాదు
వారలు పలికెడి - వార్త యియ్యదియ
వెఱపించుకయు లేక - హరియించు దొంగ 25
యితఁడె యితఁడె యని - యేలిక భటులు
ఖండించి రఁట ! వచ్చె-కాని నొక్కరుని
అనుచు గోపిక యోర్తి - యాడఁగా వినిన
కన్నగి వడి లేచెఁ - గడు నుగ్ర యగుచు
వెన్నెల నెల విను-వీధి యందుండి 30
మొగులుతో నిలఁబడ్డ - పగిదిని పడియెఁ
గను తెజ్జువాఱ వె-క్కసముగ నేడ్చె
ఏడ నా ప్రాణేశుఁ - డేడ నా భర్త
యని వెక్క చూప్పుచు - నడలెఁ దపించె
ప్రాణప్రియులు వహ్నిఁ - బడఁ గాంచి తాము 35
నగ్గిఁ జొరక దుఃఖ - మందు స్వార్థాత్మ
లల్ప వ్రతలఁ బోలె - నవనీ జనమ్ము
తెగడఁ బాండ్యుఁడు పాప - మొగిఁ జేయు కతన
పతిని నీఁగిన యేను - పలవించి గుండె
పగుల నేడ్చెడి బేల - వలె నౌదునేమి ? 40
ప్రియపతి మడియంగ - వెక్కుచు బెక్కుఁ
నీటి రేవుల దిగి - నీరాడి వచ్చి

చింతించుచుండెడి - చేడెల మాడ్కి
ధర్మాధికారుల - స్థానమందుండి
మఱచి పాపము సేయు - మొఱకు పాండ్యేశుఁ ౪౫
డానతించు చెడుగుచే - నూరక యేడ్చి
కృశియించుచుండునే - యెద్దైన యింక
ప్రాణప్రియుం దగ్గఁ - బడి మ్రగ్గుచుండఁ
బెక్కు తీర్థాలకు - వెడలెడి యట్లు
భాగ్యవతుల మాడ్కిఁ - బాడి యో విడుచు ౫౦
పాండ్యుఁ డధర్మాన - వర్తించు కతన
నీ జన్మమునఁ గీర్తి - నీఁగి చింతిల్లు
చుండు నొక్కొ ! క్రుంగి - కుందుదు నొక్కొ !
అరయుఁడీ రాఁగల - యంగద నీఁగ
నాడిన గొల్లల - యాఁటకై వచ్చి ౫౫
చేరిన గోపిక-లార ! వినుండి
చండభానుఁడ ! కర్మ-సాక్షివౌ నీవు
లోకవృత్తము కొఱ - లే కెఱుంగుదువు
నా పతి దొంగ యౌ-నా ? పల్కు మనఁగ
కాఁడు చోరుఁడు కాఁడు - కాఁడు నీ పతిని ౬౦
దొంగయౌ నన్న యీ - దుష్ట పురమ్ము
నగ్ని మ్రింగును గాక - యనె నశరీరి.

## ౧౯ ఊరఁ దిరుగుట

మంజ॥ వేడివెలుంగట్లు - వినిపించునంత
నా సతి రెండవ - యందియ కేలఁ
గొని యట నిలువక - చని నీతి లేని
ప్రభుని పట్టనమున - వసియించుచున్న
తలిరుఁబోండ్లార ! క్రొ-త్తడి మిన్నలార ! ౫
యీ యందెతోఁ జేర్చి - యా యందెఁ గనుఁడు
ఈ మాపువేళ నే-రే నొందరాని
యాపద నొందితి - నగచాట్లఁ బడితిఁ
బడలకు రారాని - బన్నంబు వడితి
నా పతి చోరుఁ డౌ-నా ? కాఁడు కాఁడు ౧౦
నా కాలి యందె ధ-నంబీక కొనఁగ
దొంగయ౯ పేరిడి - త్రుంచు టన్నెంబు
పతుల సత్ప్రేమకుఁ - బాత్రంబు లైన
వెలఁదుల యెదుట నా - ప్రేమ ధనమ్ము
ప్రాణాధినాథు న - ప్రాణుఁగాఁ గాంతుఁ ౧౫
జూచుచుండుం డిది - చోద్యంబు గాదె ?
అట్లు నాథుని గన్న - నాతని నోట
జరిగిన యది విందు - సప్రమాణ మిది
వినఁజాల నేని యీ - వీటఁడి మనకుఁ
దలవంపు దెచ్చిన - దల దొంగభార్య ౨౦
యే యని నను పిల్వఁ - డిది యొక సత్య
మని పరిదేవన - మొనరించుచున్న
కన్నగి నెల్లరు - కాంచి తపించి

కలఁగి తొలంగింప-గారాని దుఃఖ
మీమెకుఁ గావించి - యెప్పుడుఁ జెడని ౨౫
కువలయేశుని నీతి - కుంఠిత మయ్యె
నేమి కారణమొకో - యెఱుఁగంగరాదు
రాజరాజగు పాండ్య - రాజపాలనము
నేఁటితో నశియించె - నేటి హేతువొకొ ?
ధరఁ బ్రశాంతపఱచు - ధర్మమ్ము నూఁట ౩౦
సార్వభౌముని మేటి - చల్లని గొడుగు
నేఁ దోర్వఁగారాని - వేఁడిమి నొసఁగె
కనకంపు టందియ - కరమునఁ బట్టి
క్రొత్తవేలుపు వచ్చె - టుత్త నేయంగ
వెక్కుచుఁ బెక్కుచుఁ - వెలవెల పోయి ౩౫
యావేశమందిన - యటులున్న దీమె
ఏమి రానున్నదో - ఎవ్వరి కెఱుక
యనుచుఁ జింతించుచు - నరిగి యన్యాయ
యుక్తమై యపనింద - నొందిన మధుర
జనులు కొందఱు కోవ-లుని గానిపింప ౪౦
నది గని యోర్వలే - కరిగిన కరణిఁ
బడమటి కొండపై - భానుండు గ్రుంకె
నట్టి సాయంవేళ - నలరారి రాలు
విరిలత వలె నామె - విభునిపై వ్రాలి
విహ్వాలించుచుఁ జాల - విలపింప, సూర ౪౫

గొల్ల మనెడి గోడు - గురువులు వాఱె
నుదయ వేళను భర్త - నెదఁ గౌఁగిలించి
యతని సిగను దాల్చు - హారంబు దీసి
తగు [1] సంజవేళలోఁ - దన సిగఁ దాల్చి
పతి గాయమునసుండి - బయలైన రక్త ౨౦

1. కాల విపర్యయ దోష మిందొకండు మనుచరిత్రమందలి కుతపవేళను వలె ననివార్యముగాఁ గానవచ్చుచున్నది.

మాదరి కన్నగిని తన యింటికిఁ గొంపోవుట సాయంవేళయం దని తత్సమయవర్ణనము స్పష్టముగ నుడువుచున్నది. కొనిపోయి స్నానముచేయించి వంటచేయుమన్నది. నా కూఁతురు శ్రావకవ్రతము కలది కావున పగటనే భుజింప వలయు వస్తువులు, పాత్రలు సిద్ధముచేయఁబడి యున్నవి. వంటపని చూడుమని కన్నగి నుద్బోధించెను. అది సాయంకాలమే యైయుండవలయును గదా! అట్లన ఏలులేదు. భుజించిన వెంటనే అందియ నమ్ముటకై యంగడివీది కతఁడు వెళ్ళు చున్నాఁడు. కావున వంటచేసినది రేయికాదు. రేయి వారు వస్తుండిరనియో మాదరి వండిపెట్టినది తినిరనియో తలంపవలసియున్నది. అట్లు భుజించియున్నచో మఱునాఁడామెను వంటచేయుమని చెప్పనవసరము లేకపోవుచున్నది. రేయును, పవలును చేసినదందమా? పగటఁజేసిన వంటకై కన్నగి శ్రమపడుట వర్ణింపఁ బడినది. భోజనానంతరము (మధ్యాహ్నవేళ) కోవలుఁ డంగడివీదికి బయలు దేఱెను. అట కమసలి కుట్రచే చంపఁబడెను. అదియు సాయంకాలమునకు పూర్వమే యైయుండవలయు.

మఱునాఁడు మాదరి నగరిలోని మేలుకొలుపుల ధ్వని విని మేలుకాంచి రాచనగరికి పాలు పెరుఁగు నేయి కొనిపోవలయు వంతు తనది కావున తొందరగాఁ బోయి చూచునరికి పెరుఁగు పేరలేదు. అది యుత్పాత సూచకమని తత్పరిహారార్థము కన్నగి చూచునట్లుగ గొల్లల యాట ప్రారంభించినది. ఆట పూర్తియగు పిమ్మట నదీస్నానార్థమేగినది.

నదీతీరమున జనుల గుసగుసలు విని సంశయాయత్తచిత్తయై మాదరి వడివడి మరలివచ్చినది. కన్నగి చించింతించుచుండినది. ఆ చింత భర్త యింటికి

మొదలెల్లఁ దడుప నతఁడు తన్ను ప్రేమఁ
గాంచఁజాలని జాలిఁ - గాంచె నయ్యువతి
యీ సహింపఁగరాని - యెడరును గాంచి
ప్రియురాలు మిక్కిలి - వెగడు చెందునని
తలఁపవు ప్రాణేశ ! - తావి చందనము ౨౫

రాలేదని కాదు. జను లనుకొనుట విని బయలుదేఱినది. భర్తను కాంచినది. కాంచుతఱి,

అది గని యోర్వలే - కరిగిన కరణి
బడమటి కొండపై - భానుండు క్రుంకె

క్రుంకవచ్చు. వెదకి కనిపెట్టువేళకు సాయంసమయము కావచ్చు.

ఉదయవేళను భర్త - నెదఁ గౌఁగిలించి
యతని మెడను వైచు - హారంబు దీసి
తగు సంజవేళలోఁ - దన సిగఁ దాల్చె.

ఆపై నుగ్రంపు నడకతో రాచనగరి కేఁగినది. అట రాణి కలగని లేచి కళవళపడి యా వృత్తాంతము రాజునకు వినిపించుచుండినది.

ఆమె కల గన్నది రేయా? పగలా?

మధురా దహనము రేయియే జరిగినది. పురాధిదేవతయు ఆ రేయియే కన్నగికిఁ బ్రసన్నయై పూర్వవృత్తాంతము వినిచినది. ఇంతవఱకుఁ జూడ కోవలుని మృతి మఱునాఁటి యుదయముననే కన్నగికిఁ తెలిసినట్లేర్పడుచున్నది. పూర్వపు రాత్రి అనఁగా కోవలుఁ డంగడివీదికి వెళ్ళిన సాయంకాలమే పతి మరలిరాఁ డని కాని, యందులకై కన్నగి చింతించుచుండెనని కాని కవిచే సూచింపఁబడలేదు. అంతియకాక పైనుదాహృతవాక్యములచే వధింపఁబడిన నాఁటి సాయంకాలముననే యామె తన భర్తను కాంచినట్లు స్పష్టపడుచున్నది. కోవలుఁడు బయలుదేఱిన దెప్పుడు? అతని మరణవార్త కన్నగి విన్నదెప్పుడు? గొల్లలయాట జరిగిన దెప్పుడు? రాణి కలగన్నది యెప్పుడు? ఇవి పరస్పర సమయవిరుద్ధములై సమైక్యత కుదురకున్నది.

పూఁతచే నలదారు - పొంజాయ మేను
ధూళి ధూసరముచేఁ - ద్రుంగఁదగినదె ?
ఈ చెడు దుఃఖంబు - హేతువు గాఁగ
రాజ దండనము కా-రణ మిది యనుచుఁ
బూర్వ దుష్కృత మని - పొలుపుగఁ దెలుపు ౭౦
వార లీ రాజ్యాన - వరలుచున్నారె ?
సాయ మొక్కఁడు లేక - సంజ దుఃఖించు
నేకాకి నైన నా - యెదుట మాలికల
మఱుఁగుపడిన బొమ్మ - మంటఁ బొర్లాడు
చుండంగఁ దగినదే ? - యో మనోనాథ ! ౭౫
ఈ మహిఁ దూర్పెత్తి - యీసడ వెట్టఁ
బాడ్యుండు దుర్భర - పాపంబు నేయ
నీ సంభవము వధి-యింపఁగాఁ దగిన
నీ కర్మ ఫలమని - నెనరునఁ దెలుపు
నరు లొక్కరేని యీ - పురమున లేరె ? ౮౦
కన్నీరె కూఁడుగాఁ - గలఁగుచు నున్న
పాపిని నైన నా - పజ్జనే మీఁదు
గాయమ్మునుండి ర-క్తము కాఱుచుండ
దుమ్మునఁ బడియుండు - దోస మెవ్వరిది ?
ప్రజలు స్వదోషమ్ము - పగటించి పలుకఁ ౮౫
బాండ్యుండు దుర్భర - పాపంబు నేయ
నిది సంభవించిన - దిట్లుండ నీదు

తొలిబాము దుష్కర్మ-ఫలము కాంచుమని
యరయించు పుణ్యు లీ - పురమున లేరె ?
పరమ చండాలుఁ డీ - ప్రభువున్న యూరఁ ౭౦
బతిరత లొకరేని - పరఁగుచున్నారె ?
పతులు కష్టమ్ములు - పడ సహియించు
పతిరతల్ గలవారె ? - పతిరతల్ గలరె ?
పెద్ద వారున్నారె ? - పెద్దలున్నారె ?
పరుల బిడ్డలఁ గాంచి - భరియించి పెంచు ౭౫
పెద్ద లున్నారొకో ! - పెద్దలున్నారె !
పరమ చండాలుఁ డీ - ప్రభువున్న యూరఁ
దేవుఁడు నున్నాఁడె ? - దేవుఁ డున్నాఁడె ?
నా పతిఁ గత్తితో - నఱకి కలంక
మైన, దుష్పాలన - మందిన యూర ౮౦
దేవుఁడు నున్నాఁడె ? - దేవుఁ డున్నాఁడె ?
అని పరిదేవించి - తన పతి బొమ్మ
తన బొమ్మనం జేర్చి - తడవుచున్నంత
మగఁడు సజీవుఁడై - మగువను గాంచి
నిండు చందురుఁబోలు - నీ నెమ్మొగమ్ము ౮౫
వాడినదే యని - బాష్పముల్ తుడిచి
నేల ఋణము నాకు - నీఁగిన దనుచుఁ
బరమ పతివ్రత - భర్తపాదములఁ
బట్టి వెక్కుచు నేడ్వ - స్వర్గంబు చేరఁ

జను వా(డు భువి నుండు-మని సతి వీడి ౧౦౦
వేల్పులతో విను-వీది( దా నే(గె
మగ( డిట్టు పలుకుట - మాయయో ? మదికి
విభ్రాంతి( గలిగించు - పెను దయ్యమేమొ ?
మఱి యేమొ ? యెటకేగి - యరయుదు నాథు
నీ పలుకులు సత్య - మెన్నడు( గావు ౧౦౫
నా కిన్క శాంతి నం-దక మున్న యేను
పతితోడ( జన(జాల( - బరమ దుష్టుండు
నవిమృశ్యకారి యా - నవనీశు( గాంచి
కతమేమొ యడిగెద(-గా కని లేచె
ఎడరు పుట్టించిన - చెడు కల ఫలము ౧౧౦
కనుల బాష్పము లుర్ల(-గా నిల్చి తల(చె
నిలిచె( దల(చె( గంట - నీరంబు గార్చె(
దుడువక బెడిదంపు - నడకతో( బఱచె(
బఱచి రాచ నగరి - వాకిట నిలిచె.

---

## ౨౦ న్యాయ వచనము

మంజ॥ అట( జెలీ ! మన్నీని - యచ్చంపు గొడుగు
ప్రభు దండమును క్రింద( - బడ మొగసాల(
గల గంట చప్పుడు - కలను గాంచితిని
అదరె దిక్కులు క్రమింగె - నక్క( జీ(కటులు
పట్టి మింటను రేయి - కొఱ్ఱు గాన్పించె ౫

పట్ట పగటఁ గాంతి - పర్విన మింటి
నుండి మండుచునున్న - యుల్కలు రాలె
నిది యేమి హేతువో - యెఱుఁగంగరాద
లేచి చూతును గదా ! - లేమ ! యేమందు

—: గర్భము :—

అవనీశు డండమ్ము - నచ్చంపు గొడుగు ౧౦
మంట మడఁగి పడె - మా దొర ముందు
గంట నా యెదవలె - గడగడ వడఁకె
పట్టి మింటను రేయి - కొఱ్ఱు గాన్పించె
పగటనే యుల్కలు - పలపల రాలె
దిక్కులతో భూమి - తీఁగ నా నదరె ౧౫
నాపద రాఁగల - దని మదిఁ దోఁచె
విభుని కియ్యది విని-చింతమా యనుచుఁ
గోప్పెరుందేవి పల్కుడుఁ జెలువలును
కాంతులు గల యలం-కారముల్ గొనిరి
ప్రత్తిఁబట్టయుఁ బట్టు - వలువ గైకొనిరి ౨౦
ముకురమ్ము గొనిరి మే - ల్బొట్టు చేకొనిరి
పోఁక లాకులు సున్న-మును కేలఁ గొనిరి
కొనిరి కస్తూరిని - కొనిరి పొంబొడియుఁ
గొనిరి పూ మాలికల్ - కొనిరి జల్లియును
కొనిరి ధూపమ్మును - కొనిరి గంధమ్ము ౨౫
కుఱుచలు మూఁగలు - గూనులు నైన

దాసీజనము చుట్టి - దైవాఱ నుంద్రి
ముత్తైదువలు చేరి - మొగిని చిరాయు
రస్తని దీవింప - ననుఁగుఁ గత్తియలు
హెగ్గడి కత్తెలు - నిరువంకఁ జనుచు 30
నడుగడుగునకు గుణా-వలిఁ బొగడ
నల్లనల్లనఁ జని - యవనీశ్వరుండు
పేరోలగము సింహ-పీఠిపై నుండి
సలుపుచుండఁగఁ జేరి - తెలుపుచునుండ
మతి యడుగంటి ధ - ర్మము నశియింప 35
నీతిమాలిన కడు - నీచు దరిద్రు
నగరివాకిలిఁ గాచు - మగలెంకలార!
తనపతిఁ బోఁగొట్టు-కొనిన యొక్కర్తె
యొక యందె చేఁగొని - యున్నది నగరి
వాకిట నని జన-వరునకుఁ దెలుపుఁ 40
డీ యని కన్నగి - యీసునఁ బలుక
దౌవారికుం డేగి - ధరణీశ్వరునకు
జయము మలయమేలు - సామికి జయము
ధర్మమార్గము తప్పఁ - ద్రొక్కని పాండ్య
నాయకా! అవధారు - గాయమ్మునుండి 45
చిఱ్ఱు చిఱ్ఱున లేచి - వత్తైన నెత్రు
పీడని మొండెంపుఁ - బీఠము నెక్కి
బల్లెమ్ము గొని తాండ-వ మ్మొనరించు

భీకరమూర్తియౌ - వేలుపు గాదు
కన్నెలేడ్వురలోనఁ - బిన్నదియైన ౫౦
యా పిడారియుఁ గాదు - శ్రీపార్వతీశుఁ
దాండవింపించు రు-ద్రాణియుఁ గాదు
భయదాటవి వసించు - వనదుర్గ గాదు
వీరుఁడౌ దారుకు - పేరురమ్మవియుఁ
జీలుచు నమ్మహా - కాళియుఁ గాదు ౫౫

తన తలంపే రూపు - తగఁ గొన్నయట్లు
మితి మీఱు కోపమ్ము - మేవిన యట్లు
కెరలి బంగరు టందె - కేలఁ బట్టినది
కూరిమి పతిని పోఁ-గొట్టు కొన్నయది
వాకిట నిలిచెను - వాకిట నిలిచె ౬౦

ననుడు రమ్మనుఁడు తో - కొనిరండు పొండు
త్వర నని పాండ్యుఁ డు-త్తరు వొసరింప
వాఁడు మరలి వచ్చి - వనితఁ గొంపోయి
మన్ననిఁ గాన్పింప - మదఁతియు నెదుర
నిలువఁ బ్రభుండు క-న్నీరొల్క నిలుచు ౬౫
నీవెవ్వతవు పని - యేమని యడుగఁ
దెగువ యెడందతోఁ - దెఱవ యిట్లనియె
అరయు తెలి విసు-మంతయు లేని
యెడ్డె భూపాల ! నీ - యెదుట వచింప
వలసిన యర్థంబు - గల దొండు వినుము ౭౦

వేల్పులు తమలోన - విస్మయమందఁ
బావుర పిట్టకై - వపువిచ్చువాఁడు
మొగసాల గంట నా-లుక చలియింప
మొదవు నశ్రులు తన - యెద నుడికింపఁ
బ్రియతనూజుని తేరి-క్రిందఁ ద్రొక్కించు ౭౫

నట్టి రాజేలు పు-గాఱు మా యూరు
తవిలి యయ్యూర గా-రవముతో నలరి
గొప్ప కీరితి గాంచు - కులమువాఁడైన
మాసార్థవాహు కు-మారుఁ డత్యధిక
ధనము సంపాదింపఁ - దలఁచి దుర్విధియుఁ ౮౦

ద్రోవ నీ మధురకుఁ - దోడ్తోడ వచ్చి
యరుదైన నా కాలి - యందియ నమ్మఁ
దలఁచి నీచేత న-ధర్మ పద్ధతిని
వధియింపఁబడిన కో - వలు భార్య నేను
నన్ను కన్నగి యంద్రు - నరనాథ ! యనిన ౮౫

అంగనా రత్నమా ! - దొంగను చంపు
టెన్న దుర్దండన - మెట్లగు ననుడుఁ
గన్నగి యాతనిఁ - గాంచి యిట్లనియె
ఓయి వెడఁగు ఱేఁడ ! - ఓయి దుర్భగుఁడ !
నాయందెలోనివి - నాణెమౌ మణులు ౯౦

చూడుమ యన ఱేఁడు - చోద్యంబుతోడ
మాయందెలోనివి - మౌ క్తికరాజి

యనుచుఁ దెప్పించి యా - యమ స్రోలనుంచెఁ
కన్నగి తనయందెఁ - గడు నుగ్రరీతి
నవనిఁ బగుల వ్రేయ - నందొక్క కెంపు ౯౫
వెగడుకుడుచు తేని - మొగముపైఁ బడియె
నమ్మణులం గాంచి - యవనీశ్వరుండు
ఛత్రమ్ము వ్రీల రా-జ ద్రాజదండ
మల్లాడిపడఁగ నా - కల్ల కంసాలి
పలుకులు విని పాడి - కలఁక గావించు ౧౦౦
నేను రాజును గాను - నేనె చోరుఁడను
నేనె చోరుండను - నేనె చోరుఁడను
ప్రజలను కన్న పా-పల వలెఁ గాచు
పాండ్యరాజుల పరి-పాలన నేఁడు
కలుష దూషిత మయ్యె - ములుచ నా వలన ౧౦౫
నో మృత్యుదేవతా ! - యుగ్రంపు నడక
గొనివచ్చి నన్ను ౼ గ్రమిం-గుమ యని చేష్ట
దక్కి దబాలున - ధరణిపైఁ గూలె
రాణిగుండియ లఱ్ఱె - రాపడి నిలిచె
నొడలు వడంకాడె - నొడయని నీఁగు ౧౧౦
సతులకుఁ జూపంగఁ - జాలిన దొండు
జగతి లేదని పతి - చరణముల్ దాఁకి
నేలకు వ్రాలి య - న్నియతాత్మ దొరలెః

ఉ॥ ధర్మము దప్పువారలకు ధర్మమె పీడనిమిత్తి యంచిలన్
ధార్మికు లాడువాక్యములు దబ్బఱగావు నిజమ్ము పూర్వ దు
ష్కర్మముచేతఁ బాండ్యవిభుకాంతయుఁ గన్నగియున్ భజించుప్రా
క్కర్మఫలంబులం గుడువఁ గాంచిన సంచును గాంచుఁడీ జనుల్.

ఉ॥ ఆయమ యొంటి యందుకము నాయమ కన్నుల నీటివెల్లువన్
ఆయమ కాంతిదప్పిన శవాకృతియున్ వన గుల్మరీతిగా
నాయమ మేని నిండ జలదాకృతిఁ గప్పిన నీలపుం గురుల్
పాయక కాంచి పాండ్యపతి బమ్మెర నిల్వునఁగూలె ధాత్రిపై.

చ॥ అలమిన మేని ధూళి విరియంబడి కప్పినకప్పు వెంద్రుకల్
చెలువ కరంబునం దమరు చిన్నపు టందియ యశ్రు పూరమున్
అలుకునఁ గాంచుచో నపజయంబు భజించెను పాండ్యభూపుఁడ
ప్పొలఁతుకవాక్యముల్ చెవులఁ బొందినమాత్రనవీడెఁ బ్రాణముల్

## ౨౧ ప్రతిన

మంజ॥ పాండ్యునిదేవి స్వ-భర్తఁ గోల్పోవఁ
బాలైన దుష్క-ర్మ-రాలనొ నేను
తప్పింత యెఱుఁగని-దానన యైన
తేపు చేసిన కీడు - మాపునఁ గుడువఁ
గలుగు తీరైనవి - కర్మఫలములు ౫
వన్ని వృక్షంబును - బావిని శర్వు
లింగంబు కరులుగా - రంగారఁ దెచ్చి

పలువు రెఱుగఁ బట్ట-పగట సాక్ష్యంబు
పలికించినట్టి యా - వణిజు కన్నియయు [1]
ఆటలాడ నిసుక - నమరుచు బొమ్మ ౧౦
నీభర్త యగునని - నెలఁతలు పలుక
నమ్మి యింటికిఁ బోక - నర్మిలితోడ
నలలు దాఁకక పోవ - నిలిచిన పడుచు
కరికాలచోళుని - గాదిలి పట్టి
'ఆదిమంతి' యను న - య్యమ తాను వలచు ౧౫
వంజి నగర రాజ - వరు 'నాట్ట నత్తి'
యను వానిఁ గావేరి - యణఁచి కొంపోవ
నేటివెంటం జని - యెట నుంటి వనుచు
వాపోవ నవ్వాని - వనధి తోడ్తెచ్చి
యీయ నలమికొని - యేతెంచి నట్టి ౨౦
పతిభక్తినిరతయౌ - స్వర్ణ లతయును
వన నిధి తీరస్థ - వనమున నుండి
వచ్చెడి పడవలఁ - బరికించుచుండి

1. వైప్పూరిలోని దామకుండను వణిజుని కూఁతుండ్రేడుగురలో పిన్నది యగు కన్నెయు ఆమెయత్తకొడుకును దారిఁబట్టివచ్చి తిరుమరుగల్ అను నూరఁ దిగియున్నయెడ పాము కాటుచే వాఁడు చావ, నక్కన్నె యేడ్చుచుండ నచ్చటికి విచ్చేసియుండిన జ్ఞానసంబంధమూర్తి జరిగినది యెఱిఁగి వానిని బ్రదికించి అట నుండిన వన్నెవృక్షము, బావి, లింగము, సాక్షులుగాఁ బెండ్లాడుఁడని యాజ్ఞయిడియె. వారట్లు సతీపతులై మధురకుఁ జన్నమీఁద నా కన్నియ సవతి నిందింప పై మూఁడును సాక్ష్యము పలికె. అందలి దేవునకు సాక్షినాథుఁడను పేరుకలిగె.

భర్తరాఁ దన శిలా-భావంబు వీడు
నట్టి మహా మహి-మాధ్యయౌ సతియు[1] ౨౫
తోడుగాఁ గల సవ-తుకబిడ్డ బావిఁ
బడఁ గని లోకులు - సడి పూన్తురంచుఁ
దన సుతుఁ గూడ నూ-తం బడద్రోచి
యవల నిర్వైర నెత్తు - నా మడంతుకయు
నితరుఁ డొక్కరుఁడు త-దేక మనస్కుఁ ౩౦
డై తన్ను గాంచ నా - నాతి స్వాననము
కోఁతిమొగమ్ముగఁ - గొని యుండి భర్త
రాఁ దొంటి రూపమ్ము - రహిఁ దాల్చు సతియు
అబలలు గోలలం - చరసిన పెద్ద
లాడు వాక్యముల ల-క్ష్యము లేని వెడఁగ ౩౫
నగు నేను సైకత-మం దాడుచుండి
నాచెలిఁ గాంచి నే - నవలసు గన్న
నీ కొడుకున కిత్తు - నీవన్నుఁ గన్న
నా కొడుకున కిమ్ము - నాతిరో! మనము
వియ్య మందుదమని - వేడుకకనిన ౪౦
పలుకులు పాడిగాఁ - దలపోసి యామె
తన కూఁతు నా యింటి - కనుప న త్తరుణి
తగు నలంకృతులతోఁ - దన తల్లి వాక్కు

1. సంపాదింపఁ బోయిన భర్త వచ్చుదనుక నొక యిల్లాలు శిలయై యుండి భర్తవచ్చు పిదప నెప్పటి రూపొందెను.

పాలింప వచ్చిన - పద్మదళాక్షి
మున్నగు పెక్కండ్రు - బొడము పుగాఋ ౪౫
నందు పుట్టిన యేను - నట్టి పేరొందు
నన్నులమిన్నగా - నగు ప్రాప్తియున్న
రాజుతో నీమధు-రా నగరమ్ము
బూది గావింతు నో - పొలఁతిరో! నీవు
నరయుదుగాకని - యూరాచనగరు ౫౦

వీడి వెలికివచ్చి - వీటఁ గలట్టి
మానవులార! య-మర వరులార!
మునులార! నా పంత-మును వినుఁడీరు
నా మనోహరుఁ జంపు - భూమీశపురము
పై గిన్కఁ బూనితిఁ - బాపమ్ము గాదు ౫౫
కాంచుఁడీ యని కుడి - కరమున నెడమ
స్తనమును వడివైచి - చలమున లాగి
కేలెత్తి పురిఁ బ్రద-క్షిణముగాఁ దిరిగి
విసరివైచుడు నది - విలయాగ్ని కరణి
రేఁగి నీలపురంగు - జేగురు జడలు ౬౦

తెల్లని కోఱలు - తెఱలు జ్వాలలును
గల యగ్ని దేవుఁడై - కనఁబడి నిలిచి
యో సతీ తిలకమా! - యొకమాట వినుమ
ఈ నగరమ్ము నీ - కెగ్గు తలంచు
నానాఁడె దహియింప - నాజ్ఞను మున్నె ౬౫

పొంది యున్నాఁడఁ గా-వున నిట బ్రదుక
వలసిన వారేరొ - నెలవిమ్మ యనఁగ
విప్రులు ధార్మికుల్ - వృద్ధులు పసులు
పసి బిడ్డలును పతి-వ్రత లగు వారి
వీడి విజృంభించి - వే కాల్చ మనుచుఁ ౭౦
బ్రేరేపఁ జెలరేఁగె - వీతిహోత్రుండు

## ౨౨ పుర దహనము

మంజ॥ కన్నగి ప్రేరణ - గొన్న య వ్వహ్ని
విచ్చలవిడి రేఁగి - విన్నంటఁ బెరిఁగె
నగరదేవతలైన [1] - నల్వురు దేవ
ళమ్మలు వీడిరి - బొమ్మనుమున్నె
పాండ్యుండు దొసఁగుకై - ప్రాణముల్ బలిగ ౫
నొసఁగి భూమికిఁ దెల్పు - నెసకమ్ముతోడ
సతితోడఁ బైడి యా-సనమున నుండి
మరణించు టెఱుఁగక - గురుఁడు మంత్రులును
వ్రాయసకాండ్రును - న్యాయాధిపతులు
రాజబంధులు కర-గ్రాహులు సేవ ౧౦
కులు వచ్చి చిత్రాకృ-తులఁ బోలె నిలువ
సాయుధ వీరులు - సారథుల్ రథిక

1. ఇంద్ర వరుణ యమ సోములు.

వరు లాశ్వికులును మా-వంతులు గలిసి
రాచవాకిట నగ్గి - రాఁజుట గాంచి
గుమిగూడిరి, ముత్యాల - కోవ ధరించు ౧౫
నెలఁబోలి బ్రహ్మయ-జ్ఞియముతో నున్న
యాది భూతము, నెఱ్ఱ-నగు కాంతి మేను
రాజనకుం బోలె - రాజిల్లు ఛత్ర
చామరములు మురజ-ము నంకుశమ్ము
ధ్వజము ఖడ్గమ్మును - బల్లెమ్ము పాశ ౨౦
ములు గల్గి పాండ్యుని - బోలిన యరిది
త్రాణచే నొప్పారు - రాజభూతమును
బొన్నంపు మైచాయ - సుస్థిర మహిమ
గలిగి కిరీటమ్ము - ఖడ్గమ్ము లేక
తులయు నాఁగలియుఁ జే - నలర లోకముల ౨౫
సేద్యముచే సాకు - జీవితమంది
బాలచంద్రధరుని-బోలె వెలింగి
వాసికి నెక్కిన - వైశ్య భూతమును
పులు గడిగిన నీల-పు మ్మణిఁ బోలు
నొడలితో నీలంపు - యెల్లియఁ దాల్చి ౩౦
జగముల నేలంగఁ - దగిన హాలమ్ము
మున్నగు నాయుధ-ముల ధరియించి
విద్వద్వినుత మయి - వెలసిన యీవి
గలిగి యెల్లప్పుడు - కలకల మమరు

కలఁకున బలిగొను - కాఁపు భూతమును ౩౫
పంతునఁ గనఁబడి - పాండ్య భూ విభుఁడు
తగవుమాలిన తఱిఁ - దప్ప కీ పురము
బూదియౌ నను మాట - మున్నె యెఱింగి
యుంటిమి గావున - నొప్పుగ నిచటు
వదలి పోవుట పాడి-గద ! యని స్తనము ౪౦
తో నగరముఁ గాల్పఁ - బూనిన సతికి
దెలుపుచుఁ దలకొక్క - తెరువున నరుగ
తేరువీదులు నాల్గు - తెగల వీదులును
అంగళ్ళవీథి ధా-న్యము లమ్ము వీథి
మొదలగు వీదులు - మున్నర్జునుండు ౪౫
ఖాండవమ్మును గాల్చు - కాలానఁ బోలెఁ
గలఁతనొందఁగ ధార్మి-కులును విద్వరులు
గల కడ కేగక - చలపట్టినట్లు
పాపులు నీచులు - పరఁగు వీథులను
జ్వాలలు చెలరేఁగఁ - బసులును వాని ౫౦
దూడలు ధర్మ బు-ద్ధులు - గల గొల్ల
వాడలఁ జేరెను - వారణములును
పిడులు తేజులు కోట - వెనుక కేగినవి
పడఁతులు తమతమ - భర్తల వీడి
పడకలనుండి పూ-వడములు రాల ౫౫
నెయ్యంపు టలుకను - నెట్టి యవ్వలకు

వలమత్తు ద్రావి పై - పయి నాడుచుండు
నాటలు డిందఁ బె-న్నలమట చెంద
తడఁబడు నొడువులు - నడలు చెన్నారు
పాపల నిద్దుర - లేపి వృద్ధలగు ౭౦
నింతులఁ దోకొని - యెచటికో యేగ
అతిథుల నోము గృ-హస్థధర్మముల
వదలని గరితలు - ముదమంది ప్రియుని
నీఁగి యందియఁ గొని - నృపుని జయించు
వనిత స్తనమ్ముతో - నొనరించు నేఁత ౭౫
క్రూరమ్ము కాదని - కోరి పావకుని
వినుతిచేసిరి మ్రొక్కి - వేవేల విధుల
నఱువదినాల్గు వి-ద్యల నేర్చి తేఱి
సంగీత మరసిన - చామల వీది
నాట వెలఁదు లాడు - నాట పాటలను ౮౦
వీణాదికమ్ముల - వీడి రంగమ్ము
దాఁటి యేదేశపుఁ - దరుణీతిలకమొ ?
ఎవ్వరి కూఁతురో - యీ నగరమునఁ
దన పతిఁ బోఁగొట్టు-కొని వివేచనము
డిందిన ప్రభుఁ దన - యందెతో గెలిచి ౮౫
పుర మగ్ని కాహుతిం - బొనరించె ననుచుఁ
జింతతో నురుఁగ నం-చిత సంధ్య జరుగు
నుత్సవములు వేద-యుత రావములును

దేవపూజనములు - దివ్య హోమములు
ఇలువేలుపుల పూజ - లిండ్ల దీపములు ౮౦
వాద్యఘోషములు లే - వని పెద్ద యూరఁ
దనభర్తఁ గాంచఁ జా-లని చింతచేత
మగువ మండి కొలిమి - మాడ్కి నిట్టూర్పు
వడి నూర్చి వీదుల - నుడివడి తిరుగుఁ
దిరిగి సంతాపించుఁ - దిరిగి తపించి ౮౫
సందు వీదుల నిల్చు - సందుల నిల్చి
వెలలును వెలలి వి-హ్వాలత భజించు
మైమఱచు మఱచి - మఱుఁగు నలంగు
నుమ్మలికించు న - ట్లోర్వంగ రాని
వేదన నొందుచు - వెగచుచుఁ గోప ౯౦
మాఱక కుందు న - య్యతివకు నెదుట
నుజ్జ్వల జ్వాలల - నుడికి తపించి
సైఁపఁజాలక మధు-రాపుర దేవి
కనులకు నయ్యెడఁ - గానంగ వచ్చె.

తే॥ లోక భీకరముగ దురా-లోకనముగ
స్తనము నూడ్చి నిల్చిన వీర - తరుణి యెదుర
శంకరుల పత్ని లోనఁగూర్చు - జయము వలన
నలరు మధురాధినేత్రి ప్ర-త్యక్షమయ్యె.

## ౨౩. పూర్వజన్మ వృత్తాంతము

మంజ॥ జడయందు లేఁ జందు - రుఁడు కాంతి మోము
తెల్లకోఁటలును ము - త్తెముల పల్వరుస
ఎడమ నిరుల రంగు - కుడి పైఁడి రంగు
ఎడమచేఁ దామర - కుడిచేతఁ గత్తి
కుడికాలఁ బెండేర - మెడమ నందియయుఁ ౫
గలయది పాండ్యుని - కులదైవ మగుటఁ
గలఁగి పెంజింతను - మలఁగుచునున్న
కన్నగి యెదుటఁ జ - క్కన నిల్వలేక
పిఱుఁద వచ్చి నిలిచి - గరితల మిన్న !
కల దొక్క కొఱఁత ని - క్కము విను మనుడు ౧౦
వాడు మొగము కుడి - ప్రక్కకుఁ దిప్పి
నా వెన్క నిల్చిన - నీ వెవతుకవు ?
నా దుస్సహంపు బ - న్నమునకుఁ గతము
నరయఁ జాలుదె యన - నామె యిట్లనియె
నీ దుఃఖము కతంబు - నే నెఱుంగుదును ౧౫
అమ్మ ! నే మధురా పు - రాధిదేవతను
చింతించుదాన నీ - చెలువుని గతికి
నాద నొప్పించు వృ - త్తాంతంబు గలదు
మా ప్రభుండగు పాండ్య - మహివల్లభుండు
పూర్వ కర్మ ఫలమ్ము - పొందుట వినుము ౨౦

నీ పతి కబ్బిన - యాపద కతము
వినుము తెల్పెద నౌల - విశదంబు గాఁగ
విప్రుల నాలుక - విను శ్రుతుల్ దక్క
గంటల నాలుక - గల సద్దు వినఁడు
అడుగులఁ బడకుండు - నరి నృపుల్ గాక ౨౫

ప్రజలు నిందించు దు - ష్ప్రభుఁడు కాఁడెపుడు
మదమెచ్చ విద్దెయన - మావటీనికిని
యువ వారణము లొంగ - కొదరి యేగినను
స్త్రీలు కటాక్ష దృ - ష్టిం బ్రసరింప
నీ యున్నత కులీను - లీడరు మేర ౩౦

ఒకనాఁడు మధుర రా - జొక యింటి తలుపు
దట్టి దరిద్రుఁడై - తనరు కీరంతు
కాంత భూపతి రక్ష - గాక వేఱొండు
లేదైనను మఱుంగు - లేని గేహమున
నా రక్షణమె కాయ - దా ? యని కుంద ౩౫

నవ్వాక్కు కర్ణమ్మ - లందు సూదివలెఁ
గ్రుచ్చి కాల్పఁగ వడం - కును భయమందె
నట్టి రాజులకు న్యా - య్యమె వంశ గుణము
గా నొప్పు విభునకుఁ - గలుగదు కొఱఁత
కలికి ! మఱొక్క సం - ఘటనము వినుము ౪౦

పాడి యేల్బడి యందు - పావురా కొఱకుఁ
ద్రాసు నెక్కిన వాఁడు - తగ గోవు కొఱకుఁ

గొమరుని రథము చ - క్రము క్రింద దొబ్బ
నతఁడును వెలయు పు - గాఋ వంశ భవు
పాఁడి పంటలతోడ - బలిసిన చోళ ౪౫
దేశమ్మునందు ప - రా శరుఁ డనెడి
విప్రుఁడు భారత - వీర రణమున
నన్నంబు వెట్టిన - యడిదంబు దాల్చి
యఖిల సంపదలచే - నలరారు చేర
విభుని దాతృత్వంబు - విని వచ్చి యతని ౫౦
వలన స్వర్గము గోరు - పాఋలు వహ్ని
పూజతో వేదముల్ - పొలుపుగాఁ జదివి
పంచ యజ్ఞమ్ములు - పరఁగంగఁజేసి
కడఁక శమాది ష - ట్కము యజనాది
షట్కంబు గలిగిన - జన్ని గట్లొందు ౫౫
పదము దెలిపి నాల్క - వలన శాత్రవుల
గెలిచి విప్ర విజయ - కీర్తిచే వట్టి
క్రతువులతో బహు - మతులొంది తనదు
గ్రామంబు చేరంగఁ - గ్రమ్మఋ వాఁడు
పాండ్య రాజ్యంబున - వఋలు తంగాలు ౬౦
అను నగ్రహారాన - నవనీశ్వరుండు
దిగు మంటపమ్మున - దిగి కమండలువు
దండంబు గొడుగును - ధాన్యపు మూట
క్రింద నునిచి ధర్మ - మంద చరించు
ప్రభువరేణ్యుండు చి - రంజీవి యగుత ౬౫

మని సాగరమున వి - ఘ్నావలి సేయు
నరులఁ గదంబక - తరువుతో నఱకి
జగములకు శుభమ్ము - సమకూర్చు తేఁడు
సుఖియించుఁగాక వి - శుద్ధ ధ్వజాంక
మొలయ హిమాద్రిపై - నిలిపిన నృపతి ౭౦

యాయు రారోగ్య భా - గ్యము లందుఁగాక
యని మది మదిమది - ననుచుండు తఱిని
తల్లిదండ్రుల వీడి - తడఁబడు నడక
ముంగురుల్ కూఁకటుల్ - మురువుగా నాడఁ
దొక్కు పల్కులతోడ - మిక్కిలి వేడ్క ౭౫

నాడెడి పిల్లలా - బాడబుఁజేర
నాతఁడో బాలకు - లార! నాతోడఁ
జదువుఁ డీ మాట నొ - సంగెద ననుడు
వార్తికుండను పాఱు - వాని పుత్రుండు
దక్షిణామూర్తి నాఁ - దనరిన వాఁడు ౮౦

పాల్గాఱు నోటితో - బాలుర యెదుటఁ
దడఁబడు నాలుక - యడరువాఁడయ్యు
స్వరలక్షణము సుంత - జాఱక యుత్స
హించి యతని తోడ - నింపారఁ బలుక
మెచ్చి వాని తెలివి - మిక్కిలి పొగడి ౮౫

జందెమ్ముతోడ వ - స్త్రమ్ములు నగలు
కటకముల్ మొదలగు - కాన్క లొసంగి

తన యూరికి మరలె - దక్షిణామూ ర్తి
కట్టి తొడిఁగినవి - కాంచి యసూయ
ప్రబల వా ర్తికుఁ బట్టి - రక్షక భటులు ౯౦
నృపుని ధనమ్ము హ - రించినాఁడనుచు
బంధించు నంత నా - పాఱుని భార్య
వెక్కె నలందురె - వెల వెల వోయెఁ
బొరలె దైవము దూఱెఁ - బొగిలె దూపిల్లె
దుర్గాలయమ్మున - ధూప దీపాది ౯౫
కములు లేవయ్యె ద్వా - రము మూఁతపడియె
నది యెఱింగిన రాజు - మొదలు వృత్తంబు
వినిపింపుఁడన భటుల్ - విభునకు మ్రొక్కి
వా ర్తికు బంధించు - వైనమ్ము దెలుప
నది యోగ్యపథము కా - దని బల్కి నృపుఁడు ౧౦౦
వా ర్తికుఁ బిలిచి యొ - ప్పఁగ గౌరవించి
యవివేకులగు భటుల్ - దవిలించు దొసఁగు
కతన నాయేల్బడి - కడు నింద్య మయ్యె
క్షమియింపుఁడని క్షేత్ర - సంవేష్టితంబు
తంగా లనెడి యూరు - తగనిచ్చి మఱియు ౧౦౫
వయలూరు నొసఁగి య - వ్వా ర్తికు దార
కా ర్తికి దుఃఖమ్ము - కడముట్టఁ దొలఁగ
నేలపడంతికి - నెఱ తొమ్మొసంగి
కూడలి నగరానఁ - గొండల వంటి
దొడ్డ మేడలు విన - దుర్గాలయమ్ము ౧౧౦

తెలిచి యంతటఁబోక - తివిరి దొసంగు
లొనరించి నారల - ననువునఁ బట్టి
బంధించి యుంచిన - పగవారి వీడి
వారి వారి ధనమ్ము - వారికి నిండు
దొరకినదైనఁ బాఁ - తఱ నున్నదైన ౧౧౫
మఱి యెట్టిదైన నె - వ్వరి కెది దొరకు
వారిదే యగునని - వారణంబుపయి
భేరి వేయించిన - ధీరమానసుఁడు
పాండ్యుఁ డియ్యెడ నీతి - వదలిన కతము
వినుము కటక మాస - మునఁ గృష్ణపక్ష ౧౨౦
మందు కృత్తిక తోడి - దగు శుక్ర వాస
రమ్మున మధురా పు - రమ్మగ్గిఁ గాలు
నవనీశుఁడు నశించు - నను వాక్కుపుట్టె
జగతిఁ గళింగ దే - శమ్మున సింహ
పురమునను కపిల - పురమున వసువు ౧౨౫
కొమరుఁడు ననురాచ - కొమరులు పాలి
వారలు దమలోన - వారని కంటు
తలయెత్త నాజాము - డల కొలనున్న
నేలకై పెనఁగి పే - రాలంబు సేయ
నొల్లక యుండఁగాఁ - బెల్లుగ ధనము ౧౩౦
కూడఁబెట్టఁ దలంచి - కొలలేని విలువ
నగలఁగైగొని సింహ - నగరి కేతెంచి
యంగనతో నొక్క - యంగడివీథిఁ

జేరి గుట్టుగ సొమ్ము - చేకూర్చుచుండు
సంగముఁ దనువాఁడు - చాలియుండంగ ౧౩౫
వసువను నృపతికిఁ - బాలన మందు
తోడా నతఁడు భర - తుం డనువాఁడు
సడలించి నాఁ డహిం - సావ్రత మబల !
కఠినుఁ డోర్వని వాఁడు - కాంచి సంగముని
వీఁడు శాత్రవులకు - వేగని పట్టి ౧౪౦
విభున కొప్పించి చం - పించినవాఁడు
పడఁతి నీభర్త కో - వలుఁ డనువాఁడు
నిజము సంగము చాన - నీలి యఁగావెలఁది
దిక్కుమాలిన దయి - దీనత నొంది
సద్ధర్మమే యిది - క్షత్రియులార ! ౧౪౫
పాడిగాఁ దోఁచెనే - వర వైశ్యులార !
గుణుల పద్ధతియె పట్టణ వాసులార !
ఈ యూర మీరు లే - రే వేల్పులార !
అనుచు వీథులను న్యా - యస్థానములను
చుట్టి చుట్టి విసిగి - సోలి సొమ్మసిలి ౧౫౦
పదునాలుగవనాఁడు భర్తను గూడఁ
జననెంచి కొండ కొ - మ్మున కెక్కి నిలిచి
మాకు నీ యగచాట్లఁ - జేకూర్చువారు
తక్కక యిట్టి వం - తలఁ బొందువార
లని శాపమొసఁగె న - య్యది మీకు నిప్పు ౧౫౫

డనుభవింప వలసె - నన్నుల మిన్న !
దుష్కృత ఫలములు - తొడరెడి వేళ
సుకృత ఫలమ్ములు - చుమ్మాదు కొనవు
పడఁతి నీభర్తయుఁ - బదునాల్గు నాళ్లు
చనుడు వేలుపు రూప - మునఁగాక మనుజ ౧౬౦

రూపమ్ముతోఁదోఁపఁ - దేపున ననుచు
వగ మధురాధి దే - వత పూర్వ కర్మ
మెఱిఁగించి యటనుండి - తరలినపిదప
నాహృదయేశుఁది - న్నగఁగాంచుదాక
నెమ్మది గనరాదు - నిలువనుగాదు ౧౬౫

అని దుర్గ గుడికడఁ - దనకేలనున్న
వన్నియ గాజులంఁ - బగులంగఁగొట్టి
పురము పూర్వ ద్వార - మున భర్తతోడ
నొలసిన యే నిప్పు - డొంటరి నగుచుఁ
బడమటి వాకిట - వెడలెడి దాన ౧౭౦

నని పల్కరేఁ బవ - లను వాసి లేక
కర్తవ్య మేదియో - కానంగ లేక
భ్రాంత చిత్తయగుచు - వైఘతీరమున
మిట్ట పల్లమ్ములు - గుట్ట మెట్టలును
గండ్లు ముండ్లును లెక్క - గనక తా నడచి ౧౭౫

కడలి నడుము చీల్చి - క్రౌంచ పర్వతము
టొమ్ము చీలిచి యసు - రుల మార్చినట్టి

కొమరుఁ డున్నెడ[1] కెత్తి - గుట్టపై కెక్కి
నడచిన వేఁగి నీ - దను నిల్చి క్రౌర్య
మాచరించితి నని - యనుతాపమంది ౧౮౦

పదునాల్గు దినముల - పదపడి పతిని
కనఁదగు దినమిది - యని యుబలాట
పడఁ దన కీర్తిని - పలుమాఱు పొగడి
యలరులు కురియు చిం - ద్రాది దేవతలు
వచ్చి కన్నగికిఁ ద - ద్భర్తను చూపి ౧౮౫
మానుగ దేవ వి - మానమ్ము నందు
కొని పోయినారు నా - కుల లోకమునకు

చ॥ గరితలకుఁ విభూషణము కన్నగి వేలుపు రూపమంది ని
ర్జర వనితా జనంబులకుఁ జాలిన విందయి యొప్పె ధారణిఁ
బరమును గాన కొక్క తన భర్తనె కొల్చు సతీమణిఁ సురే
శ్వరుఁడును పూజసేయు నను పల్కు యథార్థమ యయ్యె దీనిచే.

గద్యము॥

మువ్వురు కిరీటాధిపతులఁ బాండ్యవంశ ధర్మపౌరుష రక్ష
ణంబులు తన్నగర వైభవంబులందలి యుత్సవంబులు వేలుపుల
రాక ప్రేమ మయులగు దేశప్రజలు వారి సంపత్సమృద్ధి వైభ
ప్రవాహ మహిమమ్ము కాలానుకూల వర్షమ్ము నర్థ ధర్మ ప్రతిపాద
కములగు జాతీయ జైత్ర క్రీడలు తీరు తీయములు గలిగి చెలఁగి
కోప్పెరుందేవితోడ సింహాసన మందపడి కెడసిన పాండ్యునితో నొక
యింత తెలియు నట్లమరిన మధురాకాండమను రెండవ భాగము.

సంపూర్ణము. 1913

---

1. తిరుచ్చెంగుణ్రూరు.

## ౩. వంజికాండము

### ౨౪. పార్వతేయుల యాట

మంజ॥ గుట్టనెక్కుచుఁచిన్న - పిట్టలఁదోలి
చిలుకలఁదఱిమి దో - నెల నెలయేళ్ల
మునిఁగివచ్చిన మాకు - ముందటనున్న
వేఁగి నీడనొకర్తు - వెలఁది మా యెదలు
నడుఁకంగ నొక్కస్తనము లేక గాయ ౫
పడి నిల్చియుండశ్రీ - వల్లిచందమున
మెలఁగు వారెవరని - మేము ప్రశ్నింపఁ
గనలక యామె దు - ష్కర్మ ఫలాను
భవమువేళను పాండ్యుఁ - బట్టణమెల్ల
నశియించునట్లు నా - నాథు నామధుర ౧౦
గోల్పడ్డ పాపాల - కుప్ప నే ననియెఁ
అన మేము భయపడి - యంజలిపట్టి
నిలువ వేలుపులు పూ - వుల వానకురిసి
పతితోడ నామెను - జతఁగొని చనిరి
తల్లిఁబోలిన కుల - దైవమ్మ మనకు ౧౫
వేఱులేని కతన - వేఁట పల్లియను
గల జనులార!యా - కలికిని కొలుఁడు
మలనెత్తమున వేఁగి - చలువను నిలుచు
వనితనే మేటి దై - వముగాఁగఁగొలుఁడు
ఏకస్తనియయిన - యెలనాగ కిప్పు ౨౦

డిమ్మల తఱుఁగని - ఫల మిచ్చుఁగాక
పలకలు తుడుములు - వాయింపుఁడీరు
మధ్యమ శ్రుతిలోన - మానుగఁ బాడుఁ
డలరుల యర్చన - మలరి చేయుండు
ధూపమ్ము వేయుఁడు - స్తోత్రగీతములు ౨౫
పాడుఁడు కంచియ - గోడ కట్టింపుఁ
డనుచు వేఁటరులలోఁ - బినపెద్ద పలుక
నామెఁ బూజించి రం - దతివలు పాడి
యంజనపుం బొడి - యరి దళపుఁబొడి
సిందూరపుం బొడి - చెదరంగఁ బరవ ౩౦
నింద్ర ధనువువోలె - నొసఁగుచుఁదావి
గలిగిన సెలయేటి - జలమందు కలిసి

పాట॥ ఆడుదమా చెలి యాడుదమా
ఆడుదమా నీ రాడుదమా
ఆడుదమా చెలి అంజకు మని పొ
ల్లాడి యందములఁ గొల్ల గొనుచు దయ
వీడిన యాతని వెల్ల మేఘములు
కూడు వనమ్ముల కొండ యేటిలో ॥ఆడుదమా॥

తే॥ గొడవ మనకుఁ బూనుచు వాని - కొండఱాలఁ
దగిలి వచ్చిన క్రొన్నీట - వెగడు పుట్ట
నేమి కారణమో యంద - టిట్లు కూడి
యాడినను మనసులు కుంది - వాడు టేల? ౧

తే॥ అతని కొండ పొంబొడి తోడ - నతికి వచ్చు
క్రొత్త వెల్లువపై నింత - కోపమేల ?
అట్టి నీటిలో నాస క్తి - నాడి నంత
నుల్లములు నొచ్చుచేలొకో - యువిద చెపుమ ? ౨

తే॥ అతని కొండ పూవులతోడ - నలరివచ్చు
క్రొత్త నీటిపై వెగటుచేఁ - గుందనేల ?
అట్టి నీటఁ గొందఱు మున్న - యాడిరేని
మన మనంబు లసూయచే - మఱుఁగుటేల ? ౩

తే॥ ఇంకఁ జాలును మన కను - లెఱ్ఱ వాఱఁ
దేట నీటమునిఁగి యాడి - తిమి పయోధి
మావి మ్రాఁకును నఱకిన - శీవి కాని
పొలుపు పాడి మండలముగ - గెలుపుటాట
యాడుదము రారె చెలులార ! - యాడరారె. ౪

ఉత్సాహ॥
కడలి నడుమఁజొచ్చి యసుర - కాంతు శూర పద్మ మా
మిడిగ నిల్చువాని నఱకు - మేటి భల్ల మమ్మరో !
అడరి యెఱ్ఱ మలను తెల్ల - యైన మలను చెందిలోఁ
దొడరి యేరక మనుచోట్లఁ - దోఁచు గుహుని చేతిదే. ౫

ఉత్సాహ॥
'పిణిముగ' మను నెమలినెక్కి - విమతుల పొలమార్పఁగా
నణఁగి వేల్పు దణి నుతింప - నరులఁ గూల్చు బల్లెమా
గణన కాఱు తల లిరాఱు - కైలు గలుగు సైనికా
గ్రణి కరంబు నం ధరింపఁ - గా వెలుంగు నట్టిదే. ౬

ఉత్సాహ॥
పెరుఁగుచున్న కొండఁజుట్టి - వెఱఁగు దోఁపఁదిరుగు న
య్యెఱచిదిండిటొమ్మచీల్పనెంచి కొంచమలకుఁ దూ
పరమొనర్చు మేటి యీఁటె కాశపుష్ప శయ్యపైఁ
బరఁగి యార్గురమ్మల చనుఁబాలుద్రావు వానిదే. ౭

ఉత్సాహ॥
చెలియ! మిరెపుఁ దీవలుల్లసిల్లు కరువ వాఁడు నా
కొలయఁగూర్చు నొవ్వి దీర్చునొళ వెఱుంగమిన్ గుహుం
డెలసి వలచె నంచుఁ దల్లియెంచి వెఱ్ఱియాట యం
దెలిమి పూజరీనిఁ బిలుచుటెన్న నవ్వవచ్చెడిన్. ౮

ఉత్సాహ॥
చెలువ పెద్ద కొండవానిచే ఘటిల్లు నంగదన్
దొలఁపఁ బూజరీఁడు వచ్చుఁ దొయ్యలి! యిది నిక్కమేఁ
జెలువుచేష్ట నవ్వులాట చెలువుదోఁచు నతఁడు రా
నలఘు మూఢుఁడగు గుహుండు నరుగు దేర మోఱకే. ౯

ఉత్సాహ॥
తెఱవ! యతఁడొసంగు నొవ్విదీర్ప నతఁడె వచ్చునే
నరయఁగఁ బరిహాసపాత్ర మగుఁగదే వివేకినీ!
యెఱిఁగి యెఱుఁగ కట్లు వచ్చునేని [1] బల్లెదారియే
మొఱకు; గుహుఁడె వచ్చునేని మొఱకు మిన్న యతఁడగున్.

తరల॥ చెలువరో! మలనాటి మన్నెని చెలువు ఱొమ్ము ఘటించు సి
ల్గులఁ దొలంపఁగ బల్లెదారి వెలుంగ వచ్చునటే సఖీ!

1. గుహుని పూజారియు బల్లెముధరించి యాడెడివాఁడు కావున బల్లెదారి యనఁబడియె.

కల(క దీర్ప(గ వచ్చు నాత(డు కంటె మోఱకు సూ! గుహుం
డలర వచ్చిన నాత(డుం దనకంటె మోఱకు ధారణీ౹. ౧౦

ఆ॥వె॥ ఖిల్ల ఖల్ల ధారి - వెఱియాడు రంగాన
కమర వల్లితోడ - నెమిలినెక్కి
గుహుం(డు వచ్చు రా(గ( - గొండతే(డు మనల(
బెండ్లి యాడునట్లు - వే(డవలయు. ౧౨

ఆ॥వె॥ శివ కుమార! పరుల( - జెట్ట( బట్ట(గ(బోకు
నీకు( దగిన కొలము - నెల(త లేము
తలిరు( బోలు పాద - ములకు నమస్కృతుల్
చేయు వార మయ్య - చేరికావ. ౧౩

ఆ॥వె॥ కరువపట్టిపట్టి - కొఱవ కన్యకలకు
మేటి వేల్పు వయిన - నీటుకా(డ!
నీదు చరణములకు - నెఱి మ్రొక్కువారము
పెద్ద లరయుపెండ్లి - పెండ్లియనుచు. ౧౪

ఆ॥వె॥ కొఱవ తెఱవ తోడ( - గూడిన నీ చర
ణములకుంజోహారు - కొమరుసామి!
నీటి రేవుకడను - నిను మ్రొక్కువారము
నింద లేనిపెండ్లి - నందుకొఱకు. ౧౫

మంజ॥ అనిమేము పాడ(గా - నావలినుండి
వినిన యిమ్మల నాటి - విభుని యెదుటికి(
జని కేలు మోడిచి - వినతి నిల్పితిని
నిలిచి పల్కిన పల్కు - లెలమిని వినుము ౩౫

